FARIZA-E-IQAMAT-E-DEEN
(Telugu)

# ధర్మసంస్థాపనం మన బాధ్యత

మూలం :

మౌలానా సద్రుద్దీన్ ఇస్లాహి (రహ్మ)

అనువాదం :

కె.యం.ఎ. సుబ్‌హాన్

# విషయ సూచిక

**అయిదవ అధ్యాయం**





అనంత కరుణామయుడు అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# ముందుమాట

మానవుని జీవితానికి ఒక లక్ష్యం ఉండాలి. ఈ జీవిత లక్ష్యమే అతనికి ప్రాథమికమైన గౌరవాన్ని అందిస్తుంది. లక్ష్యరహితమైన జీవితం గడిపే వ్యక్తి నిజానికి మానవత్వం లేని మనిషిగా జీవిస్తాడు. ఆ లక్ష్యం కూడా ఏదో ఒక లక్ష్యం కాక, నిజమైన లక్ష్యంతో, ఆ లక్ష్య సాధనకోసం జీవించే మనిషినే 'ముస్లిం' అని అంటాం. కనుక, తన్ను తాను 'ముస్లిం' అని భావించే వ్యక్తి తన జీవిత లక్ష్యం గురించి స్పష్టంగా తెలుసుకోవడం, అతని అత్యంత ముఖ్యమైన, ప్రప్రథమయిన విధిగా ఉండాలి. ఈ కారణంగా ఒక ముస్లిం నిరంతరం జీవిత లక్ష్యాన్ని తన దృష్టియందు ఉంచుకొని – ఆ కేంద్ర పరిధిలోనే తన జీవితపు ఆచరణలన్నింటిని పరిభ్రమింప చేయవలసి ఉంటుంది.

ఈ చిరు పుస్తకం ఈ ఉద్దేశ్యంతోనే రచించబడింది. ఇస్లామీయ సమాజాన్ని, దాని సభ్యులను అత్యంత ప్రధానమైన ఈ 'లక్ష్యం' వైపుకు దృఢంగా, దీక్షతో మరలించే ప్రయత్నం ఇందులో చేయబడింది. సృష్టికర్త అల్లాహ్ ఈ కృషిలో సహాయపడాలని వేడుకొంటున్నాను. ఏ మాటలైతే సత్యం పునాదులపై ఈ గ్రంథంలో వివరించబడ్డాయో, అవి పాఠకుల మనోమస్తిష్కాలలో చోటు సంపాదించుకోవాలని, అలా లేని మాటల నుండి ముస్లింలు రక్షించబడాలని విశ్వప్రభువు అల్లాహ్‌ను వేడుకుంటున్నాను.

ఈ పుస్తకం (ఉర్దూలో ఫరీజయె ఇఖామతె దీన్) గతంలో రెండుమార్లు (ఉర్దూలో) ముద్రించబడింది. ఈ రెండు ముద్రణల్లో కూడా అచ్చు తప్పులు, విషయ క్రమబద్ధీకరణ పట్ల జాగ్రత్త వహించలేకపోయాను. ఆనాటి పరిస్థితుల్లో ఈ విషయాల పట్ల శ్రద్ధవహించే అవకాశం కూడా లభించలేదు. కాని, ఈ ముద్రణలో అల్లాహ్ సహాయసహకారాలు పూర్తిగా లభ్యమైనందువల్ల ముద్రణా లోపాల పట్ల, విషయానుక్రమణల పట్ల శ్రద్ధ తీసుకోవటం జరిగింది. భాషను సైతం వీలైనంత సరళం చేయడం జరిగింది. మరిన్ని అవసరమైన విషయాలను చేర్చడం, కొన్ని అనవసర విషయాలను తొలగించడం కూడా జరిగింది. ఫలితంగా పాఠకులు మరింతగా, ఈ పుస్తకం ద్వారా లబ్ది పొందే అవకాశం లభిస్తుందని భావిస్తున్నాను.

17 రజబ్ 1388 హిజ్రీ

**– సద్రుద్దీన్ ఇస్లాహి**

మొదటి అధ్యాయం:

# ముస్లిం సముదాయాన్ని ఉనికిలోకి తేవడంలోని ఉద్దేశ్యం

## ఉమ్మత్ విశిష్ట స్థానం

ముస్లిం సంఘం ఉనికిలోకి తేబడుతూ ఉండిన కాలంలో, ఈ సంఘాన్ని ఉనికిలోకి తెస్తున్నవాడు (సృష్టికర్త అల్లాహ్) ఈ సంఘం గురించి ఇలా సెలవిచ్చాడు: "ఇక నుండి ప్రపంచంలో మానవులకు మార్గం చూపడానికి, వారి సంస్కరణకూ రంగంలోకి తీసుకురాబడిన ఉత్తమ సమాజం మీరే." (దివ్య ఖుర్ఆన్ 3:110)

పై వాక్యంలో రెండు విషయాలు స్పష్టపర్చబడ్డాయి. 1. ముస్లిం సంఘం, ఈ ప్రపంచంలోని ఇతర సంఘాలన్నింటికంటే మంచిది, అత్యుత్తమమైనది అయివుంటుంది. మరి ఇతర ఏ సంఘమైనా, జాతి అయినా, తెగ అయినా, పార్టీ అయినా, సమూహమైనా, సైద్ధాంతికంగానూ తాత్విక భావజాలపరంగానూ, ఆచరణాత్మకంగానూ ఇస్లామీయ సంఘంలాంటిది అయివుండదు. (కున్‌తుమ్ ఖైర ఉమ్మతిన్). 2. ఆ ముస్లిం సంఘం ఇతర ప్రాపంచిక సంఘాలు, మతాలు, సమాజాల మాదిరిగా జీవనరంగ స్థలంపై యాదృచ్ఛికంగా తేబడలేదు. తద్భిన్నంగా, ఇది ఒక ప్రత్యేకమైన కార్యం కోసం, ప్రత్యేకంగా ఉనికిలోకి తేబడింది. ఈ ప్రపంచంలోని ఇతర సంఘాల, సమాజాలకు, ముస్లిం సంఘానికి మధ్యనున్న అత్యంత ప్రాథమికమైన తేడా ఏమిటంటే: ముస్లిం సంఘం (ఉమ్మత్) ఇతర సంఘాల, సమాజాలలోని ఒక సంఘం కాదు. ఇది సమస్త మానవ జాతికోసం, దాని ప్రత్యేక అవసరం కోసం, మార్గదర్శిగా ఉనికిలోకి తేబడి – ఇతర మానవ సమాజాల మధ్యకు పంపబడింది. ఇకపై అది ఎప్పటికీ తనకు యివ్వబడిన, విధిగా చేయబడిన ఈ కర్తవ్యంపై స్థిరంగా ఉండాలి. (ఉఖ్‌రిజత్ లిన్నాస్), ఈ విషయాన్నే చివరి దైవప్రవక్త, మహోపాధ్యాయులు ప్రవక్త

ముహమ్మద్ (స) తన బోధనల్లో 'మబ్‌ఊస్' అనగా పంపబడిన, 'మామూర్' అనగా నియమింపబడిన సంఘంగా సెలవిచ్చారు. "మీరు మృదువుగా కార్యకలాపాలను కొనసాగించేవారుగా చేసి పంపబడ్డారు. కఠినులుగా, ఇబ్బందులు కలిగించేవారుగా చేసి పంపబడలేదు." (బుఖారి గ్రంథం – 2వ సంపుటి)

అల్లాహ్, ఆయన సందేశహరుల (స) బోధనలనుబట్టి, ప్రపంచంలోని ఇతర మానవ సముదాయాలన్నీ ఒక వైపున ఉండగా – ముస్లిం సమాజం మాత్రం మరోవైపున వున్నట్లు స్పష్టమౌతోంది. ముస్లిం సమాజం ఒక ప్రత్యేకమైన జీవన విధానానికి హక్కుదారునిగా, ఉన్నతమైన విశిష్ఠమైన స్థానానికి అర్హురాలిగా ఉంటుంది. ఈ ప్రత్యేకతల, ఉన్నత స్థానాల కారణంగా, ఈ ముస్లిం సముదాయం భావనా స్రవంతిరీత్యా, జీవన విధానం దృష్ట్యా, శ్రద్ధాసక్తుల రీత్యా, విలువలపరంగా, ఇష్టాయిష్టాల ప్రమాణాలపరంగా తన సహజ నైజం రీత్యా, లక్ష్యాలు–ధ్యేయాలపరంగా ... ప్రతి ఒక్క కార్యరంగంలోనూ, జీవితపు వివిధ కోణాలలోనూ తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని కలిగి ఉంటుంది. ఈ కారణంగా మరి ఏ ఇతర సంఘమైనా, సమాజమైనా, ముస్లిం సంఘం కంటె ఉన్నతంగా, ప్రత్యేకంగా ఉండటం సాధ్యం కాదు.

## ఉనికిలోకి తేబడిన ఉద్దేశ్యం (ధర్మసంస్థాపన)

పై వివరణ వల్ల ముస్లిం సంఘం ఉనికికి ఒక ప్రత్యేకత, ఉన్నత ఉద్దేశ్యం ఉన్నట్లు తెలుస్తోంది. మరి ఆ ప్రత్యేకమైన, ఉన్నతమైన ఉద్దేశ్యం ఏమై ఉంటుంది? అనే విషయం ఇప్పుడు స్పష్టం కావలసివుంది. చివరి దైవగ్రంథం దివ్య ఖుర్‌ఆన్ ఈ ప్రశ్నకు "మీరు మంచిని చెయ్యండి అని ఆజ్ఞాపిస్తారు. చెడు నుండి ఆపుతారు. అల్లాహ్‌ను విశ్వసిస్తారు." (ఖుర్‌ఆన్ 3 : 110) అని స్పష్టంగా జవాబు ఇచ్చింది. అంటే, ఉనికిలోకి తేబడిన ఈ ముస్లిం సంఘం లేక సమాజం (ఉమ్మత్), సమస్త మానవాళిని చెడు భావాల నుండి, చెడు ఆచరణల నుండి ఆపాలి. సవ్యమైన, సత్యమైన మార్గం వైపుకు మళ్ళించాలి. ఈ ప్రత్యేకమైన కార్యం లేక ప్రత్యేక లక్ష్యసాధన కోసం సృష్టికర్త అల్లాహ్ రెండు పద్ధతులను తెలుపడం జరిగింది. అందులో మొదటిది, "సత్య(ధర్మ)సాక్ష్యం" (షహాదతె హఖ్). ఈ విషయంగా దైవగ్రంథం "మిమ్మల్ని

మధ్యస్థ సమాజంగా చేశాము. ఇకపై మీరు సమస్త మానవజాతికి సాక్షులుగా ఉంటారు" (ఖుర్ఆన్ 2 : 143) అని స్పష్టం చేసింది. సూరె 'హజ్జ్'లో కూడా పై వాక్యాల భావాలను ప్రకటించే మరో వాక్యం కూడా ఇదే విషయాన్ని (సాక్ష్యం ఇవ్వడాన్ని) తెలియపర్చింది. అల్లాహ్ చేత ఎవరికి ఏ బాధ్యత అయితే అప్పగించబడిందో దానికి సంబంధించిన సాక్ష్యం తప్ప మరే సాక్ష్యమూ అతని నుండి కోరబడదు. ఆ బాధ్యత ఎటువంటిదో – ఏ పనికి సంబంధించినదో – ఎవరి పని వంటిదో అనే విషయం కూడా వెంటనే "ప్రవక్త మీపై సాక్షిగా ఉంటాడు." (ఖుర్ఆన్ 2 : 143) అని తెలుపబడింది. మరి ఏ విషయమై విశ్వాసుల సమూహం ముందుకు సాక్ష్యం ఇవ్వడానికి స్వయంగా దైవసందేశహరుడిని (స) అల్లాహ్ పంపాడు? ఈ ప్రశ్ననే దీర్ఘంగా, లోతుగా ఆలోచించవలసి ఉంది. దైవ సందేశహరుల (స)పై ఏ సత్యధర్మం అవతరించబడుతూ ఉండిందో – ఆ సత్యధర్మ విషయంగానే తప్ప మరే విషయంగానూ ఈ సాక్ష్యం ఉండటానికి వీలులేదు. ఈ విషయమై మరో వాదనకు తావు లేనేలేదు. ఈ ధర్మం గురించి సాక్ష్యం ఇవ్వడానికి 'మధ్యస్థ సమాజాన్ని' కూడా ఉనికిలోకి తీసుకొని రావడం జరిగింది. ఈ సత్యధర్మ సాక్ష్యం కోసమే దైవ సందేశహరులు అవనిపైకి అవతరింపబడ్డారు. ఈ ధర్మాన్నే ధర్మమనీ, లేక సత్యధర్మమనీ మనం నేడు సంబోధిస్తున్నాం. ఈ సత్యధర్మం యొక్క మరో వివరణే 'ధర్మసంస్థాపన'గా ఉంది. ఈ విషయం దివ్య ఖుర్ఆన్‌లో "ఆయన నూహ్ ప్రవక్తకు ఆజ్ఞాపించిన ధర్మాన్నే నీకు కూడా నిర్ణయించాడు. దానినే (ఓ ముహమ్మద్ –స) ఇప్పుడు నీ వైపునకు మేము వహీ ద్వారా పంపాము. దానినే మేము ఇబ్రాహీమ్‌కు, మూసాకు, ఈసాకు బోధించాము. ఈ ధర్మాన్ని స్థాపించండి అని తాకీదు చేశాము" (ఖుర్ఆన్- 14: 13) అని స్పష్టపర్చడం జరిగింది.

హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) ప్రవక్త సహచరుల (ర) ఔన్నత్యాన్ని గురించి ఇలా తెలిపారు : "తన ప్రవక్త (స) సహవాసం కోసం తన ధర్మాన్ని స్థాపించడం కోసం అల్లాహ్ వారిని ఎంపిక చేశాడు" (మిష్కాత్). పై హదీసు ద్వారా ధర్మ సంస్థాపనా కార్యం కొరకు మాత్రమే ముస్లిం (ఉమ్మత్) సమాజం ఉనికిలోకి తేబడిందని అవగతమవుతోంది. దైవగ్రంథం దివ్య ఖుర్ఆన్, మరియు హదీసు వెలుగులో "మంచిని ఆజ్ఞాపించడం - చెడును నిరోధించడం" లేక "సమస్త

మానవజాతిపై సాక్షులుగా ఉండటం" లేక "ధర్మసంస్థాపనకై కృషి చేయడం" అనబడే ఈ మూడు అంశాలలో ఏ అంశమైనా స్వీకరించండి. దాని అంతిమ అన్వయింపులు ఈ మూడు విషయాలు ఒకదానిలో మరొకటి ఇమిడి ఉంటాయని గ్రహించాలి. పై మూడు పదబంధాలు ఒకే అంశం యొక్క మూడు వివరణలని మనకు అర్థమవుతుంది.

అయితే పై మూడు విషయాలను లోతుగాను, విశాలంగాను, సమగ్రంగానూ అధ్యయనం చేస్తే, ప్రతి కోణం నుండి పరిశీలిస్తే, చివరికి ధర్మసంస్థాపనా కృషి మాత్రమే సమగ్రమైనదిగాను, అన్ని అంశాలను తనలో ఇముడ్చుకున్నదిగానూ మనకు స్పష్టం అవుతుంది. ధర్మసంస్థాపన విషయంలో ఉన్న సమగ్రత, సర్వతోముఖ కోణం మిగిలిన రెండు అంశాలలో లేకపోవడం కూడా మనం గమనిస్తాం. మూడవ అంశంలోని సమగ్రతకు కారణం అందులో "ఇఖామత్" (సంస్థాపన) అనే పద ప్రయోగం జరగటమే. "ఇఖామత్" అనే పదానికి ఉన్న వాస్తవ అర్థాన్ని మనం రాబోయే అధ్యాయాల్లో తెలుసుకుంటాం. ఈ పదం తనలో ఒక సంపూర్ణతత్వాన్ని కలిగివుండీ, ఒక సమగ్రమైన విషయాన్ని స్పష్టపరుస్తుంది. "ఇఖామతె దీన్" (ధర్మసంస్థాపన) అనే పదం సర్వతోముఖమైనది. పై ఖుర్ఆన్ వాక్యంలో కేవలం ఈ 'ధర్మసంస్థాపన ముస్లిం ఉమ్మత్ విధి' అని మాత్రమే సెలవివ్వబడలేదు. తత్భిన్నంగా ఈ విధి ప్రతి ప్రవక్తకూ, వారి అనుచర సమాజానికి కూడా విధిగా ఉండింది. మరో మాటలో అల్లాహ్ పట్ల విశ్వాసం కలిగిన, ఆయన దాస్యాన్ని అంగీకరించిన, ఆయనతో వాగ్దానం చేసిన వారి కర్తవ్యం, విధి కేవలం ఈ ధర్మస్థాపనతోనే ముడిపడి ఉంటుంది. ఏ ధర్మాన్ని విశ్వాసుల సమూహం స్థాపించవలసి ఉందో, ఆ ధర్మాన్ని గురించి దివ్య ఖుర్ఆన్‌లో నొక్కి వక్కాణించడం జరిగింది. ఈ ధర్మాన్ని "అద్దీన్" అని ప్రత్యేకంగా పేరుపెట్టి మరీ చెప్పడం జరిగింది. అంటే ఈ ధర్మాన్నే అల్లాహ్ మీ వైపుకు పంపాడని స్పష్టం చేయడం జరిగింది.

పైన పేర్కొన్న ప్రత్యేకతల దృష్ట్యా, 'ధర్మసంస్థాపన' ఓ ప్రధాన పదజాలంగా మన ముందుకు వస్తుంది. కనుక ముస్లిం సమాజం ఉనికిలోకి తీసుకురాబడినది ఈ కర్తవ్య నిర్వహణ కోసమేనని ప్రస్ఫుటం అవుతోంది.

## ధర్మసంస్థాపన - దాని అర్థం

ధర్మసంస్థాపన అనే పదం రెండు ప్రత్యేక పదబంధాలతో ఏర్పడుతుంది.

మొదటిది 'ధర్మం' (దీన్) కాగా, రెండవది 'సంస్థాపన' (ఇఖామత్). కనుక ధర్మసంస్థాపన గురించి పూర్తి అవగాహన కలగాలంటే, పైన పేర్కొన్న రెండు పదాలకు ఉన్న అర్థ తాత్పర్యాలను స్పష్టంగా తెలుసుకోవడం అత్యవసరం. ఇఖామత్ (స్థాపన) అనే పదం ఖచ్చితంగా ఉపయోగించే సందర్భాలలో దీనిని నిటారుగా 'నిలబెట్టటం' (చక్కబర్చడం) గా ఉంటుంది. దివ్య ఖుర్‌ఆన్‌లోని అల్ కహఫ్ సూరాలోని 77వ ఆయత్‌లో "అక్కడ వారు కూలిపోనున్న గోడను చూశారు. ఆ వ్యక్తి ఆ గోడను మళ్ళీ నిలబెట్టాడు" అని చెప్పడం జరిగింది. మరికొన్ని సందర్భాలలో ఈ పదం సాధారణ అర్థంలో వాడబడినప్పుడు దాని అర్థం, 'హక్కు నెరవేర్చడం' గా ఉంటుంది. అంటే; సంబంధిత కార్యాన్ని పూర్తి అవగాహనతో, నిబద్ధతతో, సంపూర్ణ నిష్ఠతో, ఉత్తమ ప్రమాణంలో, అత్యుత్తమ నైపుణ్యంతో నెరవేర్చడమై ఉంటుంది. ఈ విషయమై విఖ్యాత నిఘంటుకారులు ఇమామ్ రాగిబ్ అస్ఫహాని ఇలా వివరించారు : "ఏదైనా వస్తువును స్థాపించాలని చెప్పడంలోని అర్థం, దాని హక్కును పూర్తిగా నెరవేర్చటం." అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు : ఓ ప్రవక్తా! చెప్పివేయండి, "ఓ గ్రంథవహులారా! మీరు మీ తౌరాతు (తోరా) మరియు ఇంజీల్ (సువార్తలు) లను స్థాపించనంతవరకు మీరు మీ ఏ మూలంపైననూ ఉండనేరరు." (అనగా, సైద్ధాంతికంగానూ, ఆచరణాత్మకంగానూ ఆ విషయం యొక్క హక్కు నెరవేర్చబడాలి." (అల్ ముఫ్రదాత్ నుండి).

పై వివరణను ఉదాహరణగా స్వీకరిస్తే, దివ్య ఖుర్‌ఆన్‌లో 'నమాజ్‌ను స్థాపించండి' అని ఆజ్ఞాపించడం జరిగింది. 'స్థాపన' (ఇఖామత్) అనే ఈ పదాన్ని నమాజ్‌తో ముడిపెట్టి చూస్తే, నమాజ్‌ను దాని బాహ్య స్వరూపంతో, దాని విధి విధానాలను పాటిస్తూ, నమాజ్‌లోని అంతర్గత సుగుణాలను అర్థం చేసుకుంటూ దానిని నెరవేరుస్తూ ఉండాలి. ఈ విధంగా నమాజ్ యొక్క అసలు ఉద్దేశ్యం ఉన్నతంగా నెరవేర్చబడుతూ ఉండాలి. అదేవిధంగా 'ధర్మసంస్థాపన' అనేది – ఆ ధర్మాన్ని ఆమోదించేవారు తమ జ్ఞానం, మరియు ఆచరణల ఆధారంగా, ఆ ధర్మం కోరుతున్న హక్కులను నెరవేర్చేవారిలా ఉండాలి.

ఇక 'దీన్' (ధర్మం) అనే పదానికి నిఘంటు అర్థం 'విధేయత', 'శిరసావహించటం' మొదలైనవి. ఇస్లామీయ పరిభాషలో సృష్టికర్త అయిన అల్లాహ్‌కు దాస్యం చేసే పద్ధతి – దేనినైతే అల్లాహ్ స్వయంగా తన ప్రవక్తల ద్వారా పంపించాడో ఆ జీవన

విధానం అని అర్థం వస్తుంది. ఈ ధర్మం తాలూకు పూర్తి వివరాలు సృష్టికర్త అల్లాహ్ చివరి జీవన సంవిధానం దివ్య ఖుర్‌ఆన్‌లోనూ, ఆయన చివరి ప్రవక్త (స) సదాచరణలోనూ స్పష్టంగా దర్శనమిస్తాయి. మానవ జీవితానికి సంబంధించిన సమస్త రంగాలు, కోణాలు, అందులోని సమస్యలు, వాటి పరిష్కారాలు అన్ని ఈ 'ధర్మం' (దీన్) పరిధిలో మనకు ప్రస్ఫుటమౌతాయి. ఈ ధర్మం మనిషి వ్యక్తిగత బుద్ధీ, జ్ఞానం, వివేకాల హృదయాంతరాళాల నుండి ప్రారంభమై అతని ఆరాధనలను, గృహసీమ నాలుగు గోడలను, వంశం-తెగ-బంధుత్వాల సముదాయాలను, తను పనిచేసే సంస్థలు - సంఘాలను, వ్యక్తి యొక్క సమస్త సాముదాయక వ్యవస్థలను, దేశ, జాతీయ, అంతర్జాతీయ సమస్యలను వాటి పరిధుల వరకు పరివేష్ఠించి ఉంటుంది. ప్రతి విషయంలోనూ, ప్రతి సమస్యకునూ, ప్రతి రంగంలోనూ తనదైన మార్గదర్శకాలను, పరిష్కారాలను అందిస్తుంది. మనిషి ప్రైవేట్ మరియు పబ్లిక్ జీవితంలో వేర్వేరు స్వేచ్ఛలను ఈ 'ధర్మం' ఎంతమాత్రమూ అనుమతించదు. అది మనిషి యొక్క అన్ని జీవన కోణాలను పరివేష్ఠించి ఉంటుంది. ఈ ధర్మం కేవలం విశ్వాసాల, ఆచార వ్యవహారాల, ఆరాధనల, నైతిక విలువల, నిష్ఠాతత్పరతల, నిబద్ధతల వరకే పరిమితమై ఉండదు. అది మూత్రశాలలకు సంబంధించిన సూత్రాలను, దాంపత్య-లైంగిక సంబంధాల నియమాలను కూడా తెలియపరుస్తుంది. నేరం-శిక్షలను కూడా ధర్మం విశదీకరిస్తుంది. అమలు పరుస్తుంది. పైన సూచించబడ్డ విషయాలన్నీ ధర్మం పరిధిలోనివేనని దైవగ్రంథం దివ్య ఖుర్‌ఆన్ స్పష్టం చేస్తుంది. "(తీవ్రమైన నేరం చేసినవారి పట్ల) కనికరం చూపే తలంపు అల్లాహ్ ప్రసాదించిన ధర్మ (నిర్వహణ) విషయంలో మిమ్మల్ని అడ్డుకోరాదు." (ఖుర్‌ఆన్ 24 : 2). కనుక, 'ఇఖామత్ (స్థాపన) మరియు 'దీన్' (ధర్మం)లను పై వివరణ వెలుగులో చూస్తే, స్పష్టమైన ఒక చిత్రపటం మన కళ్ళముందు సాక్షాత్కరిస్తుంది.

ధర్మస్థాపనలో ఒక వ్యక్తి - తన జ్ఞానం, ఆచరణలను పూర్తిగా వినియోగించడం జరుగుతూ ఉన్నప్పుడు, అల్లాహ్ యొక్క ఆదేశాలకు సంపూర్ణంగా తల ఒగ్గడం సంభవిస్తూ ఉన్నప్పుడు, మనిషి జీవితపు అన్ని కోణాలు 'ధర్మస్థాపన' పరిధిలో అనివార్యంగా చేరుతూ వున్నప్పుడు, మనిషి జీవిత సమస్యల సరిహద్దులు దాని (ధర్మం యొక్క) పరిధిలోనే ఉన్నప్పుడు, ధర్మస్థాపన యొక్క అవగాహన ఆ వ్యక్తిలో

ఈ క్రింది విధంగా ఉండితీరాలి. ఈ ధర్మంపై విశ్వాసం ఉంచినవారు ఈ ధర్మం గురించి సంపూర్ణ అవగాహన కలిగి ఉండాలి. ఈ ధర్మంలోని ప్రాథమిక విశ్వాసాలను, సిద్ధాంతాలను, నియమనిబంధనలను, ఉపదేశాలను, ఆజ్ఞలను, విధి విధానాలను, తెలుసుకొని ఉండాలి. ఈ ధర్మం యొక్క ధ్యేయం, లక్ష్యాలను స్పష్టంగా ఎరిగి ఉండాలి. ఈ ప్రపంచంలో తన స్థానం ఏమిటి? ధర్మం తన నుండి ఏమి ఆశిస్తుంది? అనేది తెలిసివుండాలి. తన ఉనికి అసలు ఉద్దేశ్యం ఏమిటి? ఆ ఉద్దేశ్యం వరకు చేరడానికి ఏ విధమైన కార్యాచరణను, మార్గాలను చూపుతుంది? ఏ విషయాలను నెరవేర్చమని ఆదేశిస్తుంది? మరి ఏ విషయాలను నిషేధించుకోమని ఆజ్ఞాపిస్తుంది? జీవితపు విభిన్న రంగాలలో ఎటువంటి కార్యాచరణకు సంబంధించి, ఎటువంటి మార్గదర్శనం అందిస్తుంది? వ్యక్తిగా సమాజ సభ్యునిగా ఈ భూమిపై తాను ఎలా వ్యవహరించాలి? ఏ పాత్ర పోషించాలి? అనేవి స్పష్టంగా తెలుసుకొని ఉండాలి. తెలుసుకోవడమే కాదు, ఆర్జించిన జ్ఞానానికి అనుగుణంగా ఆచరణకు పూనుకోవాలి. దివ్య ఖుర్ఆన్ ఆదేశాలు, ప్రవక్త హితోపదేశాలు ఒక్కొక్క దానిని ఆచరణలో పెట్టాలి. ధర్మశాస్త్రం (షరీఅత్) యొక్క ఒక్కొక్క ఆదేశంపై అమలు తప్పనిసరి కావాలి. కేవలం ధర్మ నియమ నిబద్ధతలపై మాత్రమే జీవిత సౌధం నిర్మించబడాలి. ఏ విషయమైనా ధర్మం చూపిన మార్గదర్శనంలోనే ఏర్పర్చుకోవాలి. ధర్మం కోరిన రంగులో సమాజం మొత్తం రంగరించబడాలి. చూచేవారికి సమాజం మొత్తం సంచార దివ్యఖుర్ఆన్‌లా కనపడాలి. ఒక ఎత్తైన కట్టడం, ఒకే చూపులో కనిపించేట్లుగా సమాజం మొత్తం ప్రపంచం ముందు ప్రత్యక్షమవ్వాలి. ఈ విధంగా ధర్మం సంపూర్ణంగా, వ్యక్తి మరియు సమాజంపై స్థాపించబడాలి. సుదూరం నుండి చూచేవారికి కూడా ఈ ధర్మం దాని మహోన్నతమైన జీవన విధానం కనపడాలి. దాని ప్రత్యేకతలు గుర్తించబడగలగాలి.



**రెండవ అధ్యాయం :**

# ఆశయం పట్ల అలసత్వం - దాని పర్యవసానం

## ఆశయం ఆదర్శాల ప్రాముఖ్యత

ఏదైనా ఒక ప్రత్యేక లక్ష్యం లేక ధ్యేయం కలిగివున్న సముదాయం, నిరంతరం తన లక్ష్యంపైనే దృష్టిని కేంద్రీకరించి ఉండాలి. దృష్టిని కేంద్రీకరించడం అంటే; ఆ లక్ష్యాన్ని చేరుకోవడానికి, తన ధ్యేయాన్ని సాధించడానికి అవసరమైన పథకాలు, ఆచరణలను తన ప్రాణంకన్నా మిన్నగా భావించాలి. మనస్ఫూర్తిగా ఆ లక్ష్య సాధనకోసం పరితపించాలి. ఈ విధంగా తన లక్ష్యం పట్ల అంతులేని ప్రేమ, దాని సాధనపట్ల పరిపూర్ణ విశ్వాసం, అకుంఠిత దీక్ష గల ఈ సంఘ సభ్యుడిని మృత్యువు ఏమాత్రం భయపెట్టజాలదు. ఈ సంఘ సభ్యునిలో తన లక్ష్యంపై గల లోతైన అవగాహన, ప్రేమల ముందు, తన వ్యక్తిగత ప్రయోజనాలు, వ్యక్తిగత మర్యాదలు అన్ని దిగదిడుపు అయిపోతాయి. ఈ స్థితి యొక్క సహజ పరిణామం ఏమంటే; ఆ సభ్యుడు తన సంఘం (జమాత్) యొక్క నిర్మాణానికి, విధి విధానాలకు సంపూర్ణంగా కట్టుబడి ఉంటాడు. తనకు అత్యంత ప్రియమైన ఈ లక్ష్యంతో సంబంధంలేని, ఇతర సమాజాలలోనూ, సంస్థలలోనూ తాను సంబంధం కలిగివుండడు. పొరపాటున అటువంటి పరిస్థితి దాపురిస్తే ఆ సభ్యుడు నీళ్ళ నుండి బయటపడిన చేపలా విలవిల్లాడుతూ ఉంటాడు. తిరిగి తన సహజ స్థానానికి చేరుకోవడానికి పరుగులు పెడతాడు. తనకు ప్రాణ సమానమైన ధ్యేయం కోసం, లక్ష్యసాధన కోసం, ధర్మబద్ధ, నియమబద్ధ జీవన విధానం కోసం తన ప్రాణాన్ని సైతం పణంగా పెడతాడు. ఈ లక్ష్య సాధనకోసం ధర్మవ్యతిరేక వ్యవస్థతో ఢీకొంటాడు. ధర్మవ్యతిరేక వ్యవస్థతో రాజీపడటం తనకు ఎప్పుడూ ఆమోదింపబడని, భరించలేని విషయంగా భావిస్తాడు. ప్రస్తుతం ఉనికిలోవున్న అధర్మ వ్యవస్థయే తన వ్యక్తిగత, సామూహిక జీవితపు విలువల గొంతు నులుముతున్నదని స్పష్టంగా తెలుసుకొని చైతన్యవంతుడు అవుతాడు.

దీనికి భిన్నంగా ఏదైనా ఒక సముదాయంలో అంతర్గతంగా దాని నియమాలపై

విశ్వాసం సన్నగిల్లినట్లయితే, తన ధ్యేయం, లక్ష్యాలపై ఉండవలసిన అంతిమ ఘడియలు లెక్కపెట్టుకుంటుందని భావించవలసి వస్తుంది. ఆ సంఘం ఈ కారణంగా తన నిర్మాణ వ్యవస్థను అంపశయ్యపైకి చేర్చివేస్తుంది. ఫలితంగా ఈ సంఘం లోపలి నిర్మాణం ధర్మవ్యతిరేకమైనదిగా మారిపోతుంది. సంఘ సభ్యులు ధర్మ వ్యతిరేక శక్తులతో చెట్టాపట్టాలు వేసుకొని తిరగడం అత్యంత స్వాభావికమైన పరిణామంగా ఉంటుంది. అంటే ధర్మరక్షకులైన సంఘ నాయకత్వం తన వద్ద ఉన్న నిధి నిక్షేపాల బీగాలను శత్రువుకు అందించినట్లుగా భావించాలి. ఇప్పుడు ఈ ధర్మ ఖజానా, దోపిడీకి గురికావడం నుండి కేవలం ఒక అద్భుతం లేక మహాత్మ్యం మాత్రమే కాపాడగలుగుతుంది. ఒక ఉద్యమంలో విస్తరణగాని బలహీనతగాని ఒకే స్థాయిలో ఉండగలవు. సంఘం (జమాత్)లో ధర్మస్థాపన పట్ల విశ్వాసం – గాఢమైన ప్రేమలు కొరవడినపుడు ఆ సంఘంలో బలహీనతలు చోటు చేసుకోవడమే గాక, త్వరితగతిన విస్తరిస్తూపోతాయి. చివరికి అవి దిద్దుబాటుకు సాధ్యం కాని స్థితికి చేరుకుంటాయి. ఫలితంగా ఆ సంఘంలోని వ్యక్తి – ఆ సంఘంలో తన సహజ లక్ష్యసాధనా మార్గాన్ని వదిలి, ఇతర విధానాలకు ఊడిగం చేసేవానిగా, చివరికి దానికి బానిసగా మారిపోతాడు. ఫలితంగా ఆ వ్యక్తి తను ఏ లక్ష్య సాధనకోసం బయలుదేరాడో దాన్నే మరిచిపోతాడు. చివరికి అనివార్యంగా ఆ పునాది లక్ష్యంతో ఆ వ్యక్తి పూర్తిగా అపరిచితుడైపోతాడు. ఇంకా ముందుకు వెళ్ళి సమాజంలో ఎక్కడైనా ధర్మ సంస్థాపనా లక్ష్యం గురించిన పిలుపు అతని చెవినబడితే, తనే విస్తుపోయే పరిస్థితికి చేరుకుంటాడు. ఈ పిలుపుకు వ్యతిరేకంగా తనే కార్యోన్ముఖుడు అవుతాడు. వ్యతిరేకించే, అణచివేసే వారి వరుసలో తనే ముందుగా నిలుస్తాడు. ఈ అధోగతికి చేరిన సంఘం యొక్క భ్రష్ట సంతానం, తన స్వహస్తాలతో లక్ష్యాన్ని – ధ్యేయాన్ని గోతిలో పడవేసి సమాధి కట్టివేస్తారు.

పైన పేర్కొన్న పరిణామాలు ఒక జమాఅత్‌లో ఏర్పడితే, దాని పరిస్థితి అనివార్యంగా రెండు విధాలుగా ఉంటుంది. మొదటిది : ఆ జమాఅత్ భౌతికంగా ప్రజలలో తన ప్రాభవాన్ని పూర్తిగా కోల్పోయి నామరూపాలు లేకుండా పోతుంది. రెండవ స్థితి : ఆ జమాఅత్ భౌతిక రూపురేఖల రీత్యా పరిపుష్టిగా ఉండి, ప్రజలలో పేరు ప్రఖ్యాతులు పొందవచ్చు. ప్రభుత్వ పాలనను ప్రభావితం చేయవచ్చు. ఆర్థికంగా

కళకళలాడుతూ పలు సేవా కార్యక్రమాలను డాంబికంగా నిర్వహించవచ్చు. ప్రజలలో గౌరవంతో పాటు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో అది గుర్తింపు పొందనూవచ్చు. అయితే, ఆ జమాఅత్ ప్రారంభంలో ఏ మహోన్నత ధ్యేయం, లక్ష్యాల కోసం ఏర్పడిందో, ఆ లక్ష్యం ఈ నిర్మాణంలో మృగ్యమై పోతుంది. తన లక్ష్యాల మృతదేహాన్ని తానే తన పాదాల క్రింద నలిపివేస్తూ కొనసాగే జమాఅత్ పేరు ప్రతిష్ఠల రీత్యా ఆకాశమంత ఎత్తు ఎదిగినా, నైతికంగా అది మట్టిలో కలిసిపోతుంది. జమాఅత్‌కు ఈ గతి పట్టిన తర్వాత దాని లక్ష్యాలు పూర్తిగా మారిపోతాయి. భౌతిక ప్రాభవం కోసం ఎలాగైనా జీవిస్తూ, ఎంతటి దుర్మార్గానికైనా ఒడిగడుతూ తన స్థానాన్ని నిలబెట్టుకోవడానికి సర్వశక్తుల్ని ఒడ్డుతూ, అడ్డొచ్చిన వారందరినీ నలిపివేస్తూ కొనసాగుతుంది. న్యాయం, ధర్మం, నీతినియమాలు, నైతికత, చట్టం అనే పదాలు ఆ జమాఅత్‌కు ఎంతమాత్రం ఆమోదయోగ్యం కావు. తత్కారణంగా ఏ మహోన్నత లక్ష్యం కోసం ఆ జమాఅత్ ఉద్యమించిందో - ఏ నియమ నిబంధనల ఆధారంగా అది తన వైశిష్ట్యాన్ని సంతరించుకుందో వాటిని ప్రస్తావించే అర్హతను కూడా కోల్పోతుంది.

## ఇస్లామీయ నియమ నిబంధనల పట్ల విసుగు

పైన వివరించిన దుస్థితి ప్రతి సైద్ధాంతిక సంస్థకు దాపురించవచ్చు. ఇందుకు ఇస్లామీయ సంఘం కూడా అతీతం కాదు. ఇస్లామీయ జమాఅత్ యొక్క పునాదులు మొదటి నుండి కడవరకు తన లక్ష్యం, ధ్యేయాలపై ఆధారపడి ఉంటాయి. ఆ ధ్యేయాల సాధనే దాని ప్రధాన కర్తవ్యంగా ఉంటుంది. ఈ కర్తవ్యదీక్ష ఇతర సమూహాల కంటె ఇస్లామీయ సంఘానికి మరింత అధికంగా వుంటుంది. ప్రపంచంలో ఉనికిలో ఉన్న అనేక జీవన వ్యవస్థలలో ఇస్లామీయ జీవన సరళి ప్రత్యేకమైనదీ, ఉన్నతమైనది కూడా. ఈ జీవన విధానంలోని ప్రత్యేకతలు, ఉన్నత విలువలు, నియమనిబంధనలు ఇతర జీవన విధానాలలో కానరావు. ప్రపంచంలో ఇస్లాం తప్ప మిగిలిన అన్ని జీవన వ్యవస్థలు, మానవ మస్తిష్కం నుండి వెలువడిన స్వయం కల్పిత వ్యవస్థలు మాత్రమే. ఈ కారణంగా ఈ జీవన వ్యవస్థలలో కొరతలు, కొరవలు తప్పక వుండి తీరుతాయి. మానవుల అనుభవాల నుండి స్వీకరించిన ఫలితాలు, మార్పులు, చేర్పులు ఈ జీవన వ్యవస్థలలో నిరంతరం జరుగుతూ ఉంటాయి. పరిస్థితుల ప్రభావం కారణంగా, మరికొన్ని సందర్భాలలో నిస్సహాయతల కారణంగా, విదేశీ సభ్యతా

సంస్కృతులు జీవన విలువల అతుకులు ఈ వ్యవస్థలకు అవసరమౌతాయి. ఈ మార్పుల పరిణామాలు అన్నీ అత్యంత సహజంగా సంభవిస్తూపోతాయి. ఈ వ్యవస్థలకు కాపలాదారులైన అత్యంత నిజాయితీపరులు కూడా గుర్తించలేనంతగా ఈ పరిణామాలు సంభవించడం విశేషం. కాని, ఇస్లామీయ జీవన వ్యవస్థ దీనికి పూర్తిగా భిన్నమైనది. ఈ వ్యవస్థ, ఏ మానవ మస్తిష్కం నుండో లేదా ఏ సమూహపు ఆలోచనల నుండో ఊడిపడింది కాదు. తత్భిన్నంగా, ఏ శక్తి సమస్త సృష్టిని సృష్టించిందో, ఏ మహాజ్ఞాని మానవ సృజనకు కారణమో, ఎవరైతే మానవునిలోని నిమ్నోన్నతలు ఎరుగునో - ఎవరైతే మానవుని ఆలోచనలలోని ఎగుడుదిగుడులను ఎరుగునో - ఎవరికైతే సర్వస్వానికి సంబంధించిన సంపూర్ణ జ్ఞానం ఉన్నదో, ఆ మహోన్నత సృష్టికర్త అయిన అల్లాహ్ ద్వారా సర్వమానవాళికి సర్వకాలాలకు, సకల ప్రాంతాలకు అనువైన, మానవ నైజానికి తగిన జీవన వ్యవస్థ అందించబడింది. మార్పులు చేర్పులు అవసరం లేని, సర్వకాలాలకు అన్వయించదగిన శాస్త్రీయమైన జీవన వ్యవస్థ ఇస్లాం. నూతన ఆవిష్కరణలు, ప్రయోగాలు అన్నీ ఈ జీవన వ్యవస్థలో ఇమిడిపోగలవు. ఇట్టి సార్వజనీన వ్యవస్థను ఆమోదించేవారు తమ సృష్టికర్త యొక్క కృతజ్ఞుల బృందంలో చేరిపోతారు. వ్యతిరేకించేవారు ద్రోహులుగా - కృతఘ్నులుగా పిలవబడతారు.

పై వివరణ దృష్ట్యా ఇస్లామీయ దృక్పథం, దాని జీవన విధానం చాలా కఠినంగా ఉంటుందని చెప్పేవారు ఉండవచ్చు. అయితే అలా చెప్పేవారు ఇస్లాంను, దాని నైజాన్ని, దాని ధార్మికతను, అది నిర్దేశించిన జీవన విధానాన్ని వ్యతిరేకించే వారైనా అయివుండాలి, లేదా వారు వాస్తవానికి - అనుమానానికి మధ్య వ్యత్యాసం తెలియని వారైనా అయివుండాలి. లేదా దైవజ్ఞానం కంటే మానవుని జ్ఞానం గొప్పదని భావించే అహంభావులైనా అయివుండాలి. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే, కొందరు ఇస్లామీయ జీవన విధానాన్ని దైవ ప్రసాదితమని ఆమోదిస్తూనే, దాని విధివిధానాలు ఆచరణ సాధ్యం కానివని తీర్మానించి వాటిని నిర్లక్ష్యపర్చడం జరుగుతోంది. ఇస్లామీయ వ్యవస్థ ఈ విధమైన ద్వంద్వ వైఖరిని కఠినంగా వ్యతిరేకిస్తుంది. 'ఆమోదం' తర్వాత 'నిర్లక్ష్యం' ఎంతమాత్రమూ అంగీకరించబడదని అది ప్రకటిస్తుంది. అదే సమయంలో ఆ వ్యక్తి మొత్తంగా ఇస్లాంను వదలివెళ్ళే స్వేచ్ఛను గౌరవిస్తుంది. మార్పులకు, చేర్పులకు నిరంతరం గురి అయ్యే తన స్వనిర్మిత జీవన విధానం మీదనే ఆ వ్యక్తి విశ్వాసం కలిగి ఉంటే, దానిని ఆచరించే హక్కు అతనికి సంపూర్తిగా ఉంటుంది.

పైన పేర్కొన్న వ్యత్యాసాన్ని ఆకళింపు చేసుకున్నట్లైతే, ఈ క్రింది విషయం చాలా సులువుగా అర్థం అవుతుంది. అది - ఒక సాధారణ జమాఅత్ తన జీవన విధానాన్ని, భావజాలాన్ని, విధి విధానాలను, ఇతర సంస్థలతో లేక జమాఅత్‌లతో పంచుకోవడం - ఇచ్చిపుచ్చుకోవడం జరుపుకోవచ్చు. కాని, ఇస్లాం పేరుపై నిర్మితమయ్యే ఒక జమాఅత్‌కు ఇతర జమాఅత్ లేక సంస్థల భావజాలాలతో, విధి విధానాలతో రాజీ పడే ప్రసక్తే ఉండదు. ఇలా రాజీపడే ధోరణిని ఆ ఇస్లామీయ జమాఅత్ తనపై నిషేధించుకుంటుంది. దివ్య ఖుర్ఆన్ అవతరణ ప్రారంభమవుతున్న కాలంలో, ఇస్లామీయ జమాఅత్ తన పునాదులను బలిష్ఠం చేసుకుంటున్న ప్రాథమిక దశలోనే, దాని వ్యతిరేకులు పైన పేర్కొన్న ఇచ్చిపుచ్చుకునే రాజీసూత్రాన్ని ప్రవక్తశ్రీ (స) వారి ముందు ప్రతిపాదించారు. అయితే సృష్టికర్త అల్లాహ్ తరపు నుండి వారితో 'రాజీ ధోరణి అనుసరించకూడద'ని ప్రవక్తశ్రీ వారికి స్పష్టమైన ఆదేశాలు అందాయి. ఇస్లామీయ జమాఅత్ యొక్క వ్యతిరేక శిబిరం తన పథకాలలో వైఫల్యం పొందినప్పుడు, ఓటమిపాలై బలహీన పడుతున్నప్పుడు ప్రవక్త (స) ముందు "ఈ ఖుర్ఆన్‌కు బదులు మరొక ఖుర్ఆన్‌ను తీసుకు రా. లేదా ఇందులో సవరణలు చేయి" అని ప్రతిపాదించారు.

పైన సూచించిన ఉపాయాన్ని ప్రతిపాదించేవారి ఉద్దేశ్యం సుస్పష్టంగా ఉండింది. పైకి ఇది ప్రతిపాదనలాంటి ఉపాయంగా కనిపించినా, అది ఇస్లామీయ ఉద్యమ వ్యతిరేకుల అభ్యర్థనగా ఉండింది. ప్రవక్త ముహమ్మద్ (స) బోధనల్లో, శిక్షణల్లో తమ 'దైవేతర' భావజాలానికి లేక దైవాధికారాల్లో 'భాగస్వామ్యపు' భావజాలానికి కూడా కొంత స్థానం ఉండాలనేది వారి అభిమతంగా ఉండింది. దీని ప్రతిఫలంగా తాము ప్రవక్త (స) పట్ల అనుసరిస్తూ ఉన్న శత్రువైఖరిని విడనాడి అవసరమైతే ప్రవక్త (స) అనుయాయులుగా కూడా మారిపోతారు. ఈ ప్రతిపాదనను దివ్య ఖుర్ఆన్ నిర్ద్వంద్వంగా వ్యతిరేకించింది. "దీనికి బదులుగా మరొక ఖుర్ఆన్‌ను తీసుకు రా లేదా ఇందులో సవరణలు చెయ్యి" (10 : 15) అని వారు ప్రతిపాదించారు. సమాధానంగా ఇలా సెలవీయబడింది : (ప్రవక్తా! వారితో ఇలా అను) "ఇందులో నా అంతట నేను మార్పులూ చేర్పులూ చెయ్యటం నా పని ఎంతమాత్రం కాదు. నేను నా వద్దకు పంపబడే 'వహీ'ని మాత్రమే అనుసరిస్తాను" (యూనుస్ : 15).

ప్రాథమికమైన, అతి ముఖ్య విశ్వాసాలు, వాటి ఆచరణల విషయంలో మాత్రమేకాదు, సాధారణ పరిస్థితుల్లోనైనా, అతి క్లిష్ట పరిస్థితుల్లోనైనా రాజీ ధోరణి ప్రదర్శించకూడదని తన ప్రవక్తకు అల్లాహ్ ఖచ్చితంగా ఆజ్ఞాపించడం జరిగింది. ధర్మశాస్త్ర సంబంధమైన ఒక చిన్న అంశాన్ని కూడా – చట్టాన్ని కూడా నిర్లక్ష్యపర్చకూడదని హెచ్చరించడం జరిగింది. "ప్రవక్తా! నీవు అల్లాహ్ అవతరింపచేసిన శాసనం ప్రకారం ప్రజల వ్యవహారాలను పరిష్కరించు. వారి కోరికలను అనుసరించకు. మిమ్మల్ని వారు మోసంలో పడవేసి అల్లాహ్ మీ వద్దకు పంపిన ఉపదేశానికి రవ్వంత కూడా విముఖతను చేయకుండా మీరు అప్రమత్తులై ఉండండి" (5 : 49). పై హితోపదేశం లేక ఆజ్ఞ ఇస్లామీయ మూల విషయాలకు, చట్టాలకు సంబంధించి ఇవ్వబడింది. కాగా, మక్కాలోని ఇస్లాం శత్రువులు ఈ స్పష్టమైన ఆదేశం తర్వాత మరొక ఎత్తుగడతో ప్రవక్తశ్రీ (స) వారి ముందుకు వచ్చారు. మార్పులు చేర్పులు అవసరం లేకపోతే పోయింది. ప్రవక్తశ్రీ వారు తన సందేశ ప్రచార కార్యక్రమంలో పట్టువిడుపులు, మెతకదనం పాటిస్తే చాలునని, దీనికి ప్రతిగా తాము కూడా ప్రవక్త పట్ల ఇదే వైఖరి ప్రదర్శిస్తామని చెప్పారు. తద్వారా "నీవు గనక రాజీపడితే వారు కూడా రాజీపడదామనే" (68 : 9) పరిస్థితి ఏర్పడవచ్చని భావించారు. రాజీపడటం అంటే 'షిర్క్'ను ఖండించడం దైవసందేశహరులు (స) మానుకోవాలి. తన ఏక దైవారాధనా సిద్ధాంతాన్ని కేవలం తాత్విక భావజాలంగా, ప్రచారం వరకు మాత్రమే పరిమితం చేసుకోవాలి. సంక్షిప్తం చేసుకోవాలి. ఈ ప్రతిపాదన ద్వారా వారు ఏక దైవారాధన మరియు బహు దైవ విగ్రహారాధనల మధ్య ఒక వంతెన కట్టే ప్రయత్నం చేశారు. తద్వారా ఇస్లాం మరియు షిర్క్‌ల మధ్య శాంతి ఒప్పందం కుదర్చడం వారి లక్ష్యంగా ఉండింది. అయితే దివ్య ఖుర్‌ఆన్ పై ప్రతిపాదనలను నిర్ద్వంద్వంగా నిరాకరించింది. "చీటికీ, మాటికీ ఒట్టువేస్తూ (నీ వద్దకు వచ్చే) నీచులకు ఎంత మాత్రమూ లొంగకు" (68 : 11) అని హెచ్చరించింది.

పైన వివరించిన ఇస్లామీయ బోధనలు, హితోపదేశాలు, ఆజ్ఞలు, హెచ్చరికలు కేవలం ఒక ప్రత్యేక పరిస్థితిలో ఇవ్వబడినవి కావు. అవి సర్వకాల సర్వావస్థలకు చెందినవి. దివ్య ఖుర్‌ఆన్ మార్గదర్శక సారాంశం, దాని శిక్షణల విధానం, రాజీలేని అకుంఠిత దీక్షాబద్ధతనే విశ్వాసులకు అందిస్తుంది. ఈ స్పష్టమైన మార్గదర్శకత్వం,

ఆదేశం తర్వాత ఇక మరెవ్వరికీ ఇస్లాంను అంగీకరించిన తర్వాత, దానిని జీవిత విధానంగా కొనసాగిస్తున్నామని ప్రకటించుకున్న తర్వాత, దాని విధి విధానాల నుండి, నిషేధ, పరిమితుల నుండి, చట్టశాసనాల నుండి తన్ను తాను స్వతంత్రునిగా భావించడం, తదనుగుణంగా ఆచరించడం, జీవించడం ఎంతమాత్రమూ అంగీకరించబడదు.

## లక్ష్యానికి ప్రమాణ నికషం

ఆచరణాపరంగా నేటి ఇస్లామీయ సమాజం ఏ స్థితిలో ఉన్నప్పటికీ, దాని ప్రారంభంలో అది తన విధి విధానాలరీత్యా, సైద్ధాంతిక, తాత్విక భావనా స్రవంతి దృష్ట్యా తన ధ్యేయం, లక్ష్యాల పట్ల అత్యంత గాఢమైన సంబంధం కలిగి ఉండింది. తన విధి విధానాల పట్ల సంపూర్ణ విశ్వాసంతోనే లేచి నిలబడింది. తన ముందున్న ప్రతికూల పర్వతాలు తునాతునకలు అయిపోయేలా దృఢంగా నిలబడింది. ఇస్లామీయ ఉద్యమ నడకలో, దాని మార్గంలో అంతులేని అవరోధాలు ఎదురయ్యాయి. అంతులేని ధన ప్రాణ నష్టాలు సంభవించాయి. ప్రమాదాల సముద్రాలు భయపెట్టాయి. రాత్రి నిద్ర కరువు అయ్యింది. పగటి ప్రశాంతత గుంజుకోబడింది. బందీఖానాలు, బహిష్కరణలు కన్నెర్ర జేసాయి. అయినా చరిత్ర సాక్షిగా, కాలం సాక్షిగా, అత్యంత ప్రమాదకరమైన ఈ పరిస్థితుల నుండి, కష్టాల కడలి నుండి, ప్రతికూల తుఫానుల నుండి ఇస్లామీయ ఉద్యమం తన లక్ష్యం నుండి, దాని విలువల నుండి, విధి విధానాల నుండి ఒక అంగుళమైనా బెసకటానికి ఆమోదించలేదు. పరిస్థితులతో రాజీపడటానికి అంగీకరించనేలేదు. అలా రాజీకి అవకాశం ఇచ్చివుంటే, ఇస్లామీయ ఉద్యమంపై కొనసాగిన దౌర్జన్యపూరిత హింసాకాండ తగ్గి ఉండేది. రేయింబవళ్ళు కొనసాగిన వేధింపులు, అలజడులు శాంతి సామరస్యాలుగా మారిపోయి ఉండేవి. ఆర్థిక ఇబ్బందులు తొలగిపోయి ఉండేవి. అరబ్బు భూమి మొత్తం ఈ ఉద్యమ నాయకునికి (స) జేజేలు పలికి ఉండేది. మక్కా నాయకుల రాజీ ప్రతిపాదలను ఆమోదించి ఉండివుంటే, పై ప్రయోజనాలన్నీ లభ్యమయి ఉండేవి. ఈ చారిత్రక ఘట్టాలన్నింటిని దైవగ్రంథం దివ్య ఖుర్‌ఆన్ పదచిత్రాలుగా రికార్డు చేసి మనముందు ఉంచింది. అయితే ఇస్లామీయ ఉద్యమ మహోపాధ్యాయులు (స), ఆయన అనుచర సహాబాలు (రజి) ఈ రాజీధోరణిని నిర్ద్వంద్వంగా వ్యతిరేకించారు. మక్కా నాయకులలో

రాజీపడటం, తౌహీద్, షిర్క్‌ల మధ్య సామరస్యం సాధించే ప్రయత్నం చేయడం మరణాన్ని ఆహ్వానించడంతో సమానమని వారికి స్పష్టంగా తెలిసిపోయింది. విశ్వాసాలను నియమ నిబంధనలను, నిష్ఠాగరిష్టతలను వదిలివేసిన తరువాత ఇస్లామీయ సమాజం తన ధ్యేయం లక్ష్యాలను సాధించడం సాధ్యమే కాదు. ఈ కారణంగానే ప్రథమ వరుసలోని ఇస్లామీయ సమాజ సభ్యులు నిప్పు, నెత్తురుల తుఫానుల్లో కూడా తమ కేంద్రబిందువు అయిన లక్ష్యం, సత్యం విషయంలో దృఢంగా సమీకృతమై నిలిచారు. పరిస్థితుల అననుకూలతలు వారిని తమ విధి విధానాల నుండి వెంట్రుకవాసి కూడా కదిలించలేకపోయాయి. వారు తమ చుట్టూ ఆవరించివున్న సమస్యల నుండి, ఆర్థిక అవసరాల నుండి, భౌతిక వనరుల నుండి, సమయం, పరిసరాల ప్రభావం నుండి, తమ్ముతాము ప్రత్యేకపర్చుకున్నట్లుగా ఉండిపోయారు. వారికి తమ ధ్యేయం లక్ష్యాల సాధన తప్ప మరేదీ పట్టలేదు. వారికి 'దైవధర్మస్థాపనా పిపాస' తప్ప మరేదీ పట్టలేదు. ఆనాటి ఇస్లాం వ్యతిరేక తెగల సర్దారులు, మక్కా నగర ప్రముఖులు అందరూ ముక్తకంఠంతో "వీరి ధర్మం వీళ్ళను మోసంలో పడవేసింద"ని చెప్పారు. "వీళ్ళు మూర్ఖులు" అని కూడా ఎద్దేవా చేశారు.

ఆ తర్వాత అతికొద్ది కాలంలోనే లోకం ఈ 'పిచ్చివారి' గొప్పతనాన్ని అంగీకరించక తప్పలేదు. ప్రపంచం మొత్తంగా చరిత్ర పరిశోధకులు, మేధావులు ఆశ్చర్య చకితులయ్యేలా ఒక మహాద్భుత విప్లవం వీరి ఆధ్వర్యంలో విజయవంతమయింది. తర్కశాస్త్రానికి అందని, కార్యాకారణ సంబంధాలు అందుకోలేని ఈ విప్లవాన్ని విమర్శకులు సైతం ఊహించలేకపోయారు. ఎవరికైతే తమ గృహాలలో సైతం తలదాచుకొనే చోటు కూడా దొరకలేదో, వారి పాదాల చెంత పారశీక చక్రవర్తి కిస్రా, రోము చక్రవర్తి కైసర్‌ల తల కిరీటాలు వచ్చి పడ్డాయి. ఒక శతాబ్ద కాలమైనా గడవక ముందే ఈ విప్లవం యూరప్, ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని పలు రాజ్యాలపై ఆవరించింది. కేవలం భూభాగం పైనే కాదు, ఆ భూభాగానికి చెందిన ప్రజల హృదయ సీమలను సైతం ఈ విప్లవం ఆక్రమించింది. తన ప్రభావంతో వారి భావనా జగతిని ముంచెత్తింది. ఈ అద్భుత విప్లవం, ఈ మహాద్భుత విజయం కేవలం ఈ ఉద్యమ కార్యకర్తల దృఢ విశ్వాసం, దీక్షా దక్షతల, అంతులేని త్యాగాల ఫలితంగానే సంభవించింది. తమ ధ్యేయం, లక్ష్యాల పట్ల,

జీవిత విధానం, సూత్రాల పట్ల, నిబద్ధత నిష్ఠల పట్ల వారికున్న దృఢబంధమే వారికి, ఈ విలువల కోసం జీవించడం, అవసరమైతే మరణించడం నేర్పింది.

## లక్ష్యం పట్ల అలసత్వం

ఇస్లామీయ విప్లవ విజయం తన తొలికాలాన్ని దాటిన తరువాత ఆ సమాజ ఆలోచనల్లో మార్పు వచ్చింది. దాని ధ్యేయం-లక్ష్యాల పట్ల అలసత్వం పొడసూపింది. అనేక కారణాల వల్ల ఈ సమాజంలో నిర్లిప్తత, స్తబ్ధతలు వేళ్ళూనుకోవడం మొదలెట్టాయి. కాలంతో పాటు ఈ బలహీనతలు పెరుగుతూపోయాయి. ఇస్లామేతర విధివిధానాలు, సభ్యతలు, ఆలోచనలు, సిద్ధాంతాలు గట్టుతెగిన ఏటి వరదలా ఇస్లామీయ సమాజంలోకి జొరబడ్డాయి. ఆయా కాలాల్లో ఇస్లామీయ పండితులు, మేధావులు, జ్ఞానులు, సంస్కర్తలు ఈ ప్రమాదాన్ని నివారించడానికి తీవ్ర ప్రయత్నాలు చేసారు. అయినా ప్రజల (క్రమ) శిక్షణారాహిత్యం, పాలకుల స్వార్థపరత్వం, వారి ప్రయత్నాలు ఫలించకుండా చేసాయి. ఈ రోగం క్రమంగా ఇస్లామీయ సమాజపు సభ్యతా సంస్కృతులను, వారి మౌలిక విశ్వాసాలను, విధివిధానాలను మెల్లిమెల్లిగా బలహీనపర్చసాగింది. ఎప్పటివరకైతే ఇస్లామీయ వ్యవస్థ రాజకీయరంగంపై ఆధిపత్యం వహిస్తూ ఉండిందో, అప్పటివరకు ఇస్లామీయ మానవీయ, సార్వజనీన విలువలు సమాజంపై ప్రభావం చూపుతూ ఉంటాయి. నైతిక, తాత్విక పతనాలు రాజకీయ వ్యవస్థకు సోకగానే, ఈ పతనం మరింత తీవ్రతరమై వరదలా ఈ సమాజాన్ని ముంచెత్తివేసింది. ఈ పతనావస్థ సుదీర్ఘ కాలం కొనసాగి నేడు ఈ స్థితికి చేరింది. నేడు ఈ ఇస్లామీయ సమాజం తనకు తానే గుర్తుంచుకోలేని అపరిచితురాలైపోయింది. ఈ సమాజపు మెజారిటీ సభ్యులు, తమ లక్ష్యం, ధ్యేయాలను పూర్తిగా మరిచిపోయారు. వారు తమ ఉపాధికి కారణాన్ని సైతం గుర్తుంచుకోలేకపోయారు. ఇస్లామీయ ఉద్యమం, దాని లక్ష్యం - ధ్యేయాలను వీరు అపరిచిత విషయాలుగానో లేక అసాధ్యమైన సంగతులుగానో కొట్టిపారేసే స్థితికి దిగజారిపోయారు. ఇస్లామీయ సూత్రబద్ధ జీవితంలో, దాని విధివిధానాలలో వీరి ప్రాపంచిక ప్రయోజనాలకు నష్టదాయకంగా ఉన్న విషయాలపై వీరు పిచ్చివారిలా దాడిచేయడం మొదలెట్టారు. ఆయా విధి విధానాలను కాలరాయటమో లేదా వాటిని మార్చివేయడమో చేశారు. తమకు నచ్చిన విధంగా ఇస్లామీయ విధి విధానాలు ఉండేలాగా, తన ఆశలకు, ఆకాంక్షలకు

అనుగుణంగా ఉండేలాగా మార్చే ప్రయత్నం చేశారు. క్షమించరాని ఈ నేరాన్ని ఇస్లాం మరియు ముస్లింల అభివృద్ధి పేరుతోనే అమలుచేశారు. అదీ విచిత్రం, విశేషం! ఈ అభివృద్ధికి ఇస్లామీయ మూలసూత్రాలతో అసలెలాంటి సంబంధమూ లేదు. కళ్ళున్న ప్రతి వ్యక్తీ ఈ విషయాన్ని కానగలుగుతాడు.

అయినప్పటికీ విశాలమైన నేటి ఇస్లామీయ సమాజంలో, తన లక్ష్యం-ధ్యేయాల పట్ల గాఢమైన నిబద్ధత కలిగిన ఒక చిన్న ఇస్లామీయ జమాఅత్ నేటికీ కొనసాగుతూ ఉంది అనేది కాదనలేని సత్యం. అది తన కర్తవ్యాన్ని బొత్తిగా విస్మరించి, ఆత్మహత్యా సదృశమైన అధోగతికి చేరలేదు. వీరిలో తమ ధ్యేయం-లక్ష్యం కోసం తమ సర్వస్వాన్ని ధారపోసే త్యాగగుణం ఉత్తమ స్థాయిలో లేకపోయినప్పటికీ వీరు తమ లక్ష్యం-ధ్యేయాలను గుండెలలో నింపుకొని, గుండె దిటవుచేసుకొని ముందుకు సాగుతున్నారు. ఈ ప్రత్యేకమైన సమూహం (జమాఅత్) సైతం క్రియాత్మక క్షేత్రంలో చాలా వెనుకబడి ఉందనేది కూడా కాదనలేని సత్యమే. వీరి హృదయాలలో 'ధర్మస్థాపనా కార్యం' కేవలం ఒక 'పవిత్ర భావనగా' ఉండిపోయింది. ఈ కార్యరంగంలో ఉండవలసిన తపన, ఆరాటం, ఆర్ద్రత మందగించింది. పరిస్థితుల అననుకూలతలు, వ్యతిరేక శక్తుల దుర్మార్గాలు, కుతంత్రాలు, ప్రచార ఆర్భాటాలు వీరి మెదళ్ళను మొద్దుబార్చివేసాయి. ఫలితంగా ఈ సమూహం సైతం జీవించే కొద్దికాలం శాంతిగా, ప్రశాంతంగా జీవిద్దాం అనే రాజీ ధోరణికి గురయ్యింది. తమ్ము తాము 'మతఛాందస వాద' ఆరోపణల ముద్ర నుండి తప్పించుకునేందుకు, తద్వారా ప్రభుత్వ 'నిఘా' నుండి తప్పించుకునేందుకు వీరు ప్రయత్నిస్తున్నారు. వీరు సమాజాన్ని తరచి చూస్తూ, అర్థం చేసుకుంటూ వుంటారు. కాని, తమ్ము తాము జోకొట్టుకుంటూ ఉంటారు. ధర్మంలో సౌలభ్యం, పారదర్శకత ఉందని తమను తాము సముదాయించుకుంటూ ఉంటారు. అల్లాహ్ ప్రతి మనిషికి, ఆ మనిషికి ఉన్న సహజ ప్రతిభలను బట్టే బాధ్యతలను అప్పగించాడనీ, శక్తికి మించిన బరువును ఎవరిపైనా మోపలేదని, కనుక ప్రాణాంతకమయిన చర్యల జోలికి పోకుండా ఉండటమే విజ్ఞత అని సర్దిచెప్పుకుంటూ ఉంటారు.

## అర్హత గలవారే కారుణ్యానికి అర్హులు

ఈ నేపథ్యంలో ఒకవేళ ఇస్లామీయ సమాజానికి ప్రాపంచిక అధికారం, పాలనాపరమైన బాధ్యత ధనసంపత్తులు లభించినప్పటికీ - ఇస్లాంకు దీనిపట్ల ఎలాంటి

ఆసక్తి ఉండదు. ఎందుకంటే కేవలం రాజకీయాధికారానికి అది ప్రాధాన్యత ఇవ్వదు. ఇస్లాం ధ్యాసంతా ధర్మసంస్థాపనపైపే ఉంటుంది. ఈ ధ్యేయాన్ని విస్మరించిన సమాజం ప్రపంచ నాయకత్వాన్ని పొందినప్పటికీ, రాజ్యాలు ఏలినప్పటికీ దానివల్ల ప్రపంచానికి గాని, ప్రజలకు గాని ఒరిగేదేముంటుందీ? అయితే సృష్టికర్త అల్లాహ్ వీరికి నేడు ఈ పరిస్థితి కూడా లేకుండా చేశాడు. వీరు తమ జీవన ధ్యేయాన్ని రాతిగోడల (అటకల)పై పెట్టేశారు. ఫలితంగా వారు పొందిన 'పరాధీనత' అనేది వారి ముఖాలపై ఎన్నటికీ మాయని మచ్చగా మిగిలిపోయివుంది. ఇటువంటి మచ్చ విశ్వసామ్రాజ్యాధిపతి విశ్వప్రభువు అయిన అల్లాహ్ పార్టీ నొసటిపై ఏర్పడదు. ముస్లిం సమాజ తొలికాలపు ఉత్థానాన్ని చూసి అలనాడు ఆశ్చర్యచకితమైన ఈ ప్రపంచమే - నేటి ఈ మాయని మచ్చలను చూసి కూడా ఆశ్చర్యపడుతోంది. ఉత్థాన పతనాల తర్క రీత్యా చూస్తే ఇస్లామీయ ఉత్థానమూ ఒక అద్భుతమే కాగా, దాని పతనమూ ఒక ఆశ్చర్యకరమైన విషయమే. ఆలోచనాపరులకు సైతం ఈ పరిస్థితి యొక్క హేతుబద్ధత అంతుబట్టని విషయంగా ఉంది. స్వయంగా ఇస్లామీయ సమాజం సైతం 'ఎలాంటిది - ఎలాగయ్యిందీ' అని నోరెళ్ళబెడుతుంది. ఇలా ఎందుకయ్యింది? అని కూడా అప్పుడప్పుడూ తన్ను తాను ప్రశ్నించుకుంటుంది. ఈ పతనానికి గల కారణాలను కూడా తెలుసుకునే ప్రయత్నం చేస్తుంది. తనలోని విశ్వాసపు బలహీనతను కూడా అంగీకరిస్తుంది. తన ఆచరణా రాహిత్యాన్ని ఒప్పుకుంటుంది. తన నైతిక పతనాన్ని ఆమోదిస్తుంది. ధర్మాదేశాల పట్ల తన నిర్లక్ష్యాన్ని నిజాయితీగా అంగీకరిస్తుంది. ఇన్ని కారణాలున్నప్పటికీ ఈ క్రింది ప్రశ్నలు తనకు తానుగా వేసుకుంటుంది. 'ఎంత అధ్వాన్న స్థితిలో ఉన్నప్పటికీ, నేటి ప్రపంచంలో ఏకేశ్వరవాదానికి వారసత్వం నాదేకదా?', 'నా తల వినమ్రమయ్యేది ఆ సృష్టికర్త సమక్షంలోనే కదా?', 'ప్రవక్త సంప్రదాయపు పట్టా నేడు ఉన్నది నా మెడలోనే కదా?' దైవాజ్ఞాబద్ధమైన జీవితం ఏ మేరకు ఉన్నా అలా జీవిస్తున్నది తానేకదా? తను తప్ప మిగిలిన ప్రపంచమంతా దైవధిక్కార వర్గానికి చెందినదే కదా? ఇటువంటి పరిస్థితుల్లో సృష్టికర్తకు సహవర్తుల్ని కల్పించి, ఆయన పట్ల కృతఘ్నుతగా ఉండి, ప్రవక్త ముహమ్మద్ (స)కు శత్రువులుగా ఉన్న ముస్లిమేతర సమాజం ఎంతో శక్తిమంతమై ఉండగా - నేను ఎందుకు ఇంతశక్తి హీనునిగా ఉన్నాను? ధన సంపత్తులతో వారు తులతూగుతుండగా, నేను కటిక

దారిద్ర్యంలో, దౌర్భాగ్యస్థితిలో ఎందుకు మ్రగ్గుతున్నాను? వారు ఆధిపత్య సర్వాధికారాలు కలిగివుండగా, నేను పాలితునిగా, అణచివేయబడిన దానిగా ఎందుకు ఉన్నాను? వారు సర్వస్వతంత్రులు కాగా, నేను బానిసగా ఎందుకు ఉన్నాను? అసలు, ఈ సృష్టికి స్వామి, ప్రభువు అయిన అల్లాహ్‌కు అత్యంత సమీపంగా ఉన్నది నేను మాత్రమే కదా? దైవప్రసాదాలకు, వరాల జల్లులకు మొదటి హక్కుదారుడిని నేనా? వారా?

ఆశ్చర్యం కలిగించే పై ప్రశ్నలన్నీ కేవలం జాతుల ఉత్థానపతనాలకు సంబంధించిన తాత్విక ఆలోచనల కొరతవల్ల ఉద్భవిస్తున్నాయి. ప్రస్తుతం మన నైతిక స్థాయి దృష్ట్యా మనం ఎక్కడ ఉండవలసినవారమో సరిగ్గా అక్కడే ఉన్నామని ఈ సందర్భంగా తెలుసుకోవాలి. జీవిత మైదానంలో జయాపజయాలకు సంబంధించి (ఉత్థాన పతనాలకు కూడా) రెండు సూత్రాలు ఎప్పుడూ అమలవుతూ ఉంటాయి. ఒకటి, భౌతిక సూత్రాలకు సంబంధించినది. కాగా, రెండవది నైతిక సూత్రాలపై ఆధారపడింది.

జాతుల ఉత్థాన పతనాలలో ఈ రెండు సూత్రాలే ప్రధానంగా భూమికను నిర్వహిస్తాయి. కాని ఈ రెండింటిలో ఒక తేడా చాలా స్పష్టంగా ఉంది. అదేమిటంటే, ఒక జాతి కేవలం భౌతికసాధనా సంపత్తులపై ఆధారపడి తన అభివృద్ధిని సాధించే వీలు ఉంటుంది. అయితే, కేవలం నైతిక విలువల ఆధారంగా ఒక జాతి అభివృద్ధి చెంది విజయపథంపై పయనించడం సాధ్యం కాదు. దానికి ఎంతో కొంత లేక అవసరమైనంత భౌతిక సాధనా సంపత్తి యొక్క సహాయం తీసుకోవలసి ఉంటుంది. ఇక నైతిక శక్తి ప్రధానంగా జాతుల మధ్య సంభవించే వాద ప్రతివాదనల్లో లేక యుద్ధ మైదానాల్లో 'ప్రధానపాత్ర' లేక 'నిర్ణయాత్మక పాత్ర' పోషిస్తుంది. అయితే ఈ నిర్ణయాత్మక పాత్ర పోషించడానికి కూడా భౌతిక సాధనా సంపత్తుల సహాయం తప్పనిసరిగా ఉండి తీరుతుంది. రెండు వర్గాల మధ్య జరిగే పోరాటం, కేవలం భౌతిక సాదనా సంపత్తులపై ఆధారపడివుంటే, అనివార్యంగా ఎవరి వద్ద ఈ సాధనా సంపత్తులు అధికంగా, సమృద్ధిగా ఉండి, వాటిని పోరాట రంగంలో ఉపయోగిస్తారో వారే విజయులు అవుతారు. అదే రెండు వర్గాలలో ఒకరు కేవలం భౌతిక సాధనా సంపత్తులతో రంగంలో దిగితే - మరొకరు కేవలం నైతిక శక్తి (ఆత్మశక్తి) ఆధారంగా

రంగంలోకి దిగితే కూడా అనివార్యంగా విజయం మొదటి వర్గానికే వరిస్తుంది. కాని, సాధనా సంపత్తుల రీత్యా, రెండు వర్గాలు కూడా సమాన స్థాయిలో ఉండి, ఒక వర్గం వద్ద అదనంగా నైతిక శక్తి కూడా సమృద్ధిగా ఉంటే విజయం దాని పాదాలను ముద్దాడక తప్పదు. నైతిక శక్తులు ఈ పోరాట మైదానపు రూపురేఖలను పూర్తిగా మార్చివేస్తాయి. అంతేకాదు, చివరి దైవగ్రంథం దివ్య ఖుర్‌ఆన్ "మనో నిబ్బరం, నైతిక శక్తులు సమృద్ధిగా ఉండి, భౌతిక సాధనా సంపత్తులు శత్రువుతో పోలిస్తే పదవ వంతువున్నా సరే విజయం వీరికే సాధ్యమని" సెలవిచ్చింది. మనో నిబ్బరం – నైతిక శక్తులు అల్లాహ్ యొక్క అగోచర వరాలు (సహాయాలు) పొందే అర్హతను సంపాదించుకుంటాయి. ఈ అదృశ్య సహాయం ద్వారా రణరంగాన్ని సైతం కైవసం చేసుకుంటాయి. ఒక వైపున ఈ వర్గం భౌతిక సాధనా సంపత్తులను అవసరమైనంత మేర సమకూర్చుకొని, భౌతిక యుద్ధతంత్రాలను సమయోచితంగా ప్రయోగించాలి. మరో వైపున తన విశ్వాసం సదాచరణ, నైతిక విలువల పాటింపును కలిగివుండాలి. అప్పుడే ఈ వర్గం విజయ సౌధంపై అధిరోహించగలుగుతుంది. మరో మాటలో తమ ధ్యేయం – లక్ష్యాల పట్ల గాఢమైన ప్రేమ, నిష్ఠ, నిబద్ధతలు కలిగి ఉండాలి. అప్పుడే అల్లాహ్ సహాయం పొందటానికి ఈ వర్గం అర్హత సంపాదించుకోగలుగుతుంది. ఈ విషయమై దేవుని వాగ్దానం ఈ విధంగా ఉంది :

**"ఒక చిన్న వర్గం, ఒక పెద్ద వర్గాన్ని అల్లాహ్ అనుమతితో జయించడం ఎన్నోసార్లు జరిగింది. అల్లాహ్ సాహచర్యం స్థైర్యం కలవారికి లభిస్తుంది" (2:247)**

**"క్రుంగిపోకండి, దుఃఖపడకండి, మీరే ప్రాబల్యం పొందుతారు. మీరు విశ్వాసులే అయితే" (3:139).**

**మరోచోట, "మీలో గనక ఇరవైమంది స్థైర్యం కలవారు ఉంటే, వారు రెండు వందల మందిని జయిస్తారు" (8:65) అనీ**

**ఇంకొకచోట, "సౌశీల్యవంతులైన మా దాసులే ఈ భూమికి వారసులౌతారు" (21:105) అనీ**

సూరతుల్ మాయిదా 56వ ఆయత్‌లో "అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ,

విశ్వాసులనూ తమ మిత్రులుగా స్వీకరించేవారు, అల్లాహ్ పక్షమే ఆధిక్యం వహిస్తుందని తెలుసుకోవాలి" అని స్పష్టపర్చబడింది.

పైన పేర్కొన్న అల్లాహ్ అగోచర సహాయం మానవ సమాజపు అన్ని కాలాల్లో అన్ని దశలలో అందింది. విశ్వాసుల మొదటి వరుసకు (ప్రవక్త -స- వారి సహచరుల కాలం) చెందిన కాలంలో ఇటువంటి సంఘటనలు అనేకం మనం గమనిస్తాం. బదర్, అహ్‌జాబ్, హునైన్ యుద్ధ మైదానాల్లో అల్లాహ్ 'అదృశ్య' బలగాల అద్భుత కార్యాలు దివ్య ఖుర్ఆన్ వాక్యాలలో నేటికీ దర్శనమిస్తూ భద్రంగా ఉన్నాయి. ఒక విశ్వాసుల బృందం ఉత్థానం చెందటానికి, విజయ బావుటా ఎగురవేయటానికి, ఉన్నత ప్రగతి శిఖరాలకు చేరడానికి పైన పేర్కొన్న సూత్రాలు మాత్రమే దోహదపడతాయి. ఇస్లామీయ ఉద్యమ మొదటి వరుసలోని ప్రవక్త సహచరులు ఈ సూత్రాలను ఉపయోగించుకొని సువర్ణాక్షరాలతో లిఖించదగిన మహోన్నత విజయాలను సాధించారు. ఈ పుడమిపై సర్వకాలాలకు, సర్వమానవాళికి ఆదర్శప్రాయమైన సమాజాన్ని నిర్మించారు. ఆదర్శవంతమైన పరిపాలనను అందించారు.

ఇతర విశ్వాస సమూహాల మాదిరిగానే ఇస్లామీయ జమాఅత్‌కు కూడా దైవానుగ్రహం తప్పనిసరిగా లభ్యమయింది. ఈ అనుగ్రహ భాగ్యంతో పాటుగా, దాని సున్నితమైన బాధ్యతలు కూడా దానికి అప్పగించబడ్డాయి. ఈ బాధ్యతల పరిపూర్తి కోసం ప్రత్యేక విధానం కూడా ఈ జమాఅత్‌కు అందజేయబడింది. బాధాకరమైన విషయం ఏమిటంటే, నేటి ముస్లిం సమాజం తన ధర్మసంస్థాపనా బాధ్యత వైపు కన్నెత్తి చూచే పరిస్థితిలో లేదు. ఖుర్ఆన్ దృక్పథం ద్వారా తెలిసే దైవసంప్రదాయం ప్రకారం, ఏ సంఘానికి అల్లాహ్ కారుణ్యం వరప్రసాదం, ఏ స్థాయిలో అనుగ్రహించబడుతుందో, ఆ సంఘం కృతఘ్నుతకు పాల్పడితే, నిర్లక్ష్యం ప్రదర్శిస్తే, ఆ కృతఘ్నుతకు, నిర్లక్ష్యానికి అదే స్థాయిలో కఠినమైన శిక్ష కూడా ఉండి తీరుతుంది. అధికారపు బాధ్యతలు ఉండీ, వాటిని నెరవేర్చని ప్రజాసంఘాలకు ఎంతటి శిక్ష ఉంటుందో, అంతకంటే రెండింతల శిక్ష నిర్లక్ష్యం ప్రదర్శించే విశ్వాసుల సంఘానికి విధించబడుతుంది. తన ప్రత్యేక అనుగ్రహాలు, వరాలు పొంది కూడా కృతఘ్నుత చూపిన ఫలితంగా ఈ శిక్ష విధించబడుతుంది. దివ్యఖుర్ఆన్ యొక్క హెచ్చరికలను

ఈ సందర్భంగా గమనించడం తప్పనిసరి అవుతుంది. ఈ భూమిపై ప్రవక్త ముహమ్మద్ (స) అంతటి దైవభక్తి, ప్రీతి, నిష్ఠగల మహోన్నత వ్యక్తిత్వం ఇంతవరకు జన్మించలేదు ... జన్మించబోదు కూడాను. అయినా అల్లాహ్‌కు అత్యంత ప్రీతిపాత్రుడైన ఈ భక్తుని సంబోధిస్తూ సృష్టికర్త అల్లాహ్ ఇలా హెచ్చరించాడు :

**"మేము గనక నీకు మనోబలాన్ని యిచ్చివుండకపోతే నీవు వారి వైపునకు కొంతైనా మొగ్గివుండేవాడవు అనేది అసంభవమేమీ కాదు. కాని ఒకవేళ నీవు అలా మొగ్గివుంటే, మేము నీకు ప్రపంచంలో కూడా రెట్టింపు శిక్షను రుచి చూపించి ఉండేవారము. పరలోకంలో కూడా రెట్టింపు శిక్షే. మాకు వ్యతిరేకంగా నీవు ఏ సహాయకుడినీ పొందివుండేవాడవు కాదు." (17 : 74,75)**

ఇక రెండవ ఉదాహరణగా స్వయంగా ప్రవక్తశ్రీ (స) వారి సతీమణులనే తీసుకోవచ్చు. వారికి అల్లాహ్ వైపు నుండి గౌరవోన్నతులు ప్రసాదించబడ్డాయి. సకల విశ్వాసులకు 'మాతృమూర్తులు'గా కీర్తించబడ్డారు. వారు సాధారణ మహిళలుగా కాక, ఉన్నతస్థాయి, స్థానం కలవారిగా, రెట్టింపు ఫలితం పొందేవారిగా ప్రశంసించబడ్డారు. "మీలో ఎవరు అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు విధేయత చూపుతారో, సత్కార్యాలు చేస్తారో, ఆమెకు మేము రెట్టింపు ప్రతిఫలం ఇస్తాము. మేము ఆమెకు గౌరవప్రదమైన ఉపాధిని సిద్ధపరచిఉంచాము" (33:31). అది చెప్పబడిన చోటనే వారికి "ఓ ప్రవక్త భార్యలారా! మీలో ఎవరైనా, ఏదైనా నీతిబాహ్యమైన పనిచేస్తే ఆమెకు రెట్టింపు శిక్ష విధించబడుతుంది" (33:30) అని కూడా స్పష్టం చేయడం జరిగింది.

వ్యక్తుల ఉపమానం తర్వాత జాతుల పట్ల కూడా అల్లాహ్ తన సంప్రదాయాన్ని స్పష్టంగా తెలియపర్చాడు. యూదు జాతి విషయంలో గమనిస్తే, ఈ జాతిపై అల్లాహ్ అనేక సంవత్సరాలు తన వరప్రసాదాలు కురిపిస్తూ వచ్చాడు. శత్రువుల నుండి వారిని రక్షించేందుకు సముద్రాన్ని సైతం రెండుగా చీల్చివేశాడు. కష్టకాలంలో 'మున్'-'సల్వా' అనబడే పరిశుద్ధ ఆహారాన్ని వర్షింపచేశాడు. చెట్టునీడ కానరాని ఇసుక మైదానంలో సూర్యతాపం నుండి రక్షింపజేస్తూ మబ్బులపందిరిని పై కప్పుగా అవరింపజేశాడు. ఆనాటి మానవ సమాజాలన్నింటిలో మహోన్నత గౌరవం వీరికి

ప్రసాదించబడింది. అయితే దేవుని అత్యంత ప్రియమైన ఈ వర్గం (అనగా యూదులు-అనగా ఆనాటి ముస్లిం సమాజం-అనగా ఆనాటి ఇస్లామీయ జమాఅత్) నేటి తోరా (తౌరాత్) గ్రంథంచే 'దేవుని స్వంత ప్రజలు' అని పిలవబడిన సంఘం ఎప్పుడైతే దైవంతో చేసిన వాగ్దానాలను విస్మరించిందో, దైవధిక్కారిగా మారిందో, దైవ ఆదేశాలను నిర్లక్ష్యం చేసిందో, అప్పుడు వారిపై అల్లాహ్ అభిశాపం శిక్షగా విరుచుకుపడింది. ఫలితంగా గౌరవోన్నతులు పొందిన ఈ సమూహం అత్యంత హీనస్థితికి దిగజారిపోయింది. అల్లాహ్‌కు అత్యంత ప్రియమైన ఈ జమాఅత్ ఆయన ఆగ్రహానికి గురిఅయింది.

అల్లాహ్ సంప్రదాయం ప్రకారం, ఆయన కారుణ్యం - బాధ్యతల నిర్వహణా పునాదులపై ఆధారపడి ఉంటుంది. ఈ సంప్రదాయంలో ఎప్పటికీ మార్పు ఉండదు. ఆయన సంప్రదాయం ఖచ్చితంగా సమత్వం, సమతూకాలపై ఆధారపడి ఉంటుంది. ఈ సంప్రదాయాన్ని మానవ నైజం కూడా తప్పకుండా ఆమోదిస్తుంది. మనం సాధారణంగా, మనకు అత్యంత ప్రియమైన వారి నుండే ఎక్కువ సహకారం పొందాలని భావిస్తాం. వారి నుండే ఎక్కువ బాధ్యతల నిర్వహణను ఆశిస్తాం. అదే ఒక అనామకుని నుండిగాని, లేక ఒక బాటసారి నుండిగాని, ఆ బాధ్యతలను, సహకారాన్ని అపేక్షించం. ఒక అపరిచయ వ్యక్తి మన మాటను వినకపోతే, మన ఆదేశాలను పెడచెవిన పెడితే, ఆ వ్యక్తిపై మనకు అంతగా కోపం రాదు. మనసు బాధకూ లోనుకాదు. అదే మనకు అత్యంత ప్రియమైన వ్యక్తి అనగా మన ప్రియపుత్రుడు లేక నమ్మకస్తుడైన సేవకుడు మన పట్ల బాధ్యతా రహితునిగా ప్రవర్తిస్తే పట్టరాని కోపమూ వస్తుంది, దానితో పాటు మనస్తాపమూ కలుగుతుంది. ఫలితంగా ఆ వ్యక్తికి కఠినమైన శిక్షను కూడా విధిస్తాం. అదే అపరిచితునికి అంతటి కఠిన శిక్ష విధించడానికి మనం సిద్ధంగా ఉండము. ఇదే పరిస్థితి సృష్టికర్త అల్లాహ్‌కు - అతని విశ్వాసపు బృందానికి మధ్యన ఉంటుంది. పరాయివారి పట్ల వ్యతిరేకత కేవలం 'వారు సత్యమైన మాట వినలేదు' అనేవరకే పరిమితమై ఉంటుంది. కాని మనకు ప్రియమైన వారిలో వ్యతిరేకతతో పాటు, సత్య నిరాకరణ, ద్రోహం, ధిక్కారం, కృతఘ్నుతలు కూడా కలిసి ఉన్నాయి. ఈ లక్షణాలున్న వారిని మానవ నైజం సైతం ఎన్నటికీ క్షమించజాలదు. ఇదే సూత్రాన్ని, నిబంధనను అల్లాహ్ కూడా తన దాసుల పట్ల పాటిస్తాడు. అది వ్యక్తి అయినా, తెగ లేక జమాఅత్ అయినా, అల్లాహ్ యొక్క ప్రత్యేక వరాలను

పొందిన తరువాత, ఆయన ఆదేశాలను ధిక్కరిస్తే, నిర్లక్ష్యం చేస్తే, సాధారణ పరిస్థితులకు భిన్నమైన, రెండింతల శిక్షకు అర్హులు అవుతారు. ఒకటి : ఆయన ఆదేశపాలనకు సంబంధించిన శిక్ష కాగా, మరొకటి : ఆయన పట్ల ప్రదర్శించిన ద్రోహానికి శిక్షగా ఉంటుంది.

అల్లాహ్ యొక్క సంప్రదాయపు వెలుగులో ఇస్లామీయ సమాజపు గతం మరియు వర్తమానాలను బేరీజు వేసి చూడాలి. అల్లాహ్ ఈ సమాజం పట్ల ఎలా వ్యవహరించాడు!? ఈ సమాజానికి ఆయన సకల అనుగ్రహాలను, గౌరవోన్నతులను ప్రసాదించలేదా? ప్రపంచ నాయకత్వపు పీఠం, ఉత్తమ సమాజపు బిరుదు, మధ్యస్థ సమాజపు హోదా, మానవాళి సమక్షంలో సాక్ష్యమిచ్చే పదవి ప్రసాదించలేదా? ధర్మపరిపూర్తి, మార్గదర్శకత్వపు వరాలు లాంటి ఆశీర్వాదాలు, గతంలో మరే సమాజానికైనా లభ్యమయ్యాయా? పై ప్రశ్నలన్నిటికీ సమాధానం 'అవున'ని మనకు తెలుసు. మరి ఇంతటి గౌరవ మర్యాదలు పొందిన సమాజంపై ఎంతటి బాధ్యతాభారం ఉంటుందో ఈ సమాజం మర్చిపోయిందా? తన బాధ్యతను వదిలివేస్తే లేక నిర్లక్ష్యం చేస్తే దానికి ఎంతటి మూల్యం చెల్లించవలసి ఉంటుందో, దాని ఫలితాలు ఎంత భయానకంగా ఉంటాయో తెలియదా? బహుమానం – శిక్షల విషయంలో అల్లాహ్ సంప్రదాయం, తన ప్రియప్రవక్తలను, వారి భార్యామణులను సైతం లెక్కచేయనప్పుడు, సాధారణ దాసుల పరిస్థితి ఎలా ఉంటుందో తెలియదా? ఉత్తమ సమాజపు బిరుదు పొందిన ఈ సమాజపు రికార్డు 'ఉత్తమంగా', దాని ప్రవర్తన 'ఉత్తమంగా' నేటికీ కలిగివుండీ – దానికి నేటి దౌర్భాగ్యపుస్థితి దాపురించి ఉంటే, అది తప్పనిసరిగా ఆశ్చర్యపడవలసిన విషయమే. కాని, ఒకవేళ ఈ శ్రేష్ఠ సమాజ బిరుదాంకితులు తమ బాధ్యతలను నిర్లక్ష్యంచేస్తే తత్ఫలితంగా అనుభవంలోకివచ్చే దుర్భర పరిస్థితులను చూచి ఎంతమాత్రమూ ఆశ్చర్యపడవలసిన పనిలేదు. అల్లాహ్ ఎవరినీ అన్యాయంగా శిక్షించడు. లోగడ ఆయన ఎవరిని ఆ విధంగా శిక్షించాడనీ? అకారణంగా ఆయన ఏ జాతినీ పతనాల లోయల్లోకి నెట్టివేయడు. కాస్త ఆలోచించండి! ఈ ముస్లిం సముదాయంపై మోపబడిన బాధ్యత ఏమిటి? అది చేస్తున్నదేమిటి? ఇస్లామీయ సమాజపు బాధ్యతల విషయానికి అనేక ఆదేశాలు గడచిన పుటల్లో తెలుసుకున్నప్పటికీ – మరిన్ని అంశాలు ఈ సందర్భంగా కూడా తెలుసుకోవలసిన అవసరం ఉన్నది. దివ్య గ్రంథం ఖుర్‌ఆన్ ముస్లిం సమాజాన్ని సంబోధిస్తూ "మీ ప్రభువు తరఫు నుండి

మీపై అవతరించిన దానిని అనుసరించండి. మీ ప్రభువును త్రోసిరాజని ఇతర సంరక్షకులను అనుసరించకండి" (7:3) అని హెచ్చరించింది.

ఈ హెచ్చరిక నేపథ్యంలో ముస్లింల ఆచరణ ఎలా ఉండాలి? వారు తమ జీవితంలో ఎటువంటి పాత్రను పోషించాలి? ఈ ప్రశ్నలకు ఖుర్ఆన్ ఇచ్చిన పై సమాధానం అన్ని విధాలా సరైందని తెలుస్తుంది కదా! పై విషయం ద్వారా ఏది చేయాలి? ఏది చేయకూడదు? దేనిని అనుసరించాలి? దేనిని అనుసరించకూడదు అనే విషయాలు స్పష్టంగా చెప్పబడ్డాయి. సృష్టించిన సృష్టికర్త నుండి ఎప్పుడైతే ఒక ఆదేశం ఇవ్వబడుతుందో దానిని తప్పనిసరిగా అమలుచేసి తీరాలి. ఈ ఆదేశాలు విశ్వాసాలకు సంబంధించినవి కావచ్చు నైతిక విలువలకు సంబంధించినవీ కావచ్చు. జీవన వ్యవహారాలకు సంబంధించినవీ కావచ్చు. వ్యక్తిగత, సామూహిక విషయాలూ కావచ్చు. అసెంబ్లీ, పార్లమెంటు వ్యవహారాలూ కావచ్చు. మార్కెట్ లేక గృహ సంబంధ విషయాలూ కావచ్చు. సందర్భం ఏదైనా, పరిస్థితి ఎటువంటిది అయినా, దైవాజ్ఞల అమలు, హితబోధనల స్వీకరణ తప్పనిసరి అవుతుంది. వారి పునాదులపైనే నిర్ణయాలు తీసుకోబడాలి. నిబద్ధుడై, నిష్ఠాగరిష్ఠుడై ఈ ఆదేశాలకు అనుగుణంగా ఆచరించాలి. తత్భిన్నంగా, నిజప్రభువు, సృష్టికర్త అయిన అల్లాహ్, ఆయన ద్వారా పంపబడిన సందేశహరుని (స) మార్గదర్శకత్వం తప్ప – మరెవ్వరి మార్గదర్శకత్వమైనా, భావనా స్రవంతిఅయినా, తాత్విక చింతన అయినా, ఆచరణ, విధివిధానమైనా, పద్ధతులైనా ఎదురుపడితే వెంటనే, తప్పనిసరిగా వాటిని పరిత్యజించవలసి ఉంటుంది. అల్లాహ్ ఆదేశపాలన ఎంతగా అత్యవసరమైనదో – దానికి వ్యతిరేకమైన విషయాలను గోడకు విసిరికొట్టడం కూడా అంతే ఆవశ్యకమని గ్రహించాలి.

ఖుర్ఆన్ కోరేదేమిటో తెలిసిన తరువాత మన ముందు రెండు దారులు మాత్రమే ఉంటాయి. ఒకటి : ఖుర్ఆన్ ఆదేశాలను పూర్తిగా వ్యతిరేకించేసి దైవేతరుల ఆదేశాల ముందు తలవంచి జీవించటం. అంటే, ఈ వ్యతిరేకించే వ్యక్తి ఖుర్ఆన్ను, దాని బోధనలను పూర్తిగా నిరాకరించేవాడే కానవసరం లేదు. ఈ వ్యక్తి ఖుర్ఆన్ను సత్యమైనదిగా అంగీకరిస్తూ దైవాజ్ఞలను నిర్లక్ష్యం చేయకూడదని ఆమోదిస్తాడు. ఇందులో ఎటువంటి అభిప్రాయభేదానికి తావు యివ్వడు. అయితే, ఆచరణ దగ్గరికొచ్చేసరికి కొన్ని ఆదేశాలను అమలుచేస్తూ మరికొన్నింటిని అమలు చేయడానికి వెనుకంజవేస్తాడు.

అత్యంత ప్రమాదకరమైన ఈ ధోరణి ద్వారా తీరని నష్టం వాటిల్లుతుందని గుర్తించడం పెద్ద కష్టమైన పనికాదు. అయితే ఖుర్‌ఆన్ గ్రంథానికి సంబంధించినంత వరకు ఇటువంటి ద్వంద్వ ప్రమాణాలు, ఆచరణలు కలవారి గురించి విస్పష్టమైన ప్రకటనలు ఈ క్రింది వాక్యాల రూపంలో ఉన్నాయి -

**"మీరు దైవగ్రంథంలోని ఒక భాగాన్ని విశ్వసించి, మరొక భాగాన్ని తిరస్కరిస్తారా? మీలో ఇలా చేసేవారిని ఇహలోక జీవితంలో ఘోర అవమానానికి, పరలోకంలో తీవ్రమైన బాధకూ గురిచెయ్యటం తప్ప మరొక శిక్ష ఏముంటుంది?" (2:85)**

దైవగ్రంథపు పై తీర్పు ద్వారా, మనిషి తాను విశ్వసించిన తరువాత తనను సంపూర్ణంగా దానికి అప్పగించివేయాలని స్పష్టమౌతోంది. అంటే ఖుర్‌ఆన్ ఏమి ఆదేశిస్తుందో, దానిపై తు.చ. తప్పకుండా అమలు జరగడం అత్యవసరం. తనను అనుసరించే వారికి జీవితపు విభిన్న రంగాలలో ఏ హద్దులను అయితే అది గీచిందో - ఆ హద్దులను దాటే ప్రయత్నం చేయకూడదు. అలా దాటే ప్రయత్నం చేసేవారిని 'దుర్మార్గులు'గా ఖుర్‌ఆన్ ముద్రవేసింది. "అల్లాహ్ విధించిన హద్దులను అతిక్రమించేవారే దుర్మార్గులు" (2:229). కాబట్టి ఖుర్‌ఆన్‌ను విశ్వసించడం, 'ముస్లిం' అవడంలోని అసలు అర్థం ఏమిటంటే, ఒక విశ్వాసి ఖుర్‌ఆన్‌లోని అత్యంత చిన్న ఆదేశం పట్ల కూడా నిర్లక్ష్యం వహించడం ఎంతమాత్రం తగదు.

పై అల్లాహ్ ఆదేశం వెలుగులో నేటి ముస్లిం సమాజ ఆచరణపై దృష్టిని సారిస్తే కనపడే దృశ్యం అత్యంత నిరాశాజనకంగా ఉంది. నిష్పక్షపాతంగా బుద్ధి ఉపయోగించి "మా ఉన్‌జిల ఇలైకుమ్ మిర్రబ్బికుమ్" అనే ఆదేశాన్ని మొదటి నుండి చివరి వరకు పరిశీలించి, దానిపట్ల నేటి ముస్లిం సమాజపు వైఖరిని లోతుగా విశ్లేషించి చూడండి - ఆ తరువాత ఖుర్‌ఆన్‌లోని ఎన్ని ఆదేశాలపై అమలు జరుగుతుంది? అనే అంశాన్ని కూడా పరిశీలించండి. కేవలం ముస్లిం పేరుతో ఉండి, దైవ ఆదేశాలను నిరంతరంగా ధిక్కరిస్తూ, వరుసగా నిర్లక్ష్యపరుస్తూ జీవితం కొనసాగిస్తున్న ముస్లింలను వదిలివేయండి. వీరు తమ ఆచరణ ద్వారా, ఇస్లామీయ ఆదర్శాలను, ఆదేశాలను ఒక్కొక్కటిగా ధిక్కరిస్తూ, వాటి నామరూపాలను తుడిచివేస్తూ, అదే తమ జీవిత లక్ష్యంగా, నిర్లక్ష్యంగా జీవించేస్తూ వున్నారు. ఈ ప్రవర్తన కలిగిన

వారిని ధర్మశాస్త్ర పరిభాషలో 'ఫాసిఖ్', 'ఫాజిర్' అని అంటారు. కాని, ఏ ముస్లిం సముదాయం అయితే పుణ్యకార్యాలలో, నిష్ఠలో, విశ్వాసం, ఆచరణలో అగ్రగణ్యులుగా భావించబడుతూ ఉన్నారో - వారు, తమ వ్యక్తిగత జీవితంలో ఆదేశించబడిన దైవ ఆదేశాలపై నిరంతరం జాగరూకులై ఉంటారో - నమాజ్, రోజాలను పూర్తి నిష్ఠతో అమలుచేస్తూ ఉంటారో - జకాత్ తదితర దాన ధర్మాలు చెల్లిస్తూ ఉంటారో- అసత్యం, చాడీలు, అసూయ అపవాదుల ప్రచారం లాంటి దుష్టత్వాల నుండి తమ నోళ్ళను భద్రపరుచుకుంటూ ఉంటారో - అహంభావం, గర్వం, డాంబికం, ప్రదర్శనాబుద్ధి, నమ్మకద్రోహం, వాగ్దాన ఉల్లంఘన, దౌర్జన్యం, లంచం, అన్యాయం, అక్రమం, అధర్మసొమ్ము తినటం, అరాచకాన్ని సృష్టించటం లాంటి కళంకాల నుండి తమ విశ్వాసాన్ని నిరంతరంగా పరిరక్షించుకుంటూ ఉంటారో, వారు సైతం తమలోని పైన పేర్కొన్న సుగుణాలు సమృద్ధిగా తమ వ్యక్తిగత జీవితంలో కలిగివున్నప్పటికీ, సామూహిక జీవిత ఆదేశాల పట్ల భరించవీలుగాని, క్షమార్హం కాని నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తూ ఉన్నారు. ఈ సామూహిక అంశాలలో ఒక అవిశ్వాసుల వర్గానికి, వీరికి మధ్య ఎలాంటి వ్యత్యాసాన్ని మనం చూడలేము. అల్లాహ్ గ్రంథం కేవలం వ్యక్తిగత అంశాల గురించి మాత్రమే ఆదేశించి ఉండినట్లైతే, వీరి ప్రవర్తన నూటికి నూరు శాతం నికార్సయినదిగా ఉండేది. కాని, అల్లాహ్ గ్రంథం, వ్యక్తిగత నిష్ఠకు ఎంతటి ప్రాముఖ్యత యిచ్చిందో, అదే స్థాయిలో సామూహిక నిష్ఠ గురించి కూడా ఆదేశాలు జారీ చేసింది. నమాజ్, రోజా, తఖ్వా, నిబద్ధత, సత్ప్రవర్తన, ధర్మాధర్మాల ఆదేశం ఇచ్చిన చోటనే, అల్లాహ్‌కు తప్ప దాస్యం (బందగీ) మరెవ్వరికీ చేయరాదని ఆదేశించింది. అల్లాహ్‌ను మాత్రమే ఆరాధ్యునిగా, ప్రభువుగా, పరిపాలక చట్ట నిర్దేశకునిగా, ఖుర్ఆన్ విస్పష్టంగా ప్రకటించింది. "అల్లాహ్ తప్ప ఆరాధ్యుడు లేడు", "పరిపాలించే అధికారం అల్లాహ్‌కు తప్ప మరెవ్వరికీ లేదు" (12:40). "సృష్టి మొత్తం అల్లాహ్‌దే. ఆజ్ఞాపించే అధికారమూ ఆయనదే" (7:54). "కేవలం అల్లాహ్‌కు మాత్రమే దాస్యం చేయండి - మిథ్యా దైవాల ఆరాధనకు దూరంగా ఉండండి" (16:36) అల్లాహ్ ఆదేశం ప్రకారంగా కాక, తన స్వంత ఆదేశాల ప్రకారం తీర్పులు చేసేవారిని, అల్లాహ్ ప్రాముఖ్యాధిపత్యం పట్ల విధేయత చూపని, అల్లాహ్ గ్రంథాన్ని అంతిమ ప్రమాణంగా అంగీకరించని 'తాగూత్' లందరినీ విసర్జించమని హెచ్చరించడం జరిగింది. "వాస్తవానికి తాగూత్‌ను తిరస్కరించండి అని వారిని ఆదేశించడం జరిగింది"

(4:60). అల్లాహ్ హక్కుల గురించి జ్ఞానం లేనివారి, ఆయన ఏర్పర్చిన హద్దులను అతిక్రమించే వారి మాట వినకూడదని ఆజ్ఞాపించడం జరిగింది. "హద్దులు మీరేవారిపట్ల విధేయత చూపకండి" (26:161). తీర్పులుగాని, సమస్యల పరిష్కారంగాని కేవలం దైవ ఆదేశాల ప్రకారమే జరపాలి. "అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం ప్రజల వ్యవహారాలను పరిష్కరించు" (5:49). తమ తీర్పులు కేవలం అల్లాహ్ ఆదేశాల ప్రకారమే తీర్చబడాలి. దైవేతర న్యాయస్థానాలలో తమ సమస్యల పరిష్కారానికి వెళ్ళకండి అని హెచ్చరించడం జరిగింది (4:60). దైవేతర న్యాయస్థానాలలో తీర్పుల కొరకు వెళ్ళేవాడు, దౌర్జన్యపరుడు, మోసగాడు, తిరస్కారిగా భావించబడతాడు.

**"అల్లాహ్ అవతరింపజేసిన చట్టం ప్రకారం తీర్పు చేయనివారే అవిశ్వాసులు" (5:44).**

**"అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం తీర్పు చేయనివారే దుర్మార్గులు" (5:45).**

**"అల్లాహ్ అవతరింపజేసిన శాసనం ప్రకారం తీర్పు చేయనివారే హద్దులు మీరినవారు" (5:47).**

ఏ చెడునుగాని, దౌర్జన్యాన్ని సహకరించే పనిలోగానీ పాలుపంచుకోకూడదని సావధానపర్చబడింది. "పాపకార్యాలలో, అత్యాచారాలలో ఎవరితోనూ సహకరించకండి" (5:2). దైవధిక్కార వ్యవస్థ మెడలు విరిగిపోయేవరకు, దైవ వ్యవస్థ స్థాపించబడేవరకు పోరాడుతూనే ఉండాలని సలహా ఇవ్వబడింది. "పీడన అంతమయ్యేవరకు, దైవధర్మం స్థాపించబడేవరకు మీరు వారితో యుద్ధం చేస్తూనే ఉండండి" (2:193). ఎవరైతే తనను సృష్టించిన వానినే ధిక్కరిస్తాడో – ఆ సృష్టికర్తచే పంపబడిన సందేశహరునితో శత్రుత్వం వహిస్తాడో – అతనికి ఈ భూమిపై జీవించే హక్కు ఉండదు. "అల్లాహ్‌తో ఆయన ప్రవక్తతో పోరాడేవారికి, ధరణిలో కల్లోలం సృష్టిస్తూ తిరిగేవారికి మరణ దండన విధించండి" (5:33). దొంగతనాలు చేస్తూ సమాజంలో అశాంతికి ఎవరైతే పాల్పడుతారో వారి చేతులు ఖండించివేయాలి. "దొంగ – స్త్రీ అయినా, పురుషుడైనా ఉభయుల చేతులు ఖండించండి" (5:38). వ్యభిచారం ద్వారా సమాజంలో కల్లోలం రేపేవారు కఠినంగా శిక్షింపబడాలి. "వ్యభిచారి

– వ్యభిచారిణి ఈ ఇద్దరిలో ప్రతి ఒక్కరికీ నూరేసి కొరడా దెబ్బలు కొట్టండి" (24:2). శీలవతులపై నిందలు మోపడం ద్వారా సమాజంలో కల్లోలం రేపేవారు శిక్షించబడాలి. "ఎవరైనా శీలవతులపై నిందలుమోపి తరువాత నలుగురు సాక్షులను తీసుకురాకపోతే, వారికి ఎనభై కొరడా దెబ్బలు కొట్టండి" (24:4) హత్య చేయడం ద్వారా సమాజంలో కల్లోలం రేపినవారికి సమ న్యాయ శిక్ష విధించబడాలి. "మీ కొరకు హత్యా వ్యవహారాలలో ప్రతీకార న్యాయాలను నిర్ణయించబడింది" (2:178). పైన కొన్ని సామూహిక ఆదేశాలు మాత్రమే పేర్కొనబడ్డాయి. సమాజాన్ని కల్లోలాల నుండి, అశాంతి నుండి రక్షించడానికి, సత్సమాజ నిర్మాణం కొరకు అవసరమైన అనేక చట్టపర ఆదేశాలు దివ్య ఖుర్ఆన్ అందించింది. దైవ శాసనాల అమలు వ్యక్తిగత జీవితంపైనే కాక, సామూహిక జీవన రంగంపై కూడా ఆవరించి ఉంటుంది. ఈ ఆదేశాలు అన్నీ మనిషి ఆచరించి తీరాలని దైవ చట్టం శాసిస్తుంది. ఈ ఆదేశాలన్నీ కూడా స్వయంగా దైవగ్రంథంచే ఆదేశించబడినవే. రోజా, నమాజ్, జకాత్‌ల లాగానే ఈ ఆదేశాలన్నీ అమలు చేయవలసినదే. ఈ ఆదేశాలన్నీ స్వయం సంపూర్ణంగా అమలులోకి రానంతవరకు, అమలు చేయబడనంతవరకు దైవవిధేయత, దైవదాస్యపు హక్కు పరిపూర్తిగా నెరవేరదు. ఖుర్ఆన్ ఆదేశాలపై పరిపూర్ణ ఆచరణ, అమలు నేడు పూర్తిగా జరుగుతుందని చెప్పగలమా?

పై వాస్తవికతను దృష్టిలో ఉంచుకొని ఏ జమాఅత్ అయితే అల్లాహ్ గ్రంథాన్ని సంపూర్తిగా ఆచరణలోకి తెస్తామని ప్రతిజ్ఞ చేసిందో, దానికి – ఇతర వ్యక్తిగత ఆదేశాల అమలు ఏ విధంగా తప్పనిసరి విధిగా ఉంటుందో – అదేవిధంగా సామూహిక ఆదేశాల అమలు కూడా తప్పనిసరి అయివుంటుంది. వీటిలో కొన్ని విశ్వాసం – సాఫల్యాలకు తప్పనిసరి షరతులై ఉన్నాయి. ఈ కారణంగా ఒక ముస్లింకు ఈ ఆదేశాలు తప్పనిసరి అంశాలు అవుతాయి. కాని, మన ధర్మబద్ధ, నిష్టాగరిష్టులైన విశ్వాసుల బృందాలలో సైతం ఈ ఆదేశాలపై అమలు మచ్చుకు కూడా కానరావడం లేదు. సరికదా, వాటి అమలు కోసం కృషి చేయవలసిన అవసరాన్ని సైతం వారు గుర్తించడం లేదు. మన ఆరాధ్యుడు, ప్రభువు, పాలకుడు, చట్టనిర్దేశకుడు, సృష్టికర్త తప్పనిసరిగా "అల్లాహ్‌యే" అని మనం అంగీకరిస్తున్నాం. అయితే ఆయన ప్రభుసత్తాకాన్ని, పాలనాధికారాన్ని, ఆరాధనా హక్కును, కేవలం

మన మస్జిద్ నాలుగు గోడల వరకే పరిమితం చేసివేశాము. ఈ గోడలకు ఆవల మనకు ప్రభువులు, పాలకులు, ఆరాధ్యులు వేరేవారుగా ఉంటారు. వీరూ మన లాంటి దైవదాసులేననీ, మనలాగానే అల్లాహ్ దాస్యం కోసం - ఆరాధన కోసం పుట్టించబడిన వారేననీ మనం మరచిపోతాం. వీరిలో కొందరైతే దైవద్రోహులుగా ప్రవక్త (స) సంప్రదాయాలకు వ్యతిరేకులుగా, దౌర్జన్యపరులుగా ఉంటారు. వీరిలో మరి కొందరు ముస్లిం నామధేయులూ ఉంటారు. ఈ ముస్లిం నామధేయులు ప్రజల పట్ల అల్లాహ్‌కు ఉన్న హక్కులను తమకు స్వంతం చేసుకున్నవారూ అయి ఉంటారు. దాదాపుగా పైన పేర్కొన్న రెండు తరహాల నాయకత్వాన్నే నేటి ముస్లిం సముదాయం తమ "అర్‌బాబమ్ మిన్‌దూనిల్లాహ్" గా అంగీకరించి అనుసరిస్తూ ఉన్నారు. ఈ భూలోక ఆరాధ్యులు రచించిన చట్టాలే ఈ ముస్లిం సమాజానికి శిరోధార్యాలుగా ఉన్నాయి. ఈ చట్టాలకు దైవాదేశాలతో గాని, ప్రవక్త విధానాలతో గానీ ఎలాంటి సంబంధం ఉండదు. ముస్లిం సమాజపు ఈ దయనీయ స్థితి వెనుక ఒక సుదీర్ఘ చరిత్రయే ఉంది. మొదటగా అది మానవ జీవితం యొక్క ప్రాథమిక సమస్యల పట్ల నిర్లక్ష్యం వహించింది. ఆ తరువాత దైవేతర శక్తులకు సహకరించే పాలిసీని ఎంచుకున్నది. ఆ తరువాత తనలాంటి మనుషుల చేతుల్లోనే పాలనాధికార పగ్గాలను అందించి వారినే తమ నాయకులుగా, ప్రభువులుగా అంగీకరించింది. ఫలితంగా ప్రభుత్వ ఆజ్ఞల ద్వారా అమలు అయ్యే చట్టాలన్నీ ఇస్లామేతర, దైవేతర ఆదేశాల రూపాన్ని సంతరించుకున్నాయి. ఇప్పుడు ఈ ముస్లిం సమాజపు జీవిత సూత్రాలు, రాజకీయ దృక్పథాలు, సామాజిక ఆలోచనలు, ఆర్థిక సూత్రాలు అన్నీ సమూలంగా మారిపోయాయి. మన జీవన విధానపు రూపురేఖలే మారిపోయి, చివరకు మన భావజాలం, ఆలోచనల విధానం సైతం అగమ్యగోచరంగా మారిపోయింది. ఇప్పుడు ఈ ముస్లిం సమాజం ఏ భాగస్వామిలేని విశ్వసామ్రాజ్యాధిపతి, ఆరాధ్యుడు అయిన అల్లాహ్ అధికారాన్ని ఆమోదించడానికి సిద్ధంగా లేదు. తనలాంటి మనుషులనే పాలనాధిపతులుగా, ప్రభువులుగా ఆమోదించి వారికి ముందు వరుస ప్రచారకులుగా ఉన్నారు. ఇస్లామేతర, దైవధిక్కార, ఖుర్ఆన్ వ్యతిరేక వ్యవస్థను ధ్వంసం చేయవలసిన వీరే ఈ వ్యవస్థకు చోదక శక్తులుగా, డ్రైవర్లుగా పనిచేస్తూ ఉన్నారు. ముస్లిం సమాజ సభ్యులు నేడు అత్యంత ప్రశాంతంగా

అల్లాహ్‌చే అవతరింపజేయబడిన చట్టాలను తృణీకరించి, ప్రజా నిర్మిత చట్టాల పునాదులపై తమ జీవన సమస్యలను పరిష్కరించుకుంటూ, పరిష్కరింపజేస్తూ ఉన్నారు. ఆయా పరిష్కారాలలో అల్లాహ్ ఆదేశాలు, వాటి అవసరాల గురించి సంపూర్ణ జ్ఞానం వీరికి ఉన్నప్పటికీ వాటిని నిర్లక్ష్యం చేస్తూ ఉంటారు. దొంగతనం, వ్యభిచారం, హత్య, విశ్వాస ధిక్కరణ, అపవాదాల ప్రచారం లాంటి నేరాలకు, ప్రవక్త సంప్రదాయం ప్రకారం ఇస్లామీయ శిక్షలు ఎక్కడా విధించబడటం లేదు. నిజానికి ఈ ధర్మ నియమాలను పరిరక్షిస్తానని, అమలు జరుపుతానని, తన నిజ ఆరాధ్యుడు అల్లాహ్‌తో ఈ ముస్లిం సమాజం వాగ్దానం చేసి ఉంది.

ఈ విధంగా దైవగ్రంథంలోని ఒక ముఖ్య భాగం, గ్రంథంలోని కేవలం 'రాతగా' లేకుంటే పారాయణానికి అర్హమైనది, పరిమితమై పోయింది. ఈ గ్రంథాన్ని అంగీకరించే విశ్వాసుల వర్గం తన నిజ జీవితంలో, ఈ గ్రంథంలో ఎలాంటి సంబంధం లేకుండా ఉండిపోయింది. మనలో దివ్య ఖుర్‌ఆన్ బోధనలూ, ఆదేశ–మార్గదర్శకాల చైతన్యం ఉండి కూడా – మానసిక దౌర్బల్యానికి, కోరికల దాస్యానికి గురిఅయి ఈ దైవగ్రంథాన్ని నిర్లక్ష్యపరుస్తూ ఉన్న మన నేటి స్థితి ఆనాటి గ్రంథవహుల (యూదుల, క్రైస్తవుల) స్థితికి భిన్నమైనది కాదు. వారు తౌరాతు, ఇంజీలు గ్రంథాల పట్ల ఏ వైఖరి అవలంబించారో, అదే వైఖరి నేడు ఖుర్‌ఆన్ పట్ల అవలంబించబడుతూ ఉంది. అయితే ఖుర్‌ఆన్ అల్లాహ్ యొక్క అంతిమ గ్రంథంగా సందేశంగా అవతరించిన గ్రంథం. దీని సంరక్షణా బాధ్యత స్వయంగా అల్లాహ్‌యే స్వీకరించి ఉన్నాడు. కనుక గతంలోని ఆకాశ గ్రంథాలలో మార్పులు, చేర్పులు చేసినట్లు ఈ గ్రంథంలో మార్పులు, చేర్పులు సాధ్యం కావు. అయితే నేటి ముస్లిం సమాజం ఈ దైవగ్రంథంలోని ఒక పెద్ద భాగాన్ని ప్రచారంలోకి తేకుండా ఆచరణలోకి రానీకుండా చేయడం ద్వారా ఒక ఘోరమైన దౌర్జన్యం, నేరం చేస్తూ ఉంది. జీవితంలో ఆచరించవలసిన ఆదేశాలను మరుగుపరుస్తూ ఉన్నారు. "కొంత ఆమోదం – కొంత ధిక్కారం" పాలసీని అమలుచేస్తూ అత్యంత ప్రశాంతంగా జీవితాన్ని కొనసాగిస్తూ ఉన్నారు. ఈ కారణంగా సృష్టికర్త అల్లాహ్ తన హితోపదేశం "దైవగ్రంథపు ఒక భాగాన్ని ఆమోదించి – మరోభాగాన్ని తృణీకరించడం" యొక్క తప్పనిసరి ఫలితం అయిన "ఈ ప్రపంచంలో కఠినమైన శిక్షకు, పరాభవానికి" నేటి ముస్లిం సమాజం అర్హత సంపాదించుకుంది. దైవ సంప్రదాయంలో మార్పు ఉండదు కదా!

## మూడవ అధ్యాయం

# కర్తవ్యం పిలుస్తోంది

ప్రస్తుత మన ఈ దయనీయ స్థితి యధాతథంగా ఉండటం మనకు ఇష్టంలేదనుకున్నా, ఈ దుస్థితి నుండి విముక్తి పొందాలన్నా, తమ ఉనికితోనే శత్రుత్వం కొనసాగించే ఒక కర్తవ్య విముఖ అపఖ్యాతి నుండి తప్పించబడాలన్నా, ఇటు సృష్టికర్త ముందు దోషిగా నిలబడే దౌర్భాగ్యకర పరిస్థితి నుండి తప్పించబడాలన్నా, దానికి ఒకే ఒక మార్గం ఉంది. వారు తమను తాము తెలుసుకోవాలి. తమ కర్తవ్యాన్ని గుర్తెరగాలి. తమ విధి, కర్తవ్యాల పట్ల నిబద్ధులై, కర్తవ్య నిర్వహణకోసం నడుం బిగించాలి. తమ లక్ష్యం-ధ్యేయాల వైపుకు ఏకోన్ముఖులై ప్రయాణం కొనసాగించాలి. ముస్లిం అయినందువల్ల తమపై విధి అయిపోయిన ధర్మస్థాపనా లక్ష్యాన్ని కేవలం ఒక ఆదర్శంగా కాక, తమను సృష్టించిన సృష్టికర్త యొక్క ఆదేశిత గ్రంథపు ఆజ్ఞగా అంగీకరించాలి. సర్వసత్త ఆదేశంగా, జ్ఞాన సరోవరంగా, ఏ ఖుర్ఆన్‌ని మనం అంగీకరించామో, ఆ గ్రంథపు ఆదేశాలను తు.చ. తప్పకుండా విధేయతతో అమలుజరపాలి. ఈ వాగ్దానాన్నే మనం, మన సృష్టికర్తతో చేసివచ్చాము. నేటి ముస్లిం సమాజపు మానసిక స్థితి, నాడు దివ్య ఖుర్ఆన్ అవతరిస్తూ ఉన్న కాలంలో, అప్పటి గ్రంథవహులైన యూదులు, క్రైస్తవుల మానసిక స్థితిలాగానే ఉంది. దివ్య ఖుర్ఆన్ ఆనాటి యూద క్రైస్తవ సమాజాల విశ్వాసాల, ఆచరణల ఆచారాలలోని అసంబద్ధతను, మార్గభ్రష్టత్వాన్ని, చెడులని విమర్శించినపుడు వాటి ఫలితాల పట్ల హెచ్చరించినప్పుడు - వాస్తవమైన, సత్యమైన ధర్మాన్ని ప్రతిపాదించినపుడు - వారు, తమ్ము తాము సరిదిద్దుకోవలసింది పోయి, దానికి భిన్నంగా తమలోని అజ్ఞానపూరిత అహంభావం మరింతగా పెరిగిపోయింది. అందులోని ఒక వర్గం, ఒక అడుగు ముందుకు వేసి, మేము ఆకాశ గ్రంథాలు కలిగినవారమనీ, అల్లాహ్‌కు అత్యంత ప్రియమైన వారమనే అహంకారం వారిలో నర నరాన జీర్ణించుకొని ఉండింది. మరొక వర్గం, స్వయంగా తాము దైవానికి పుత్రులమని, గారాలపట్టీలమని భావించేవారు. ఈ కారణంగానే వారి హృదయాలు, హితోపదేశం పొందేస్థాయిని

కోల్పోయాయి. వారి ఆలోచనా కవాటాలు మూసుకొనిపోయాయి. ఫలితంగా వారు ఇస్లామీయ సమాజంపై వైరి వర్గంలాగా విరుచుకుపడటం మొదలెట్టారు. ఇస్లామీయ ఉద్యమంపై దాడి చేయటంతో పాటు – తమ ప్రాధాన్యత, గొప్పతనం, నాయకత్వం, ప్రాముఖ్యతల ప్రచారం మొదలెట్టారు. వీరు చేస్తున్న వితండ వాదనలో, విమర్శల పరంపరను ఖండిస్తూ అల్లాహ్ "ఓ ప్రవక్తా! వారితో స్పష్టంగా ఇలా చెప్పు : గ్రంథ ప్రజలారా! మీరు తౌరాతును, ఇంజీలునూ, మీ ప్రభువు తరపు నుండి మీ వైపుకు అవతరింపజెయ్యబడిన ఇతర గ్రంథాలనూ, ప్రతిష్ఠించనంత వరకు, అసలు మీరు ఏ పునాదిపైనా లేనట్లే" (5:68) అని స్పష్టపరచడం జరిగింది.

అంటే; సత్య ధర్మ పునాదులపై దృఢంగా నిలబడకుండా, ధర్మోపదేశాలు, ఆరాధనా విధానాలపై, ఆజ్ఞలు జారీ చేసే అధికారం వారికి లేదని స్పష్టం చేయడం జరిగింది. వీరు తమ పునాదులను తమకు తాముగా త్రవ్వి పారేసుకున్నవారు. ధర్మం విషయంలో వీరు తిరిగి తమ పునాదులపై నిలబడకుండా అంటే, నిజప్రభువు విధించిన హద్దులకు, ఆజ్ఞలకు లోబడి తమ జీవితాలను సంస్కరించుకోకుండా, సందర్భానుసారంగా అవతరించిన హితోపదేశాలకు అనుగుణంగా తమ జీవితాలను మలచుకోకుండా, ధర్మం గురించి చర్చించే, వాదించే అర్హత లేదని స్పష్టీకరించబడింది. దైవగ్రంథంలోని ఏ ఏ భాగాలను వీరు మరుగుపర్చారో, వాటిని తిరిగి బహిరంగపర్చాలనీ – వాటిని జీవితంలో ఆచరించాలనీ – ఏ విలువల ప్రతిష్ఠాపన కోసం వీరికి జ్ఞాన సరోవరం ప్రసాదించబడిందో దానిని పరిరక్షించాలని నిర్ద్వంద్వంగా చెప్పడం జరిగింది. ఏ కర్తవ్య నిర్వహణ, లక్ష్యం, ధ్యేయాలను వీరు మరిచిపోయారో – దానిని గుర్తుకు తెచ్చుకొని, ఆ ధర్మసంస్థాపన కోసం నడుం బిగించాలని ఆదేశించడం జరిగింది.

ఇప్పుడు ఆలోచించవలసిన విషయం ఏమిటంటే, దివ్య ఖుర్ఆన్ వెలుగులో ముస్లిం సమాజం (ఉమ్మత్), తన స్వంత ఆచరణలో, దైవగ్రంథ అనుసరణలో పైన పేర్కొన్న దుస్థితికే లోనై ఉంది. అల్లాహ్ గ్రంథంలోని ఒక పెద్ద భాగం ఉత్త పుణ్యానికి, పారాయణం కోసం మాత్రమే పరిమితం చేయబడింది. ఈ భాగంలో ఎలాంటి ఆచరణాత్మక సంబంధం లేకుండా పోయింది. ఈ పరిస్థితులలో దైవన్యాయం ఏమి ఆదేశిస్తుంది? ఈ దౌర్జన్యం చేస్తున్నవారిని "లస్తుమ్ అలా షైయిన్" (అసలు మీరు

ఏ పునాదిపైనా లేనట్లే) అని భావించక తప్పదుగదా! 'ఖుర్‌ఆన్‌ను స్థాపించనంత వరకు ఈ ఉమ్మత్ సత్యసాక్షిగా (షహదా హఖ్), ఉత్తమ సమాజపు (ఖైరె ఉమ్మత్) హక్కును నెరవేర్చే హక్కుదారునిగా ఉండగలుగుతుందా? ఖచ్చితంగా ఉండజాలదు. అలా కోరడం నిస్సందేహంగా అత్యాశే అవుతుంది. పై బిరుదులను పతకాలను అది మెడలో వేసుకొని తిరిగినప్పటికీ దానికి ఆ అర్హత ఉండదు. అలాకాక, ఆ బిరుదులకు నిజంగా తాను హక్కుదారు కాదలిస్తే దానికి మార్గం కేవలం ఒక్కటే. అది తన కర్తవ్యపు బరువు బాధ్యతలను తిరిగి తన భుజస్కంధాలపై ఎత్తుకోవలసి ఉంటుంది. ప్రాపంచిక ప్రయోజనాల ప్రతి పని నుండి, హంగామా నుండి, శ్రద్ధాసక్తుల నుండి, వ్యక్తిగత ఇష్టాయిష్టాల నుండి పూర్తిగా ముఖం త్రిప్పుకోవలసి ఉంటుంది. మనసా వాచా కర్మణా ఏకోన్ముఖులై తన ఉనికికి కారణమైన ఏకైక లక్ష్యం - ధ్యేయాల సాధనకై అవిరళ కృషి చేయవలసి ఉంటుంది. దైవధర్మం కోరుతున్న ఈ కోరిక ముందు వినయంగా, సంపూర్ణంగా తలవంచడం తప్ప, ఈ దుస్థితి నుండి బయటపడే మార్గం మరొకటి లేదు.

## మిల్లత్ మోక్షానికి రాచబాట

ముస్లిం ఉమ్మత్ దైవిక సహాయంతో పాటు, ప్రాపంచిక గౌరవోన్నతులు పొందాలంటే, అది ఒక గ్రంథం చూపిన మార్గదర్శక విధానాలను అనుసరించక తప్పదు. పరాభవం, పరాధీనతల పాలై ఉన్న బనీ ఇస్రాయీల్ (యూదుల) వారి గురించి దైవగ్రంథం ఇలా సెలవిచ్చింది :

> **"ఈ గ్రంథ ప్రజలు (తలబిరుసుతనానికి బదులుగా) విశ్వసించివుంటే, అల్లాహ్ పట్ల భయభక్తుల వైఖరి అవలంబించి ఉంటే, మేము వారి పాపాలను వారి నుండి దూరం చేసివుండేవారము. వారిని భోగభాగ్యాలతో నిండివున్న స్వర్గవనాలలో ప్రవేశింపజేసి ఉండేవారము. వారు తౌరాతునూ, ఇంజీలునూ, వారి ప్రభువు తరఫు నుండి వారి వద్దకు పంపబడిన ఇతర గ్రంథాలనూ అనుష్ఠించి ఉన్నట్లైతే ఎంత బాగుండేది! ఆ విధంగా చేసివుంటే, వారి కొరకు ఆహారం పైనుండి వర్షించి ఉండేది. క్రింది నుండి పొంగివుండేది" (5:65-66).**

తను పోగొట్టుకున్న గౌరవోన్నతులు పొందటానికి పైన పేర్కొన్న ఉపాయం బనీ ఇస్రాయీల్‌కు సూచించబడింది. ఇదే సూచన ముస్లిం సమాజానికి కూడా వర్తిస్తుంది. దివ్య ఖుర్ఆన్ వెలుగులో ముస్లిం సమాజ స్థితిగతులను బేరీజువేయడం పెద్ద కష్టమేమీ కాదు. గ్రంథవహులకు పట్టిన జబ్బుకు, చికిత్సగా ఏమి చెప్పబడిందో – అదే జబ్బు పట్టిన ముస్లిం ఉమ్మత్‌కు కూడా అదే చికిత్స అవసరమౌతుంది. ఏ విమర్శలు గత గ్రంథవహుల సమాజంపై చేయబడ్డాయో, అవే విమర్శలకు నేటి ముస్లిం సమాజం కూడా లోనై ఉంది. దివ్య ఖుర్ఆన్ ఆదేశం ఒక విశ్వాసికి తిరుగులేనిదిగాను, దాని తీర్పు అంతిమ తీర్పుగానూ ఉంటుంది. కాని, గ్రంథవహులు దైవాదేశాలలోని మార్గదర్శకాల ఒక భాగాన్ని నిర్లక్ష్యపర్చారు. ఆ తర్వాత మరిచిపోయారు. ఫలితంగా దైవకారుణ్యం వారిపై అలక వహించింది. దైవాగ్రహం విరుచుకుపడింది. ఈ శిక్ష నుండి తప్పించుకోవడానికి, తమ్ము తాము తీర్చిదిద్దుకోవడానికి ఒక్కటే ప్రత్యామ్నాయంగా ఉండింది. ఖుర్ఆన్ భాషను అర్థం చేసుకోగలిగిన మస్తిష్కాలు – దాని యొక్క స్పష్టమైన, సరియైన, సూటియైన సమాధానాలను, వేలెత్తి చూపుతున్నట్లుగా అర్థం చేసుకోగలవు. జాగరూకత, గుణపాఠపు గ్రహణం కలిగిన చెవులకు "ఈ ఖుర్ఆన్ గ్రహీతలు విశ్వసించివుంటే – అల్లాహ్ పట్ల భయభక్తుల వైఖరి అవలంబించివుంటే మేము వారి పాపాలను వారి నుండి దూరం చేసి ఉండేవారము... స్వర్గవనాలలో ప్రవేశింపజేసి ఉండేవారము .... వారికొరకు ఆహారం వర్షించివుండేది. క్రింది నుండి పొంగివుండేది అనే వాగ్దానంలాంటి హెచ్చరిక స్పష్టంగా వినబడివుండేది.

"ఓ ఖుర్ఆన్ వారసులారా! మీరు ఖుర్ఆన్‌ను స్థాపించనంత వరకు మీరు ఏ ఆధారంపైననూ అస్సలు లేరు" అనే విషయం అర్థమయి ఉండేది.

'ఖుర్ఆన్ స్థాపన' యొక్క మరో నామమే 'ధర్మసంస్థాపన' అని అర్థమైన తర్వాత ఈ ధర్మసంస్థాపనా కృషి ఒక్కటే, ముస్లిం ఉమ్మత్‌కు దివ్య ఔషధంగా పనిచేస్తుందని తెలుసుకొని తీరాలి. సృష్టికర్త అల్లాహ్ ఈ ఉమ్మత్‌కు మొదటి రోజునుండే ఈ ఔషధాన్ని ప్రతిపాదించాడు. ధర్మసంస్థాపన ద్వారానే మీ పరలోకం ప్రయోజన కారిగా – ఇహలోకం ఇతోధిక ఉపయోగకారిగా మారగలదని స్పష్టపరచడం జరిగింది. ఎప్పుడైతే మీకు పరలోక ప్రయోజనం, ఇహలోక విజయం అవసర

మౌతుందో అప్పుడు మీరంతా ఈ మార్గాన్నే అవలంబించవలసి ఉంటుందని, మరో మార్గాంతరమే లేదని విస్పష్టంగా చెప్పబడింది. అలాకాని పక్షంలో, జీవనయాత్రలోని ప్రతి మలుపులో ఎదురు దెబ్బలు తప్పవని హెచ్చరించడమూ జరిగింది. ఖుర్‌ఆన్ ముస్లిం ఉమ్మత్‌ను ఎక్కడ నీవు దారి తప్పావో తిరిగి అదే స్థానానికి చేరమని సలహా ఇస్తుంది. దివ్య ఖుర్‌ఆన్‌లోని ఈ ఆదేశాన్ని హజ్రత్ ఇమాం మాలిక్ (రహ్మాలై) ముస్లిం సమాజపు తలరాతగా, భవిష్యవాణిగా చెపుతూ 'ఈ ముస్లిం ఉమ్మత్ తన ప్రారంభకాలంలో వలెనే తన చివరి కాలంలో కూడా ఈ వస్తువు ద్వారానే దిద్దుబాటును, సాఫల్యాన్ని పొందగలుగుతుంది" అని అన్నారు.

ఇమాం మాలిక్ (రహ్మా) గారి విశ్వాసపు దార్శనికత ఇది! ప్రతి విశ్వాసి యొక్క విశ్వాసం ఈ వాస్తవాన్నే అంగీకరిస్తుంది. 'ధార్మిక శ్రేయోవికాసం', 'ధర్మానుసరణ' అనే అవగాహనే తప్ప మరే విషయమూ ఆలోచనల్లోకి రావడానికి వీలులేదు. ధార్మిక సంస్కరణ అనేది ధర్మాన్ని స్వీకరించడం, ఆచరించడం ద్వారానే నెరవేరుతుందనేది ఒక బహిరంగ వాస్తవం. ప్రాపంచిక సఫలత కూడా సత్యధర్మ సాక్ష్యపు ధ్వజవాహకులైన ముస్లిం ఉమ్మత్‌లో మమేకం కావడం ద్వారానే సిద్ధిస్తుంది. ఎందుకంటే – అల్లాహ్ ద్వారా ముస్లిం సమాజానికి ప్రసాదించబడిన గౌరవోన్నతులు, అభివృద్ధి అంతాను, వారు సత్యధర్మసాక్షులు కావడం వల్ల లభించినవే ననేది ఇక్కడ గమనార్హం. ముస్లిం సమాజానికి లభ్యమైన ఈ ఉత్థానం ధర్మస్థాపనా కృషి ద్వారా లభ్యమయ్యే అనివార్యపు ఫలితమని తెలుసుకోవాలి. దైవగ్రంథం ఖుర్‌ఆన్ ముస్లిం ఉమ్మత్‌కు వినిపించిన భవిష్యవాణిలో "మీరే ప్రాబల్యం వహిస్తారు (అంతుముల్ ఆలౌన)" అని చెప్పిన చోటనే 'మీరు విశ్వాసులైతేనే సుమా' (ఇన్‌కున్‌తుమ్ ము'మినీన్) అనే షరతు కూడా విధించడం జరిగింది. ఈ వాగ్దానం కేవలం పరిమిత కాలానికి యివ్వబడింది కాదు. 'మీరు విశ్వాసులే అయితే' ఈ వాగ్దానం శాశ్వత రూపం ధరిస్తుంది. ప్రవక్త మహనీయుల (స) బోధన ప్రకారం ఈ ముస్లిం ఉమ్మత్‌లోని 'ధర్మసంస్థాపనా కృషికై' తనను తాను ప్రత్యేకించుకున్న వర్గానికి మాత్రమే నాయకత్వం, ప్రతినిధిత్వం లభించగలదని తెలుస్తుంది.

"నిస్సందేహంగా ఈ ఖిలాఫత్ (పాలనాపరమైన ప్రతినిధిత్వపు నాయకత్వ బాధ్యత) ఖురైష్ తెగవారు ధర్మసంస్థాపనా విధిని నిర్వహిస్తూవున్నంత కాలం వారివద్దనే

ఉంటుంది. ఈ సమయంలో ఎవరు వారితో శత్రుత్వం వహించినా అల్లాహ్ వారిని బోర్లాపడవేస్తాడు" (బుఖారీ గ్రంథం – మిష్కాత్ సౌజన్యంతో)

## సారాంశం

పై చర్చ ద్వారా అత్యంత ముఖ్యమైన కొన్ని విషయాలు మన ముందు సాక్షాత్కరిస్తున్నాయి. మొదటిది : ముస్లిం సమాజపు ఉనికి యొక్క లక్ష్యం–ధ్యేయం కేవలం అల్లాహ్ ధర్మాన్ని స్థాపించడంగా ఉండింది – నేడు కూడా ఉంది. రెండవది: ఈ తప్పనిసరి విధిని నిర్వర్తించే క్రమంలో అల్లాహ్ అదృశ్యవరాలు – సహాయాలు తప్పనిసరిగా లభ్యమై తీరుతాయి. ఈ అదృశ్యవరాలు – సహాయాల ద్వారానే ముస్లిం ఉమ్మత్‌కు అంతులేని గౌరవోన్నతులు, ఉత్థాన శిఖరాలు లభించాయి. మూడవది : ఈ ముస్లిం ఉమ్మత్ ఉత్థాన పతనాలు కేవలం భౌతిక కారణాలు, భౌతిక వనరులు, భౌతిక సూత్రాలు, ఆర్థిక వనరులపై మాత్రమే ఆధారపడి ఉండవు. పైగా అవి నైతిక సూత్రాలపై ఆధారపడి ఉంటుంది. మరోమాటలో ముస్లిం ఉమ్మత్ యొక్క ఉత్థానం, గౌరవం, కేవలం అది ఉనికిలోకి తేబడిన ఆ ఏకైక లక్ష్యపు నెరవేర్పుపై మాత్రమే ఆధారపడి ఉంటుంది. తన విధిని నిర్వర్తించని పక్షంలో ఈ ఉమ్మత్‌కు వాగ్దాన భంగపు అవమానంతో పాటు రెండింతల శిక్ష కూడా బహుమానంగా ప్రసాదించబడుతుంది. నాలుగవ అంశం : ముస్లిం సముదాయపు ప్రస్తుత దయనీయ స్థితి, అది అల్లాహ్ గ్రంథంలోని ఒక ప్రధాన భాగాన్ని వదిలివేయడం వల్లనూ – దాని నెరవేర్పు ఆచరణను నిర్లక్ష్యం చేయడం వల్లనూ దాపురించినదిగా తెలుస్తుంది. ఐదవది : ఖుర్‌ఆన్ తీర్పు ప్రకారం, ముస్లిం సముదాయపు సాఫల్యం, విముక్తికి సంబంధించిన 'ఒక్క మార్గం తప్ప' మిగిలిన అన్ని మార్గాలు మూసివేయబడి ఉంటాయి. ఆ ఒక్కటైన మార్గం – అది తనత జీవిత లక్ష్యం తెలుసుకోవాలి. ఆ లక్ష్యం–ధ్యేయాల సాధనకోసం తన ధన, ప్రాణాలను; శక్తియుక్తులను; ఇతర వనరులన్నింటినీ వెచ్చించాలి. అలాకాకుండా, వేరే మార్గాన్ని ఎంచుకుంటే, ఆ మార్గం ప్రస్తుతం తను ఉన్న హీన స్థితి నుండి మరింత అవమానకర స్థితి వైపుకు లాక్కుని వెళుతుంది. ఉన్న కనీస మానమర్యాదలు కూడా గుంజుకోబడతాయి. ఇతర మానవ సమాజాల మాదిరిగా ముస్లిం ఉమ్మత్ తన ధార్మిక పునాదులను వదిలివేసి ఎప్పటికీ మనుగడ సాగించజాలదు. అది అభివృద్ధి చెందినట్లు పైకి కనపడినా, అది ఇతరుల దయాదాక్షిణ్యాల ఫలితంగానే లభించి ఉంటుంది. ఇది మరింత పరాభవానికి ప్రతీక.



**నాల్గవ అధ్యాయం**

# బాధ్యతల నుండి పలాయనం

## పలాయనవాదపు ఒత్తిడి

పై సత్యాలను ముందుంచుకొని ఆలోచిస్తే, ఒక వ్యక్తి తనను సృష్టించిన సృష్టికర్త అల్లాహ్‌పై, ఆయన ప్రవక్త (స)పై విశ్వాసముంచిన వాడైతే, అతను తాను ముస్లింలా జీవించాలనీ, ముస్లింలా మరణించాలని భావిస్తూ ఉంటే, మరణానంతరం ప్రళయదినాన తాను ఆచరించిన జీవన విధానంపై ప్రశ్నింపబడతానని విశ్వసిస్తూ ఉంటే, ఉత్థాన పతనాలకు సంబంధించి దైవగ్రంథం ఖుర్‌ఆన్ యొక్క తాత్వికతను సంపూర్ణంగా విశ్వసించేవాడైతే, ఖుర్‌ఆన్ జ్ఞానం మానవ మేధస్సు యొక్క సృష్టికాదనీ - ఊహ, అంచనాలపై కాక - సత్యాల పునాదులపై మానవ సహజత్వానికి అనుగుణమైనదని నమ్మకం గలవాడైతే, దైవగ్రంథమే సత్యమనీ, సంపూర్ణ సత్యమని విశ్వసించేవాడైతే, ఆ వ్యక్తి ఆచరణ ఈ క్రింది విధంగా ఉండితీరాలి -

ఆ వ్యక్తి తన దృష్టిని అన్ని వైపుల నుండి మళ్లించుకొని ఒకే లక్ష్యంపై కేంద్రీకరించుకుంటాడు. తన చెవులను అన్ని శబ్ద కాలుష్యాల నుండి రక్షించుకొని కేవలం దైవ ఆదేశ గ్రహణం కోసం ప్రత్యేకించుకుంటాడు. స్వీయ మానసిక ధోరణిని కట్టిపెట్టి, తన కోరికల దాస్యం నుండి, షైతాన్ దుష్టభావాల నుండి తన మనోమస్తిష్కాలను శుభ్రపరచుకుంటాడు. పొంచి ఉన్న ప్రమాదాలన్నింటినీ లెక్క చేయకుండా సత్య ధర్మమార్గంపై తన పాదాలను దృఢతరం చేసుకుంటాడు. తన శరీరం - మేధస్సుల సర్వశక్తులను, ప్రతిభలను, ప్రత్యేకతలను ధర్మస్థాపనకై వెచ్చిస్తాడు. ఈ వ్యక్తి తన జ్ఞాన, అవగాహనల పునాదులపై పథక రచనలు చేసి సమయాను కూలంగా వాటిని అమలులోకి తేగలడు. పరిస్థితులు, పరిమితులు, పరిసరాలకు అనుగుణంగా ప్రత్యేక పద్ధతులను ప్రణాళికా బద్ధంగా అమలు చేయగలడు. సామాజిక వాతావరణం రీత్యా పాలసీ ప్రోగ్రాంను తయారుచేయగలడు. కాని, తన జీవిత లక్ష్యం-ధ్యేయాలను ఎట్టి పరిస్థితుల్లోనూ మార్చుకోడు. దాని అమలులో వాయిదా వేయనూ లేడు. ఈ నిర్ణయం ఈ వ్యక్తి అధీనంలో లేదని ఈ సందర్భంగా గుర్తించాలి.

ఖుర్‌ఆన్ మార్గాన్ని వదిలి, తన జీవిత లక్ష్యాన్ని నిర్లక్ష్యపరిచి, ఒక్క అడుగు వేయడానికి ప్రయత్నించినా, అది అల్లాహ్ పట్ల, అల్లాహ్ ప్రవక్త పట్ల ద్రోహంగా, జాతి ఆత్మహత్యా సదృశ్యంగా భావించవలసి ఉంటుంది. ఈ పరిస్థితి ఒక అంధుడు లోతైన అగాధం వైపునకు అడుగులు వేయటం వంటిదే. తన మార్గదర్శకుడు మాటిమాటికీ అతనిని అగాధపు మార్గం నుండి తప్పించడానికి ప్రయత్నిస్తూ, హెచ్చరిస్తూ ఉన్నప్పటికీ – ఆ అంధుడు ఆ మార్గదర్శకుని గొప్పతనాలను గీతాలాపన చేస్తూ కేవలం హెచ్చరించబడిన మార్గం మేటగా ఉండి నడక కష్టమైనందువల్లనూ – అగాధపు మార్గం పల్లంగా ఉండి నడక తేలిక అయినందువల్లనూ అగాధం వైపునకే నడుస్తూ ఉంటాడు.

దురదృష్టవశాత్తు ఒక సమూహంగా ముస్లిం ఉమ్మత్ ఈనాడు పైన ఉదాహరించిన కళ్ళులేని కబోది పాత్రనే పోషిస్తోంది. ఇస్లామేతర సమాజాల భౌతిక బలుపును (వాపును) చూచి అటువైపుకు ఉరకలు వేయడానికి సిద్ధపడి ఉంది. మనసును రంజింపచేస్తున్న ప్రతి మార్గాన్ని అనుసరించడానికి సిద్ధపడుతూ ఉంది. ఆ మార్గం తనను నేరుగా నరకాగ్ని గుండం వైపునకు నడిపిస్తున్నా తన పయనం అటు వైపునకే కొనసాగిస్తూ ఉంది. ఇస్లామీయ జీవన విధానం కష్టతరమైనదిగా, జీవిత లక్ష్యం–ధ్యేయాల మార్గాన్ని ముళ్ళబాటగా భావించడం వల్ల ఈ మానసిక దీనావస్థ ముస్లిం ఉమ్మత్‌కు దాపురించింది. దైవగ్రంథం ఈ ముస్లిం ఉమ్మత్‌ను, అన్ని మార్గాల నుండి వేరుపడి ఒకే ఒక ముక్కుసూటి మార్గంపై రమ్మని ఆహ్వానిస్తూ ఉండగా ... హెచ్చరిస్తూ ఉండగా ... ఈ ఉమ్మత్ ఆ ఆహ్వానాన్ని తిరస్కరిస్తూ, ఆ హెచ్చరికను వినీవిననట్లు నడుస్తూ పెడచెవిన పెడుతూ ఉంది. ఖుర్‌ఆన్ ఈ ఉమ్మత్‌ను ఉద్దేశించి, "నేనే నీ మార్గాన్ని–మార్గదర్శిని' 'మోక్షదాయిని–సాఫల్యకారిణి' అంటుంది. 'అవును నేను అంగీకరించానులే' అని ఉమ్మత్ బదులు చెబుతుంది. 'నేను నిన్ను మార్గభ్రష్టత్వానికి గురిచేయను – అసత్యమార్గం నుండి నిన్ను రక్షిస్తాను – అనుమానాలకు తావులేని పునాదులపై నిన్ను నిలబెడతాను' అని ఖుర్‌ఆన్ పలుకుతుంది. ఉమ్మత్ దానికి జవాబుగా 'లారైబ్' (అనుమానమే లేదు) అంటుంది. 'కేవలం నా వద్ద మాత్రమే సత్యజ్ఞానం ఉంది–నేను మాత్రమే అందరికీ రుజుమార్గం చూపగలను–నీకు, సమస్త మానవాళికి సాఫల్య రహస్యం, శిక్షణలు కేవలం నా వద్ద మాత్రమే లభ్యమౌతాయి' అని ఖుర్‌ఆన్ పలుకుతుంది. దానికి జవాబుగా ఉమ్మత్ 'నిస్సందేహంగా' అని బదులిస్తుంది. 'నేను తప్ప మిగతాది అంతా అసత్యమనీ–నాకు వ్యతిరేకంగా ఉన్నదంతా అజ్ఞానమనీ – నాతో సమరసం చెందనిదంతా

వినాశకరమనీ–ఖుర్ఆన్ హెచ్చరిస్తుంది. 'అవును! నిజమేకదా!' అని అది బదులిస్తుంది. అయితే, ఖుర్ఆన్ 'నీ కోసం, నావద్ద ధర్మసంస్థాపన కర్తవ్య వీలునామా ఉంద'ని చెప్పినప్పుడు ఒక్కసారిగా ఈ ఉమ్మత్ యొక్క నోరు మూగదయిపోతుంది. ప్రతి ప్రశ్నకు వెంటవెంటనే బదులు ఇస్తూ వచ్చిన ముస్లిం ఉమ్మత్ ఒక్కసారిగా మౌనం వహిస్తుంది. వెంటనే కోరికలు, కాంక్షలు ఒక్కటై ఒక్కసారిగా దుష్టత్వపు సైనిక పటాలాన్ని నిర్మించివేస్తుంది. అంతరాత్మ అంగీకరిస్తున్న 'ధర్మసంస్థాపనా కాంక్ష'ను తుంగలో తొక్కేస్తుంది. ఒక నేరస్తుడు ప్రజల ముందు నేరస్తునిగా నిలబడటానికి ఎలా అంగీకరించడో అదే స్థితి నేడు ముస్లిం ఉమ్మత్‌కు దాపురించింది. వ్యక్తిలోని అంతరాత్మ ధిక్కరిస్తూ ఉన్నప్పుడల్లా దానిని అణచివేసేందుకు మనిషి ప్రయత్నిస్తాడు. తాను ధర్మసంస్థాపనను ధిక్కరించిన నేరం ప్రజల ముందు కనబడకుండా ఉండటానికి అవసరమైన ఆచరణలు అన్నీ ఆచరిస్తాడు. ఈ ఆచరణలన్నింటినీ తాను చేస్తున్న నేరానికి ప్రాయశ్చిత్తాలని తలపోస్తాడు. ధిక్కరిస్తున్న అంతరాత్మ, బుద్ధి–వివేకాలను బుజ్జగించడానికి, ఆత్మ తృప్తి పొందడానికి, అనేక ధార్మిక ఆచరణలు కొనసాగిస్తూ వాటిని పుణ్యకార్యాలుగా రుజువు చేయడానికి నిరంతరం ప్రయత్నిస్తూ ఉంటాడు. ఈ క్రమం మరింతగా ముందుకు సాగి ధార్మిక ముసుగును అందంగా తన ముఖానికి తగిలించుకుంటాడు. ఒకసారి ఈ దుస్థితికి గురైన తరువాత, తన చుట్టూ ఉన్న ఇతరులను సైతం ఈ స్థితికే లోను చేయడానికి నిరంతరం ప్రయత్నిస్తాడు. తద్వారా తనను విమర్శించే గొంతులను, తన వైపుకు ప్రశ్నిస్తూ లేచే వ్రేలిని లేకుండా చేయడానికి తీవ్ర ప్రయత్నం చేస్తాడు. ధర్మసంస్థాపనా విధిపట్ల నేటి ముస్లిం ఉమ్మత్ ఈ వైఖరినే అవలంబిస్తూ ఉంది. తన విధి, కర్తవ్యాల నుండి తప్పించుకోవడానికి ఇటువంటి సాకులనే ఆమోదించివుంది. శతాబ్దాల స్తబ్ధత, నిర్లిప్తత, పతనాలు ముస్లిం ఉమ్మత్‌ను దాని ధ్యేయం–లక్ష్యాల నుండి సుదూరంగా విసిరివేశాయి. విధి నిర్వహణా చైతన్యాన్ని చిదిమి వేశాయి. ఉన్నత లక్ష్యాలతో గమ్యాలతో, ఉత్సాహంగా, ఉప్పొంగుతూ ఉండవలసిన రొమ్ములను కుంచింపజేసింది. ఫలితంగా ధర్మసంస్థాపనా విధికి అవసరమైన మానవ వనరుల వినియోగం, ధనప్రాణాల వెచ్చింపు, సుఖ సంతోషాల తర్పణలు, ఆశలు–అభిలాషల బలిదానాలు మృగ్యమైపోయాయి. జరిగిన నిర్లక్ష్యాన్ని, చేస్తున్న నేరాన్ని అంగీకరించి, పశ్చాత్తాప హృదయంతో మరలా ధర్మసంస్థాపనా

మైదానంలో నిలువవలసిన ముస్లిం ఉమ్మత్, తద్భిన్నంగా నేరాన్ని కప్పిపుచ్చుకునే దొంగదారులను వెతుకుతూ ఉంది. ఒక్కొక్క వ్యక్తి, ఒక్కొక్క సాకును వెతుక్కుంటూ, తన కర్తవ్యం-విధి నుండి తప్పించుకొనే ప్రయత్నం చేస్తున్నాడు. తన పలాయనవాద ప్రయత్నాలకు అవసరమైన, అనుగుణమైన 'తాత్విక పదజలాన్ని' కూడా సృష్టిస్తూ తన్నుతాను రక్షించుకునే ప్రయత్నం చేస్తున్నాడు. నేడు నూటికి 99 శాతం, ఇటువంటి వ్యక్తులతోనే ముస్లిం ఉమ్మత్ నిండివుందని చెప్పడం అతిశయోక్తి కాదు. ఈ మెజారిటీని చైతన్యపర్చకుండా, వారి నేటి ఆచరణను విమర్శించకుండా, ఇస్లామీయ ఉద్యం ముందడుగు వేయజాలదు. అధ్యయనం, సద్విమర్శ, మూల్యాంకనాల ద్వారా నేటి ముస్లిం ఉమ్మత్ యొక్క దుస్థితిని స్పష్టంగా ఉమ్మత్ ముందు ప్రదర్శించి చూపించవలసి ఉంది.

## తప్పించుకు తిరిగే 'తత్వం'

సాధారణ పరిశీలనలో పలాయనవాద ధోరణి ఐదు విధాలుగా ఉంటుంది. మొదటి విధానాన్ని అనుసరించేవారు, ఆచరణ మైదానంలో దిగిన తరువాత ఎట్టి పరిస్థితిలోనూ, తమ బాధ్యతల నుండి తప్పించుకోకూడదని భావిస్తారు. అందువల్ల అల్లాహ్ ఎవరికయితే సదాచరణ చేసే, భయభక్తులతో వ్యవహరించే, రుజువర్తన చెందే సద్బుద్ధిని వొసగాడో వారంతా నేటికీ ధర్మమార్గంలో తమ బాధ్యతలను సజావుగా నిర్వర్తిస్తున్నారు. ధర్మస్థాపనను కొనసాగిస్తూ ఉన్నారు. సత్యసాక్ష్యాన్ని ప్రకటిస్తూ ఉన్నారు. మంచి వైపుకు ప్రజలను ఆహ్వానిస్తూవున్నారు. ఖుర్ఆన్ మరియు ప్రవక్త సంప్రదాయాల విషయంలో సామూహిక ఆజ్ఞలు, వ్యవస్థీకృత కార్యాచరణలు, చట్టాలు తదితర అంశాలన్నీ ఇస్లామీయ ప్రభుత్వానికి సంబంధించిన అంశాలుగా విశ్వసిస్తున్నారు. అయితే ఒక ఇస్లామేతర ప్రభుత్వ వ్యవస్థలో ధర్మం మొత్తాన్ని స్థాపించడం ఎలా సాధ్యమని వీరు ప్రశ్నిస్తారు. ఇస్లామేతర న్యాయస్థానాల ద్వారా సమస్యలను పరిష్కరించుకోవడం, దైవేతర వ్యవస్థ (తాగూత్)ల చట్టాల ద్వారా తమ ప్రాపంచిక అవసరాలను నెరవేర్చుకోవడం, ధర్మ వ్యతిరేకమైన చర్యలుగా వీరు భావించరు. ఇస్లామీయ ధర్మ నియమం (షరీఅత్) ప్రకారం, అనివార్య పరిస్థితుల్లో నిషిద్ధ (నాజాయజ్) విషయం కూడా ఆమోదయోగ్యం (ముబాహ్) అవుతుందని వాదిస్తారు. ఈ కారణంగా ఖుర్ఆన్ యొక్క ఒక పెద్ద భాగాన్ని వీళ్లు వదిలివేశారు. 'ధర్మసంస్థాపనా విధిని మరిచిపోయారు' అనే విమర్శలు సరైనవి కావని వాదిస్తారు.

ఇక రెండవ వర్గం; నిస్సందేహంగా ముస్లిం ఉమ్మత్ ఉనికిలోకి తేబడినది ధర్మసంస్థాపనా కృషి కోసమేనని అంగీకరిస్తుంది. అయితే ప్రస్తుత పరిస్థితుల్లో ఈ జీవిత లక్ష్యం-ధ్యేయం నెరవేరే పరిస్థితులు దూరదూరాల వరకు కానరావడం లేదు. కనుక, నేటి పరిస్థితిలో ధర్మసంస్థాపన కోసం కృషిచేయడం, తమ శక్తి సామర్థ్యాలను వ్యర్థపరచుకోవడం తప్ప మరేమి కాదని అది చెపుతుంది. ధర్మసంస్థాపనా కృషిగాని, దాని ప్రచారం గాని నేటి పరిస్థితుల్లో లాభదాయకం కాకపోగా - ముస్లిం ఉమ్మత్‌కు అది నష్టకరంగా పరిణమిస్తుందని వీళ్లు వాదిస్తారు. కనుక, ఈ ప్రచారాన్ని ఆపివేయడంలోనే విజ్ఞత, వివేచన ఇమిడివుందని సూత్రీకరిస్తారు. ధర్మ సేవలో - ధర్మప్రచారంలో, కొన్ని ప్రత్యేక కార్యాచరణలను కొనసాగిస్తూ, తద్వారా సామాజిక వాతావరణంలో మార్పు తేవడానికి ప్రయత్నించాలనీ - పరిస్థితులు అనుకూలంగా మారిన తరువాత తమ జీవిత లక్ష్యం అయిన 'ధర్మసంస్థాపన' కోసం అవిరళకృషి చేయాలని చెబుతారు.

మూడవ వర్గం : నిస్సందేహంగా 'ధర్మసంస్థాపనం' అనబడే జీవిత లక్ష్యం అత్యంత సత్యమైనదని, అందులో సంశయానికి తావేలేదని అంగీకరిస్తుంది. అయితే ఈ కార్యాచరణకు ఒక 'సిద్దీఖె అక్బర్' (అబూబక్ర్ -రజి), ఒక 'ఫారూఖ్' (ఉమర్-రజి) అవసరమని చెబుతుంది. మనం ఎప్పటికీ వారిలాగా ఉండలేము. కనుక ఈ కృషి మన శక్తికి మించినది. ప్రవక్త(శ్రీ (స) వారి స్వీయ శిక్షణ ద్వారా ఉనికిలోకి వచ్చిన ఆ 'దృఢ విశ్వాసుల బృందం' సైతం కేవలం 30 సంవత్సరాల కాలం మాత్రమే ఈ వ్యవస్థను కొనసాగించగలిగింది. మనలాంటి బలహీన విశ్వాసులు ఈ రంగంలో అడుగుపెట్టడం విధితో పోరాడటం లాంటిదే. 1400 సంవత్సరాల క్రితం ఉన్న కాలం ఇప్పుడు మరలా పునరావృతం కావడం సాధ్యం కాదని సిద్ధాంతీకరిస్తుంది.

ఇక నాలుగవ వర్గం : తన కోసం ఒకమార్గం తెరవబడాలని, ఆ మార్గంలో పయనిస్తూ ఉన్నవారు, నేడు కూడా కొనసాగుతూ ఉంటే, అందులో తాను కూడా కలిసి నడవాలని ఎదురు చూస్తూ ఉంటుంది. ఈ వర్గంలోని వ్యక్తులు మార్గాన్ని ఏర్పర్చుకునే అవిరళ కృషిలో ఎంతమాత్రమూ భాగస్వాములు కావాలని కోరుకోరు. అంతేకాక, పని ప్రారంభించబడిన తరువాత కూడా, ఆ మార్గం వైపు అనుమానంగా చూస్తూ ఈ పని కొనసాగుతుందా? లేక మొదటి పాదంలోనే ఆగిపోతుందా? అనే

మీమాంసలో ఉంటారు. అంటే, వీరి దృష్టిలో మొదట ఈ మార్గంలో ప్రయాణించేవారు రావాలి. ఆ తర్వాత వారు, తమ కృషి-శ్రమల ద్వారా మార్గాన్ని సుగమం చేయాలి. ఆ తర్వాత, ఈ మార్గంలో ప్రయాణించేవారి బృందం వీరికి కనబడాలి. అప్పుడు వీరు ఈ మార్గంలో, ఈ బృందంలో కలిసి చివరి వరుసలో నడవడానికి ఉద్యుక్తులు అవుతారు. అప్పటివరకు వీరు ఈ మార్గంలో అడుగుపెట్టడానికి మానసికంగా సిద్ధపడరు.

ఇక చివరిదైన ఐదవ వర్గం : ఇమామ్ మెహదీ రాక కోసం వారు ఎదురు చూస్తూ కూర్చుని ఉన్నారు. జీవిత లక్ష్యం, ధ్యేయాల పట్ల, ధర్మసంస్థాపనం పట్ల వీరికి ఏమాత్రం వ్యతిరేకత ఉండదు. అయితే, 'ఈ పనికోసం అల్లాహ్ ఇమామ్ మెహదీని పంపించే వాగ్దానం చేసివున్నాడు. ఆయన నాయకత్వంలోనే ఈ ఉద్యమం కొనసాగించబడాలి. ఆయన రాకకు ముందుగా ముస్లిం ఉమ్మత్ ఈ కృషిలో నిమగ్నమవడం సరికాదు. అనవసరంగా బాధలను, ఇబ్బందులను, కష్టనష్టాలను కొనితెచ్చుకోవలసిన అవసరం లేదు' అని వీరు ప్రగాఢంగా విశ్వసిస్తారు.

ముస్లిం ఉమ్మత్‌లో ధార్మిక బృందాలుగా పరిగణించబడుతున్నవారు పైన వివరించిన ఐదు ఆలోచనా విధానాలలో ఏదో ఒకటి కలిగివున్నారు. ఇక సాధారణ ముస్లింలు ధర్మ నియమాల బాధ్యతల బరువును తమ భుజస్కంధాలపై నుండి ఎప్పుడో తీసిపారవేశారు. వారి దైనందిన జీవితంలో ఖుర్‌ఆన్, సున్నత్‌ల ప్రస్తావన అస్సలు కానరాదు. అలాంటి వారి గురించి చర్చించడం కూడా అనవసర కాలయాపనే అవుతుంది. వారిని ఈ చర్చలో భాగస్వాములుగా చేయడం అవివేకమే. స్వయంగా వారు సైతం తమకు ఈ అర్హత లేదని భావిస్తున్నారు. పైన పేర్కొన్న దృక్పథాలు గల వారి ఆలోచనలను మరింత నిశితంగా, లోతుగా పరిశీలించి, నిజానికి వారి వాదనలు, విశ్వాసాలు, నమ్మకాలు, సూత్రీకరణలు, సిద్ధాంతాలలో ఎంతటి వాస్తవికత ఉంది? అందులో సత్యత శాతం ఎంత? అనేది తేల్చవలసి ఉంది.

## పాక్షిక ధర్మాచరణలతో సంతృప్తి

ఖుర్‌ఆన్ మరియు సున్నత్‌లలో కేవలం నమాజ్, రోజా, జకాత్, హజ్‌లు మాత్రమే విధి (ఫర్జ్) చేయబడ్డాయని వాదించడానికి ఎవరూ సాహసించలేరు. ఒక విశ్వాసి కేవలం ఈ విధుల వరకే పరిమితం కావాలని చెప్పడానికి కూడా ఎవరూ

ధైర్యం చేయలేరు. అదేవిధంగా, ఆరాధనలు, నైతిక విషయాలు మినహా మిగిలిన ఆదేశాలన్నీ దైవం క్షమించుగాక, కేవలం గ్రంథాన్ని భర్తీచేయడానికి మాత్రమే అవతరించాయని చెప్పే గుండె ధైర్యం కూడా ఎవరికీ లేదు. దీనికి భిన్నంగా ఖుర్‌ఆన్ మరియు సున్నత్‌లలో చెప్పబడిన ప్రతి ఒక్క ఆదేశం – దైవదాస్యానికి సంబంధించిన సంపూర్ణ విధానమనేదీ, జీవితానికి సంబంధించిన ఒక సంపూర్ణ వ్యవస్థ అనేదీ ఒక కఠోర వాస్తవం. ఈ ఆదేశాలలోని ప్రతి ఒక్క అంశం కూడా ఆమోదించి, అనుసరించడానికే ఉన్నాయి. ఖుర్‌ఆన్ అవగాహనలో, జ్ఞాన సముపార్జనలో హెచ్చుతగ్గులు ఉండవచ్చు – పుణ్యఫలాలలో హెచ్చుతగ్గులు ఉండవచ్చు. కాని, దాని అమలు, ఆచరణలలో మార్పులు, చేర్పులు చేయడానికి ఎవరికీ అధికారం లేదు సరిగదా, ఆ అవసరమూ లేదు. యజమాని యొక్క ప్రతి చిన్న పెద్ద ఆజ్ఞను పాలించడమే ఒక దాసుని ప్రథమ కర్తవ్యం అయి ఉంటుంది. ఈ ఆజ్ఞలలో ఏది అవసరం, మరేది అనవసరం అని బేరీజు వేయడం, కొన్నింటిని ఆమోదించి అనుసరించడం, మరికొన్నింటిని నిర్లక్ష్యపర్చడం లాంటి చేష్టలు ఒక దాసునికి సుతరామూ తగవు. యజమాని ఆదేశం తిరుగులేనిది. ఎట్టి స్థితిలోనూ, దాన్ని శిరసావహించవలసిందే. ముస్లింలు, తమ ప్రభువు, యజమాని, పాలకుడు, పోషకుడు, సృష్టికర్త అయిన అల్లాహ్ యొక్క 'ప్రతినిత్యపు దాస్యం' చేస్తామని ప్రతిజ్ఞ పూనినవారు. ఉదాహరణకు వారికి తమ ప్రభువు నుండి ఈ క్రింద పేర్కొనబడిన రెండు ఆజ్ఞలు వచ్చాయనుకుందాం!

ఒకటి : 'మీరందరూ నమాజ్ ఆచరించండి' ఇక రెండవది 'దొంగతనం చేసినవాని చేతులు ఖండించివేయండి'. ఈ నేపథ్యంలో ఒక దాసుడు పై రెండు ఆజ్ఞలకు ఒకే విధమైన ప్రాధాన్యత ఇచ్చి, ఈ రెండు ఆజ్ఞలపై తు.చ. తప్పక అమలుచేయవలసి ఉంటుంది. అలాకాక, కేవలం మొదటి ఆజ్ఞను అమలుపరచి, రెండవ ఆజ్ఞను ధిక్కరిస్తే అది సంపూర్ణ దాస్యం అనిపించుకోదు. అల్లాహ్ పట్ల, ఖుర్‌ఆన్ పట్ల అది పాక్షిక దాస్యంగానే భావించవలసి ఉంటుంది. ఈ విధమైన పదుల సంఖ్యలోని అల్లాహ్ ఆదేశాలపట్ల ఈ దుర్మార్గపూరిత వైఖరినే మనం ప్రదర్శిస్తూ – సంతోషంగా, సంతృప్తిగా జీవిస్తూ సంపూర్ణ ధర్మానుసరణను గాలికి వదిలివేసి హాయిగా జీవిస్తూ ఉన్నాం.

## రాజ్యాధికారం (పాలనాధికారం) పట్ల నిర్లక్ష్యం

ఖుర్ఆన్ ఆదేశపాలన స్థాపనలు సాధారణ ప్రజలపై విధికాదు ... అది కేవలం నాయకత్వానికి మాత్రమే విధి అయిన ఆదేశం అనే సంజాయిషీ సరైనది కాదు. నేడు ఇస్లామీయ పాలనే లేదు గనక ఈ ఆదేశపాలన, స్థాపనల ప్రశ్నే తలెత్తదు. ప్రస్తుత పరిస్థితుల్లో ఈ ఆదేశాలు రద్దు అవుతాయి అని వాదించడం, సంజాయిషీ ఇచ్చుకోవడం బహిరంగ పాపకార్యంగా భావించాలి. ఎందుకంటే, ఖుర్ఆన్‌లో "ఓ ముస్లిం సమాజ నాయకుల్లారా! మీరు దొంగవాని చేతులు ఖండించండి" అనిగాని, "ఓ ఇస్లామీయ పాలనాధికారుల్లారా! మీరు వ్యభిచారులకు కొరడా దెబ్బలు కొట్టండి!' అనిగాని ఎక్కడా చెప్పబడలేదు. ఇటువంటి ఆదేశాలు, వాటి స్థాపనలు అన్నీ మొత్తం ఉమ్మత్‌ను ఉద్దేశించి ఇవ్వబడ్డాయనేది గమనార్హం. ఉదాహరణకు ఈ చిన్న వాక్యంలోని ఆదేశాన్ని గమనించండి : "దొంగ – స్త్రీ అయినా, పురుషుడు అయినా ఉభయుల చేతులూ నరకండి." పై వాక్యంలో ఎవరిని ఉద్దేశించి చెప్పబడిందో లేకపోయినా, ప్రాథమికంగా ఆలోచిస్తే ఈ ఆదేశం సమస్త విశ్వాసులను సంబోధిస్తూ ఇవ్వబడిందనేది నిర్వివాదాంశం. ఖుర్ఆన్‌లో ఇవ్వబడిన ఆదేశాలు ప్రత్యేకంగా ఎవ్వరినీ సంబోధించకపోతే అవి విశ్వాసులను ఉద్దేశించి చెప్పినట్లుగానే భావించాలి. పైన పేర్కొన్న వాక్యానికి మూడు వాక్యాల ముందు "యా అయ్యుహల్లజీన ఆమనూ" (ఓ విశ్వాసులారా!) అని స్పష్టంగా సంబోధించడం జరిగింది. అంటే సమస్త విశ్వాసుల సంఘాన్ని సంబోధిస్తూ ఈ ఆదేశం ఇవ్వబడిందని స్పష్టమవుతోంది. ఈ సంబోధన ప్రత్యేకించి ఒక వ్యక్తికో లేక ముస్లింలలోని ఒక ప్రత్యేక వర్గానికో చెందినట్లుగా లేదు. ప్రఖ్యాత ఇస్లామీయ పండితుడు 'అల్లామా ఇబ్నె జరీర్ తబ్రి (రహ్మ)' ఈ వాక్యానికి వ్యాఖ్యానం రాస్తూ "పరమ ప్రభువు అయిన అల్లాహ్ ఇలా ఆదేశిస్తున్నాడు: ఓ జనులారా! పురుషుడుగాని, స్త్రీగాని దొంగతనం చేస్తే వారి చేతులు నరకండి. ఓ ముస్లిముల్లారా! దొంగలపై, ఇతర నేరస్తులపై ఈ ప్రపంచంలో ఏ శిక్షలనైతే నేను ఆదేశించానో (విధించానో, వాటిని అమలుపర్చండి. నా ఆజ్ఞాపాలనలో కొంచెమైనా కొరత చూపించకండి." (తఫ్సీర్ ఇబ్నె జరీర్ - భాగం పేజి 133) అని అన్నారు. అల్లామా జరీర్ (రహ్మ) తన వివరణలో "ఫఖ్తఊ" అనే పదాన్ని, "యా హయ్యున్నాస్!" (ఓ ప్రజలారా!) కు వర్తింపజేశారు. మరోచోట ఇదే పదాన్ని 'యా అయ్యుహల్

మోమినీన్' (విశ్వాసుల వర్గం) అని వివరించారు. మొత్తంగా గ్రంథంలోని ఆదేశాలు, ఆజ్ఞలు అన్నీ కూడా ఈ విధంగానే సంబోధించబడి ఉన్నాయి. ప్రాథమికంగా గ్రంథ సంబోధన (అహ్లె ఈమాన్) విశ్వాసుల సమూహంను ఉద్దేశించే ఉంటుంది. మరోమాటలో ఈ ఆదేశాల పాలన - స్థాపన యొక్క అసలు బాధ్యతను ఇస్లామీయ ఉమ్మత్ మొత్తంగా నెరవేర్చవలసి ఉంటుంది. కనుక ఇది కేవలం విశ్వాసుల నాయకత్వపు బాధ్యత అని సంజాయిషీ ఇచ్చుకుని ఆత్మను సంతృప్తిపరచుకోవడం సరికాదు. ఇది ఆమోదించదగిన సంజాయిషీ కూడా కాదు.

అయితే ఇక్కడ గమనార్హమైన మరో విషయం ఏమిటంటే, సంబోధన మొత్తం ముస్లిం సమాజానికి అయినప్పటికీ, దానిని అమలుపర్చే వ్యవస్థకు బాధ్యులు దాని నాయకులే అనేది కాదనలేని సత్యం. ఎవరికి వారు ఆజ్ఞాపాలన కొనసాగిస్తే నిర్మాణపరమైన, వ్యవస్థాగతమైన అనేక చిక్కులు ఎదురవుతాయి. కనుక ఆజ్ఞల అమలు, ఆదేశపాలనలు అన్ని వ్యవస్థీకృతంగానే జరుగుతాయి. అయితే ఆ వ్యవస్థను స్థాపించుకోవలసిన బాధ్యత సమస్త విశ్వాసుల సమాజానిదై ఉంటుంది. సామూహిక వ్యవస్థకు అత్యంత ప్రాముఖ్యతనిచ్చే ఇస్లాంలో అరాచకత్వానికి చోటు ఏమాత్రమూ ఉండదు.

పై చర్చ ద్వారా రెండు విషయాలు తనకు తానుగా స్పష్టమైనట్లు మనం తెలుసుకున్నాం. మొదటిది : సామూహిక ఆదేశాలు మొత్తం ముస్లిం ఉమ్మత్‌ను ఉద్దేశించి ఉన్నాయి. రెండవది : వాటిని అమలుపరిచే బాధ్యత నాయకులపై ఉంటుంది. అంటే ముస్లిం ఉమ్మత్ యొక్క నాయకత్వం యావత్తు ఉమ్మత్ తరఫున ఈ ఆజ్ఞలను జారీచేస్తుంది. అంతేగాని కేవలం తమ వ్యక్తిగత బాధ్యతలను నెరవేర్చదు. ఒకవేళ ఈ సామూహిక నాయకత్వం ఏ కారణాలవల్లనైనా ఉనికిలో లేకపోతే, ఉన్నా కర్తవ్యాన్ని నిర్వర్తించే శక్తి-సామర్థ్యం లేకపోతే, ఈ ఆజ్ఞాపాలనకు, ఆదేశ స్థాపనకు మొత్తం ఉమ్మత్ బాధ్యత వహించవలసి ఉంటుంది. వారు తమలో నుండి ఒక సామూహిక నాయకత్వాన్ని నియమించుకోవలసి ఉంటుంది. ఒకవేళ నాయకత్వం ఉండీ, తమ కర్తవ్యాన్ని నిర్వర్తించకపోతే, వారిపై ఒత్తిడి తేవలసి ఉంటుంది. లేదా, వారిని మార్చి వేరే వారికి ఆ బాధ్యతలు అప్పగించడం తప్పనిసరి అవుతుంది. ఈ బాధ్యత 'ఫర్జె కిఫాయా'ను పోలి ఉంటుంది. ఉమ్మత్ యొక్క నాయకత్వం ఈ విధిని,

బాధ్యతను నిర్వర్తిస్తే ఉమ్మత్ మొత్తంగా విధిని నెరవేర్చినట్లుగా భావించబడుతుంది. అలాకాక, నాయకత్వం ఈ బాధ్యతను నెరవేర్చలేకపోతే, మొత్తం ఉమ్మత్ నేరస్తులుగా పరిగణించబడుతుంది. దాని తాలూకు అభిశాపానికి గురి అవుతుంది కూడాను.

ఈ సందర్భంగా, "మన వద్ద పాలనాధికారం - రాజ్యాధికారం లేదు కదా! ఈ అధికారం లేకుండా, ధర్మసంస్థాపన - ఆజ్ఞాపాలనపై సంపూర్ణ అమలు ఎలా సాధ్యమవుతుంది?" అనే ప్రశ్న తప్పనిసరిగా తలెత్తుతుంది. ఈ ప్రశ్న గంభీరమైనదే. ఇందులో భిన్నాభిప్రాయానికి తావు లేదు కూడాను. ముస్లిం ఉమ్మత్ యొక్క సామూహిక నాయకత్వం, తన వద్ద అధికార దండం లేకుండా రాజ్యాంగ నిర్వహణాధికారం లేకుండా, దైవాజ్ఞాపాలన - స్థాపనలు చేయడం సాధ్యం కాదు. రాజ్యాధికారం లేకుండా ఈ ఆజ్ఞల అమలు అస్సలు వీలుపడదు. అంటే ఖుర్ఆన్ యొక్క ఒక పెద్ద భాగాన్ని అమలుపర్చడానికి రాజకీయ అధికారం తప్పనిసరి అవుతుంది. అయితే, రాజకీయ అధికారం లేనంత మాత్రాన మన మీద ఉన్న బాధ్యతల బరువు తగ్గినట్లు అర్థం చేసుకోవచ్చా? లేక మరింత తీవ్రమైన కృషిని చేయవలసిన అవసరాన్ని మనం గుర్తించాలా? లేక ప్రశాంతమైన నిట్టూర్పు విడిచి, ఖుర్ఆన్‌లోని ఒక పెద్ద భాగాన్ని అమలుచేయడం నుండి విముక్తి లభించిందని సంతృప్తిపడాలా? లేక ఆ రాజ్యాధికార సముపార్జనకోసం నిరవధికంగా కృషిచేయాలా? దైవదాస్యంలో ఒక పెద్ద కొరతను, ఆదేశ పాలనలో ఉన్న పరిమితులను నిరంతరంగా ఆమోదిస్తూ - అంగీకరిస్తూ ఉన్నందువల్ల క్రమంగా దైవగ్రంథం పట్ల నిర్లిప్తత ఏర్పడింది. ఫలితంగా ఉమ్మతె ముస్లిమా అజ్ఞానపు గాఢాంధకారంలోనికి నెట్టివేయబడింది. అంతరంగాన్ని కాస్త ఆత్మన్యూనతా భావం నుండి, స్వార్థపరత్వం నుండి వేరుచేసి ఆలోచించండి! తమ చెవులను హృదయ స్పందనల వైపుకు మళ్ళించండి. పై ప్రశ్నలకు అది ఇస్తున్న సమాధానాలను నిజాయితీతో వినండి. నిస్సందేహంగా ఏ హృదయంలో విశ్వాసపు కనీస స్థాయి కదలిక ఉంటుందో - ఆ హృదయం మిమ్మల్ని ప్రశాంతంగా, సంతృప్తిగా, సంతుష్టులుగా ఉండటానికి అనుమతినివ్వదు. దైవధర్మాన్ని స్థాపించడానికి పరిస్థితులు, అధికారాలు లేనపుడు, ఉమ్మత్‌పై రెండు విధాలైన విధులు తప్పనిసరి అవుతాయి. మొదటిది : పరిస్థితులను అనుకూలంగా మలుచుకోవటం కోసం, అనుకూల వాతావరణ ఏర్పాటుకోసం తీవ్రంగా కృషి చేయడం. రెండవది : ఆ పరిస్థితులు

కల్పించబడినపుడు, అనుకూల వాతావరణం ఏర్పడినపుడు ధర్మసంస్థాపన చేయడం. ఒక విషయాన్ని సాధించడం 'తప్పనిసరి' అయినపుడు దాని సాధనకై అవసరమైన పరిస్థితుల కల్పన కూడా తనంతట తానుగా విధి అయిపోతుంది. ఉదాహరణకు నమాజ్ ఆచరించే విధి నెరవేర్చేటప్పుడు, శరీర శుభ్రత, స్థల శుభ్రత ఏర్పర్చుకోవడం తప్పనిసరి. ఈ పరిస్థితులు లేవు కాబట్టి నేను నమాజ్ ఆచరించను అని ఎవరైనా వాదిస్తే, అతనిని మీరు తప్పకుండా 'మోసగాడు' అని అంటారు. అసలతని మనసులో నమాజు పట్ల ఏమాత్రం ఆసక్తి లేదని, ఉంటే అలాంటి కుంటిసాకులు వెతకడని, ప్రపంచ కార్యకలాపాలన్నింటినీ వదిలేసి నమాజు స్థలాన్ని పరిశుభ్రపరచటంలో నిమగ్నుడయ్యేవాడని కూడా అంటారు. మరి నేడు ఖుర్ఆన్ ఆదేశాల సంపూర్ణ అమలుకు పరిస్థితులు సానుకూలంగా లేవని చెప్తూ నిర్లిప్తంగా ఉండటం ఒక ముస్లింకు సమంజసమేనా? ఈ రకమయిన కుంటిసాకులు చెప్పడానికి అతని విశ్వాసం కొంచెం కూడా సిగ్గుపడటం లేదు. అతని భయభక్తులు, తఖ్వా అడ్డం చెప్పడం లేదు. సంజాయిషీలోని డొల్లతనం హెచ్చరించడమూ లేదు. ఫలితంగా ఆలోచనల్లో మాంద్యం ఏర్పడింది. తన సర్వశక్తులు ఒడ్డి ధర్మసంస్థాపనా విధిని పరిపూర్తి చేయడానికి ఉద్యుక్తుడు కావడం వదిలివేసే తన బలహీనతలకు సంజాయిషీ ఇచ్చుకొనే స్థాయికి దిగజారిపోయాడు.

నిస్సందేహంగా ధర్మసంస్థాపనా విధి చాలా కఠినమైనదే. ఈ విధి నెరవేరడానికి ఉమ్మతె ముస్లిమా తన సర్వశక్తులను ధారబోయక తప్పదు. ఈ పని చేయనంత వరకు విశ్వాసి యొక్క శారీరక శక్తి, మేధాశక్తి, ధనశక్తి, చివరకు అతని ప్రాణం అయినాసరే దేనికి? నిజానికి పైన పేర్కొన్న శక్తులు అన్నీ కూడా తన స్వంతం కావనే విషయాన్ని ఒక విశ్వాసి గ్రహించాలి. ఏ క్షణాన ఒక విశ్వాసి తన నిజప్రభువుపై విశ్వాసం ప్రకటించాడో - అదే క్షణం ఈ శక్తులన్నిటినీ అల్లాహ్ అభీష్టం కొరకు అమ్మివేశాడని గ్రహించాలి.

**"యదార్థం ఏమిటంటే, విశ్వాసుల నుండి అల్లాహ్ వారి ప్రాణాలను, వారి సంపదలనూ స్వర్గానికి బదులుగా కొన్నాడు." (9:111)**

ఈ క్రయవిక్రయాలు జరిగి పోయిన తర్వాత ఒక విశ్వాసి యొక్క సర్వశక్తులు ఇక ఎంతమాత్రం అతని స్వయం కావు. అవి కేవలం అల్లాహ్ వద్ద నుండి అతని

వద్ద 'అమానతు'గా ఉంచబడినవి మాత్రమే. 'అమానతు' అంటే, ఎప్పుడైతే ఆ వస్తువుల యజమాని తన వస్తువులను కోరుతాడో, నోరు మెదపకుండా ఆయన అమానతులను ఆయనకు అప్పగించవలసి ఉంటుంది. ఈ కారణంగా ఒక విశ్వాసి, తాను విశ్వాసి అయినంత మాత్రాన్నే, అల్లాహ్ తన వద్ద అమానతుగా ఇచ్చివున్న శక్తులను, ప్రతిభలను, ఆయన కోరిన సమయంలో - కోరిన విధంగా ఆయనకు అందజేయవలసి ఉంటుంది. ఈ అప్పగింతలను ఒక విశ్వాసి వద్ద ఎందుకు ఉంచబడ్డాయో దైవగ్రంథం మాత్రమే విశదపర్చగలుగుతుంది.

**"అల్లాహ్ మార్గంలో మీ సంపదలను, మీ ప్రాణాలను ఒడ్డి పోరాడండి."**
**(9:41)** అని దివ్య గ్రంథం ఆజ్ఞాపిస్తుంది.

విషయం సుస్పష్టమే. ఒక విశ్వాసి సంపద, ప్రాణం, ప్రతిభలు అన్నీ ఖర్చుచేయవలసిన మార్గం కేవలం అల్లాహ్ మార్గమే. మరో మాటలో ఆ మార్గం ధర్మసంస్థాపనా మార్గమేననేది సుస్పష్టం. ఈ కారణంగా తన దాస్యపు విధిని నెరవేర్చడానికి ఒక దాసుడు తప్పనిసరిగా, తన వద్ద ఉన్న శక్తియుక్తులను ధారబోయవలసి ఉంటుంది. అలాకాక, దైవంచే ఒకసారి కొనుక్కోబడి, అమానతుగా ఒక విశ్వాసి వద్ద ఉంచబడిన ఈ శక్తియుక్తులు ఆయన అభీష్టం మేరకు ఖర్చుచేయడానికి నిరాకరిస్తే అది తీవ్రమైన నేరంగా, ద్రోహంగా, నీచాతినీచమైన చర్యగా భావించబడుతుంది. ఇది ఆ విశ్వాసి తనపై తానుగా చేసుకొనే దౌర్జన్యం కూడా అవుతుంది. అల్లాహ్ యొక్క ఈ అమానతులను, అల్లాహ్ ఆజ్ఞల ప్రకారం ఖర్చు చేయకుండా, దానికి వ్యతిరేకంగా ఈ శక్తులను తన మనోభీష్టాల నెరవేర్పుకోసం, తన కోరికల గుర్రాల సేవకోసం, భౌతిక లాలసలు జుర్రుకోవడం కోసం ఒక విశ్వాసి నేడు వినియోగిస్తున్నాడు. ఈ ఆచరణపై చాలా సంతృప్తిని, సంతోషాన్ని ప్రకటిస్తూ, కుంటిసాకులతో జీవితం హాయిగా గడిపే ప్రయత్నం చేస్తున్నారు.

## గత్యంతరం లేని స్థితి గురించి ...

ఒక ముస్లిమేతర పరిపాలన ఉన్న ప్రాంతంలో ధర్మసంస్థాపన సాధ్యమెలా అవుతుందీ? అనే కుంటిసాకు ఒకటి ఉండగా, గత్యంతరం లేని పరిస్థితుల్లో నిషిద్ధమైనది (హరామ్) కూడా ధర్మసమ్మతం అయిపోతుంది కదా! అనేది రెండవసాకుగా చూడబడుతుంది. ఆలోచించి చూస్తే ఈ సంజాయిషీ కూడా మొదటి సంజాయిషీలాగానే

పస లేనిదిగా, నిర్హేతుకమైనదిగా కనబడుతుంది. ఇస్లాం పట్ల మొత్తం ఉమ్మత్‌లో ఉన్న తప్పుడు అభిప్రాయం వల్ల ఇటువంటి సాకులు చెప్పబడుతున్నాయి. ధర్మశాస్త్రం (షరీఅత్)తో సంబంధం బలహీనపడిన కారణంగా ఈ సంజాయిషీ ఇవ్వబడుతుంది. దీనికై ఈ క్రింది వాక్యాన్ని ఆశ్రయించడం జరుగుతుంది.

**"కాని ఎవరైనా గత్యంతరం లేక వాటిలోని (హరాం పదార్థాలలోని) ఏ పదార్థాన్ని అయినా తింటే అది పాపం కాదు. అయితే నిషేధాజ్ఞను ఉల్లంఘించే ఉద్దేశ్యం ఉండకూడదు. ఇంకా అవసరానికి మించి తినకూడదు. అల్లాహ్ క్షమించేవాడూ, కరుణించేవాడూను." (2:173)**

నిస్సందేహంగా పై దైవవాక్యం ఒక నిషిద్ధ వస్తువును గత్యంతరం పరిస్థితుల్లో ధర్మబద్ధం చేసుకొనే అనుమతి ఇస్తుంది. అయితే, ఈ అనుమతి కొన్ని షరతులకు లోబడి ఇవ్వబడిందనేది గమనార్హం. కనీసం మూడు షరతులు విధించబడి, ఆ ఒక్కొక్క షరతు పరిపూర్తి తర్వాతనే అనుమతి లభిస్తుంది. మొదటిది : పరిస్థితి అత్యంత దయనీయంగా, గత్యంతరం లేనిదిగా ఉండాలి. ధర్మబద్ధతపై అమలుచేసే పరిస్థితి కనీస స్థాయిలో కూడా లేకుండా ఉండాలి. నిషిద్ధ పదార్థం ద్వారా తప్ప, ఇక ప్రాణం నిలవని పరిస్థితి ఉండాలి. రెండవ షరతు : ఆ నిషిద్ధ పదార్థ ఉపయోగం 'గైరబాగిన్' అంటే, మనస్ఫూర్తిగా ఉండకూడదు. ఆ నిషిద్ధ పదార్థ ఉపయోగ సమయంలో మనసు దాని పట్ల పూర్తి అసహ్యాత, వ్యతిరేకత కలిగి ఉండాలి. ఇక మూడవ షరతు : ఈ నిషిద్ధ పదార్థ ఉపయోగం, పరిమాణం రీత్యా కనీస స్థాయిలో ఉండాలి. కేవలం ప్రాణాన్ని కాపాడుకోవడం వరకే స్వీకరించాలి.

పై మూడు షరతులకు లోబడి, ఒక వ్యక్తి ఏదైనా నిషిద్ధ వస్తువును ఉపయోగిస్తే నిస్సందేహంగా అల్లాహ్ వద్ద అతను క్షమార్హుడుగా పరిగణించబడతాడు. అలాకాక, పై షరతులలో ఏ ఒక్కటి అయినా తప్పించుకొనే అవకాశం ఉంటే, ఈ అవకాశంతో లబ్ధి పొందటానికి ఏమాత్రం అనుమతి ఉండదు. ఒకవేళ ఈ అనుమతిని ఉల్లంఘించి లబ్ధి పొందితే అల్లాహ్ వద్ద ఈ నేరానికి తప్పనిసరిగా శిక్షను చవిచూడవలసి ఉంటుంది.

ఇస్లామీయ ధర్మశాస్త్ర పరిధిలో 'గత్యంతరం లేని పరిస్థితుల' వివరణ మన ముందు ఆవిష్కరింప చేయబడింది. ఈ జ్ఞాన, ఆవిష్కరణల వెలుగులో ఉమ్మతె ముస్లిమా యొక్క నేటి సామూహిక జీవిత విధానంపై సరైన శాస్త్రీయ విశ్లేషణ చేసి

చూడండి. దాని పునాదులపై 'దైవభక్తులు'గా పేరుబడిన మన ప్రజల సంఖ్యను గుణించండి. అధర్మ వ్యవస్థల నీడలో జీవనం కొనసాగిస్తూ ఉన్నవారు - దైవ ధిక్కారులను అనుసరించేవారూ, ధర్మ వ్యతిరేక అసెంబ్లీలలో ప్రవేశించి, చట్టాలకు రూపకల్పనలు చేసేవారూ, దైవధర్మాన్ని త్రోసిరాజన్న న్యాయ స్థానాలలో తమ వ్యవహారాల తీర్పులకై ధిక్కార తాగూత్ చట్టాలను ఆమోదించేవారు - పైన పేర్కొన్న 'తప్పనిసరి' పరిస్థితినే కలిగి ఉన్నారా? పంది మాంసపు ముక్క గొంతు నుండి దిగుతున్నప్పుడు మనసు పడే వేదన, ఘర్షణ, అసహ్యత, నిస్సహాయత, ఈ సందర్భంగా మనస్సులో కలుగుతుందా? కోట్లాది సంఖ్యలో ఉన్న ఈ మానవ సమాజం (ముస్లిం ఉమ్మత్) మూకుమ్మడిగా, అనివార్య పరిస్థితితో, ఖుర్‌ఆన్ బోధనలకు అనుగుణంగానే, అల్లాహ్ ఆజ్ఞలను అతిక్రమిస్తున్నారా? ముస్లింల ఈ సామూహికత ప్రతి రోజు ఉదయం నుండి సాయంత్రం వరకు దైవధిక్కార (తాగూత్) న్యాయస్థానాల ప్రదక్షిణలు చేస్తున్న సమయంలో, ఈ ప్రదక్షిణలు కేవలం గతిలేని పరిస్థితుల్లో కొనసాగిస్తున్న విధిలేని చర్యలని, నిజానికి ఈ ఆచరణ నిషిద్ధమైనదని భావిస్తున్నారా? ఈ ఆచరణల్లో, ప్రదక్షిణల్లో స్వంత స్వార్థం ఏమీ లేదా? కోరికల దాస్యం కానరావటం లేదా? దేవుని హద్దుల అతిక్రమణకు సంబంధించిన చేతన ఉన్నదా? ధర్మశాస్త్ర ఉల్లంఘనకు సంబంధించిన ఆక్రోశం కానవస్తుందా? కేవలం గతిలేని, విధిలేని, గత్యంతరం లేని పరిస్థితుల్లో నేడు ప్రదక్షిణలు చేస్తున్నామా? చట్టాలను ధిక్కరించి, మానవ నిర్మిత చట్టాల ఆధారంగా తీర్పులు ప్రకటించే సమయంలో 'నేను నేరం చేస్తున్నాను, దేవుని చట్టానికి వ్యతిరేకంగా తీర్పు ఇస్తున్నాను' అని మనసులో పశ్చాత్తాపంతో కూడిన బాధ పొందుతున్నాడా? తన నిస్సహాయతపై మనసులో కుమిలిపోతున్నాడా? ఈ సందర్భంలో తన **'గైరబాగిన్ వలా ఆదిన్'** (కాంక్షతో తినటం లేదు, ఆజ్ఞను ఉల్లంఘించటమూ లేదు) అని ఫీల్ అవుతున్నాడా? ఈ ప్రశ్నలన్నింటికీ జవాబు 'అవును' అని అయితే నిస్సందేహంగా **'ఫలా ఇస్మ అలైహి'** (అది పాపం కాదు). అప్పుడు మన్నింపుకు, అర్హులము అవుతాము. దురదృష్టవశాత్తు మనం ఈ మన్నింపుకు అర్హులం కాము అనేది కఠోర వాస్తవం. స్వేచ్ఛగా, కొంత ధైర్యంగా, మరికొంత నిజాయితీగా మనల్నీ, మన ఆచరణలనీ మూల్యాంకనం చేసుకుంటే, మన వాస్తవిక స్థితి మన కళ్ళముందు నిలుస్తుంది. మనం నేటి న్యాయస్థానాలలో ప్రవేశించడంలో,

ఆ హోదాల కుర్చీలలో ఆసీనులు కావడంలో ఎక్కడా 'గత్యంతరం లేని' పరిస్థితి కానరావడం లేదు. నిజం చెప్పాలంటే దరిద్రంలో, ఆకలితో అలమటించే గత్యంతరం లేని పరిస్థితిలో ఉన్నవాడు, ఈ న్యాయస్థానాల హోదాల వరకు, కుర్చీల ఆసీనతల వరకు చేరనే లేడనేది కూడా మనం గుర్తించాలి. ఈ హోదాల ద్వారా లభ్యమౌతున్న పరమ జుగుప్సాకరమయిన సంపద, ఆహారం మనస్ఫూర్తిగానే స్వీకరిస్తున్నామని మరువరాదు. సాధారణ దరిద్ర నారాయణులు ఈ స్థాయి, హోదాల వరకు చేరలేరనీ – ముందు నుండే వంశపరంగా – కుటుంబపరంగా ఆర్థిక స్థోమతలు, హోదాలు కలవారే ఈ స్థాయి వరకు చేరగలరనీ మనందరికీ తెలుసు. కనుక, మనం చాలా సంతోషంగా, సంతృప్తిగా, మరింత ఆనందంగానే దైవధిక్కార చర్యలన్నీ చేస్తున్నామనీ, దైవాదేశాలకు వ్యతిరేకమైన జీవితాన్ని గడుపుతున్నామనీ అంగీకరించక తప్పదు. మన పిల్లలను ఆ హోదాల కుర్చీలల్లో కూర్చోబెట్టడానికే వారికి ఉన్నత విద్యను అందిస్తున్నాం. ఒకసారి ఆ హోదాల కుర్చీలో కూర్చున్న తరువాత, అందు నుండి మరింత ఉన్నత స్థానాలకు ఎగబాకాలని ప్రయత్నిస్తున్నాం. ఇదే సఫలమైన జీవితంగా అంగీకరిస్తున్నాం. నిజంగా గత్యంతరం లేని స్థితి అని ఇచ్చుకునే సంజాయిషీలు నిజమైనవే అయితే తను సంపాదిస్తున్న అధర్మ సంపాదన పట్ల ఆ వ్యక్తి అసంతృప్తిగానే జీవిస్తాడు. తద్వారా తన విశ్వాసపు స్థితిని, స్థాయిని సహజంగా ప్రకటిస్తాడు. ప్రత్యామ్నాయ సంపాదన కోసం నిరంతరం వెతుకులాట ప్రారంభిస్తాడు కాని, ఇటువంటి వ్యక్తిత్వాలు నేడు దీపం పెట్టి వెతికినా కానరావడం లేదనేది తిరుగులేని వాస్తవం.

పరిస్థితుల స్వరూపం ఈ విధంగా ఉండగా, దీనిని గత్యంతరంలేని స్థితి అని సాకులు ఎలా చెప్పగలం? దైవధిక్కార తాగూత్ వ్యవస్థ దాస్యాన్ని ఎలా సమర్థించుకోగలం? నిజంగా మన మనస్సులు దైవధిక్కార తాగూత్ వ్యవస్థల అధికారాన్ని ధిక్కరించేవి అయివుంటే, మన హృదయాలు విశ్వాసపు కనీస స్థాయిని కలిగివుంటే, మనం ప్రశాంతంగా, మన విలాసవంతమైన భవనాలలో సుఖంగా నిద్రించగలిగేవారమా? మన మద్రసాలు, దైవం, దైవప్రవక్త బోధనలు వల్లెవేస్తూ తమ తమ భవంతులలో పరుపు, దిండ్ల మెత్తదనాన్ని ఆస్వాదిస్తూ ఉండేవా? మనం ఏమీ చేయలేకపోతే, కనీసం ఈ 'మహా దౌష్ట్యానికి' సహకరించకుండా ఉండేవారం కదా!? తమ మాటల ద్వారా, చేతల ద్వారా 'చెడుకు మద్దత్తుదారులము కాము'

అని రుజువు చేసుకొని ఉండేవారం కదా? చెడును బహిరంగంగా మాటలద్వారా, చేతల ద్వారా నిరోధించలేని పరిస్థితులు చోటు చేసుకొనివుంటే, కనీసం దానిని మానసికంగా అసహ్యించుకునేవారం కదా? ప్రవక్త మహనీయుల (స) బోధనల ప్రకారం ఈ స్థితి విశ్వాసపు హీనస్థాయిని సూచిస్తుంది. విశ్వాసుల విశ్వాసపు స్థాయిని ప్రవక్తశ్రీ (స) వారు విడమర్చి తెలుపుతూ ... "ఎవరైతే చెడుకు వ్యతిరేకంగా తన చేతితో పోరాడుతాడో అతడే విశ్వాసి. ఎవరైతే తన నోటిద్వారా పోరాడుతాడో అతడు కూడా విశ్వాసియే. ఎవరైతే తన మనసులో అసహ్యించుకోవడం ద్వారా (మానసికంగా) పోరాడుతాడో అతడు కూడా హీనస్థాయిగల విశ్వాసియే. ఆ తర్వాత ఆవగింజంత విశ్వాసం కూడా (ఊహించనలవిగా) ఉండదు" (ముస్లిం గ్రంథం) అని స్పష్టం చేశారు.

కాని నేటి ముస్లిం ఉమ్మత్ యొక్క పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది. దైవధిక్కార తాగూత్ వ్యవస్థను అంగీకరించడం అనే 'మహా చెడు' పట్ల ద్వేషంగాని, జుగుప్సగాని లేకపోగా, ఈ చెడును, అసలు చెడుగా అంగీకరించడమే మానేసింది. మరింత ముందుకు వెళ్ళి ఈ చెడు స్థాపన కోసం అత్యంత విధేయత కలిగిన సైనికుల్లా కృషిచేయడం తన కర్తవ్యంగా భావిస్తుంది. తన భౌతిక, బౌద్ధిక శక్తియుక్తులన్నింటినీ ఈ చెడు అభివృద్ధి కోసం వెచ్చిస్తూ ఉంది. వ్యతిరేకించవలసిన ఒక విషయం పట్ల ఇటువంటి సకారాత్మక వైఖరి సమంజసమేనా? ఈ బహిరంగ చెడును నిరోధించడానికి కాదు కదా... కనీసం అసహ్యించుకోవడాన్ని కూడా మానుకుంటే ... ప్రవక్తశ్రీ (స) వారి బోధనల ప్రకారం మనలో విశ్వాసం కనీస స్థాయిలోనైనా బ్రతికి ఉన్నట్లు భావించటానికి ఆస్కారముండేదేమో? దిక్కులేని స్థితికి కూడా ఒక హద్దూ-పద్దూ ఉంటుంది కదా? మనం, మన నేటి జీవన విధానం ద్వారా రుజువు పరుస్తున్నంత విశాలంగా మన నిస్సహాయతల హద్దులు ఉన్నాయా? ఇదే నిజమైతే, నిస్సందేహంగా ప్రపంచంలోని 'ఎంత పెద్ద చెడు' అయినా ఈ ఉమ్మత్‌కు చెడుగా కన్పించనే కన్పించదు. ఖుర్ఆన్ ఆదేశాల ధిక్కారం ఈ ఉమ్మత్‌కు సర్వసాధారణమైపోతుంది. ఇటువంటి పరిస్థితుల్లో ఒక 'ముస్లిం', తన కోరికల దాస్యానికి ఎంతగా పాల్పడుతాడంటే, అతనికి, ఒక దైవధిక్కారికి మధ్య వ్యత్యాసమే లేకుండా పోతుంది. ఆ తరువాత విలువలు, సభ్యతలు, ఆరాధనలు, వాటి బాహ్య నియమ నిబంధనలు అన్నీ

వ్యర్థమైపోతాయి. ఖుర్ఆన్ అవతరణ – దాని ఆచరణాత్మక నమూనా అయిన ప్రవక్తశ్రీ (స) వారి జీవితం ఎంతమాత్రమూ ఆ ముస్లింకు ఉపయోగకరం కాకుండా పోతాయి. 'గత్యంతరం లేని పరిస్థితి'కి ఇష్టానుసారం ఇచ్చుకునే సంజాయిషీలతో, భావార్థాలతో అల్లాహ్‌కు ఆయన ప్రవక్త (స)లకు ఏమాత్రం సంబంధం లేదని ఈ సందర్భంగా గుర్తుంచుకోవడం అత్యవసరం.

ఈ దయనీయ స్థితికి మనం ఎందుకు చేరుకున్నామో, ఈ సందర్భంగా తెలుసుకోవడం చాలా అవసరం. ఏ సమాజంలోనైనా, ఎప్పుడైనా ఒక చెడు మొట్టమొదటి సారిగా కనిపించినప్పుడు, ఆ సమాజపు సామూహికత, దాని అంతరాత్మ దానిని వ్యతిరేకించి తీరుతుంది. తప్పకుండా అసహ్యించుకుంటుంది. అయితే ఈ వ్యతిరేకత, అసహ్యతల శక్తి సమాజం మొత్తాన్ని ప్రభావితం చేయగలిగితే, ఆ చెడు సమాజం నుండి పలాయనం చిత్తగిస్తుంది. లేదా, అణిచివేయబడుతుంది. అలాగాకుండా చెడుపట్ల వ్యతిరేకత కేవలం నిరసన స్థాయిలో మాత్రమే కొనసాగితే, క్రమంగా ఆ చెడు వ్రేళ్ళు సమాజంలో పాదుకుపోతాయి. మెల్లమెల్లగా సమాజాన్ని ప్రభావితం చేయసాగుతాయి. ఈ పరిస్థితిలో సైతం సమాజ సామూహికత శక్తివంతంగా పనిచేయగలిగితే ఈ చెడు వ్రేళ్ళను పెకలించి వేయవచ్చు. లేకపోతే క్రమక్రమంగా ఈ చెడు పట్ల అసహ్యత వీరిలో సైతం తగ్గిపోతూ వస్తుంది. మరికొంత కాలం తర్వాత ఈ చెడు ఇక ఎంతమాత్రం చెడుగా భావించబడదు. ఆ తర్వాత ప్రజా సమూహం కాలక్రమేణా ఈ చెడు రంగులో రంగరించబడుతుంది. ఫలితంగా ఈ చెడు సమాజానికి ఒక అవసరంగా భావించబడుతుంది. ప్రజలందరి అంగీకారం పొందుతుంది. సామాజికంగా ఆమోద ముద్రను పొందుతుంది. ఇందుకోసంగా, ఆ సమాజం గతంలో తను అంగీకరిస్తూ వచ్చిన విలువలకు సైతం తిలోదకాలు ఇవ్వడానికి లేక తన పరిస్థితులను చెడుకు అనుకూలంగా మార్పు చేసుకోవడానికి ప్రయత్నించి సఫలీకృతమవుతుంది. ఇది సమాజపు సహజ పరిణామంగా, చెడును ఆమోదించే సహజ క్రమంగా చరిత్ర రుజువు చేసింది. ఈ కారణంగానే ముస్లింలకు ప్రారంభంలోనే ఈ విషయమై, ఈ పరిణామ క్రమం గురించి హెచ్చరించటం జరిగింది.

"దైవం సాక్షి! మీరు స్వయంగా మంచిని ఆజ్ఞాపిస్తూ ఉండాలి. అదే క్రమంలో

చెడును తప్పనిసరిగా నిరోధిస్తూ ఉండాలి" అని చెపుతూనే అదే క్రమంలో "అలా చేయకపోతే అల్లాహ్ మనందరి హృదయాలను ఒకే విధమైనవిగా (చెడును ఆమోదించేవిగా) చేసి వేస్తాడు" (అబూదావూద్ గ్రంథం - రియాజుస్సాలిహీన్ సౌజన్యంతో) అని హెచ్చరించడం జరిగింది.

దురదృష్టవశాత్తు ముస్లిం సమాజం ఈ హెచ్చరికను, ఈ ఉపదేశాన్ని తమ మస్తిష్కాలలో భద్రపర్చుకోలేక పోయింది. ఈ అజాగ్రత్త, నిర్లక్ష్యాల ఫలితంగా ముస్లిం సమాజాన్ని, నేడు 'చెడు' అల్లుకుపోయింది. ఎప్పుడైతే వీరిలో సైద్ధాంతికపరమైన భ్రష్టత్వం పొడసూపిందో, ఆచరణల్లో చెడులు చొరబడటం మొదలెట్టాయో, ఆ క్షణంలోనే వీరు, వాటికి వ్యతిరేకంగా - సైద్ధాంతికంగా, ఆచరణాత్మకంగా ప్రతిఘటన చేయలేదు. ఈ కారణంగా మెల్లమెల్లగా ఆ చెడులకు అలవాటుపడటం మొదలెట్టారు. ఈ క్రమం శతాబ్దాల తరబడి కొనసాగిన ఫలితంగా నేడు ఈ దుస్థితి దాపురించింది. ఈ దుస్థితినే మనం గత పుటల్లో విశ్లేషించి చూశాం. సాధారణ ముస్లింల మనసులు, ఆలోచనలు, దృష్టి కోణాలు, భావనలు, తాత్విక దృక్పథాలు అన్నీ మార్పునకు గురిఅయి, ఏవీ ... ఏవీ కానివిగా మారిపోయాయి. అంతులేని భావదారిద్ర్యానికి గురయిపోయాయి. ఫలితంగా వేటినైతే తీవ్రంగా వ్యతిరేకించాలో, అసహ్యించుకోవాలో -వాటినే ప్రేమిస్తున్నాం, అభిమానిస్తున్నాం. ఏ ఏ విషయాల నుండి దూరంగా పారిపోవలసి ఉండిందో - ఆయా విషయాల వైపునకే ఆకర్షింపబడేవారుగా, పరుగెత్తే వారంగా మనం మారిపోయాం. ఏ ఏ అజ్ఞాన చర్యలను మన పాదాల క్రింద నలిపివేయవలసి ఉండిందో - వాటన్నింటిని దోసిళ్ళతో పట్టి మూటకట్టుకొనేవారంగా పరిణామం చెందాం. చెడును కనీసం మనసులోనయినా అసహ్యించుకోకపోతే అది విశ్వాసపరంగా మరణానికి తార్కాణమని ప్రవక్త (స) ప్రవచనం ద్వారా అవగతమవుతోంది. కాని నేటి ఆ ప్రవక్తశ్రీ (స) వారి అనుచర సమాజం, మానవ నిర్మిత ప్రభువుల ఆజ్ఞల అడుగులకు మడుగులొత్తుతూ వారి అధికారపు కాడిని తమ భుజస్కంధాలపై మోస్తూ, తమ జీవన వ్యవహారాలలో వీరి తీర్పులనే సంతోషంగా శిరసావహిస్తూ, తమ న్యాయస్థానాల్లో దైవ ప్రవేశాన్ని నిషేధిస్తూ, అవసరమైతే, అవకాశం దొరికితే తన స్వంత ప్రభు సత్తాక వ్యవస్థను ప్రతిష్ఠించే ప్రయత్నం కడు నిష్ఠతో కొనసాగిస్తోంది. తన కోరికలకు అనుగుణంగా, స్వేచ్ఛగా దైవ చట్టాలకు వ్యతిరేకమైన చట్టాలను రచిస్తూ ఉంది. వేటిని తాను కోరుకుంటుందో, దానిని

ధర్మసమ్మతం చేస్తూ, వేటిని తాను కోరుకోదో – దానిని నిషిద్ధపర్చుకుంటూ పోతుంది. అయినా తమ ధర్మం సత్యమైనదనీ, తమ విశ్వాసం చెడిపోనిదనీ, తమ ఏకేశ్వరోపాసన ప్రభావితం కాలేనిదనీ, తమ దైవదాస్యంలో మార్పు ఏమాత్రం రాలేదనీ – ప్రవక్త (స) అనుసరణలో తాము దృఢంగా ఉన్నామనీ, ధైర్యంగా ప్రకటించుకుంటూ ముందుకు సాగుతున్నది. దైవగ్రంథాన్ని పరిత్యజించడం లాంటి ఘోరమైన నేరం మనకు గుర్తుకు రావటం లేదు. అల్లాహ్‌తో చేసిన వాగ్దానాన్ని భగ్నం చేసే ఘోర తప్పిదం మనకు అస్సలు గుర్తే లేకుండా పోయింది. ఎందుకు? ఎందుకంటే "మనం గత్యంతరం లేని పరిస్థితుల్లో ఉన్నాం" అనే సాకు, సంజాయిషీ మన వద్ద సిద్ధంగా ఉంది కదా!

పై కుంటి సాకుల వాదనను మోసపూరిత వాదన అనండీ! మనోకాంక్షల దాస్యపు వాదన అనండీ, మరేమన్నా అనండి... కాని ఈ సంజాయిషీ, మోసపూరితమైనది... ఆత్మ వంచనతో కూడుకున్నదని భావించాలి. ఈ ప్రమాదకరమైన కుంటిసాకుల చేదు ఫలితాలను నేడు ఉమ్మత్ చవిచూస్తోంది. నేటి వరకు గడచిన చరిత్రను పరిశీలించినవారికి – తద్వారా ఉమ్మత్ అనుభవించిన బాధాతప్త సంఘటనలను గమనించిన వారికి మాత్రమే అది కన్పిస్తుంది.

దైవేతర రాజ్య వ్యవస్థలో, దాని పరిపాలనలో విధేయులైన పౌరులంగా జీవించటం వల్ల, మనం కేవలం ఇస్లాం యొక్క ఒక ముఖ్యమైన ప్రాథమికమైన శిక్షణకు వ్యతిరేకంగా మాత్రమే ఆచరించటం లేదు, ఈ వ్యతిరేక జీవన విధానం కారణంగా మన జీవితం చేతనంగానూ (లేక) అచేతనంగానూ దైవేతర వ్యవస్థ యొక్క మూసలో పోతపోయబడుతున్నాం. ఈ మూస పూర్తిగా ఇస్లాంకు వ్యతిరేకమైనది అనేది నిర్వివాదాంశం. ఈ మూసలో పోయబడిన కారణంగా మన సమాజపు అభివృద్ధి, ఉత్థానం, సభ్యతా–సంస్కృతులు, విలువలు, మన విద్యారంగపు శిక్షణలు, మన ఆర్థిక లావాదేవీలు, సంపాదనా–ఖర్చులు, సామాజిక విలువలు అన్నీ కూడా ఈ 'పోత' పునాదులపైనే నిర్మింపబడ్డాయి. ఫలితంగా ఈ వ్యవస్థలన్నీ మూకుమ్మడిగా ముస్లిం ఉమ్మత్‌ను తన వాస్తవ పునాదుల నుండి దూరంగా ... మరింత దూరంగా విసిరివేసాయి.

దైవేతర చట్టం ప్రకారం తీర్పులు చెప్పటం లేక చెప్పించడం అనేది కేవలం ఒక పాపకార్యం మాత్రమే కాదు. అది అల్లాహ్ ఆదేశాల ఒక పెద్ద భాగాన్ని చుట్టచుట్టి, కట్టగట్టి అటక ఎక్కించడం కూడా అవుతుంది. అల్లాహ్ ఆదేశాల

వాస్తవికతను మన మనోమస్తిష్కాల నుండి తుడిచివేయడం అవుతుంది. జీవితంలోని ఒక పెద్ద భాగపు వ్యవహారాలలో అల్లాహ్ ఆదేశాలను నిర్లక్ష్యపరచటం అవుతుంది. మరో మాటలో మనం, మన ధర్మాన్ని దైవాదేశ గ్రంథం దివ్య ఖుర్‌ఆన్‌ను కేవలం మసీదు నాలుగు గోడలకు పరిమితం చేసివేయడం అవుతుంది. మదరసాల బీరువాల్లో బంధించి వేయడం అవుతుంది. ఫలితంగా కేవలం కొన్ని పరిమితమైన ఆచార వ్యవహారాలకు, ఆరాధనా విధానాలకు మాత్రమే ఈ గ్రంథాన్ని పరిమితం చేసిన వారమవుతాము.

ఈ వివరణ కేవలం ఊహల పునాదులపై చేసింది కాదు సుమా! ప్రతి సత్యప్రియుడైన వ్యక్తి, తన స్వంత పరిశీలనా దృష్టితో గమనిస్తే కనబడే కఠోర వాస్తవికతా వికార చిత్రం యిదే సుమా!

ఉమ్మత్ యొక్క ధార్మిక పండితుల నాయకత్వం, ఖుర్‌ఆన్ యొక్క ఒక పెద్ద భాగాన్ని, అధికారం లేదనే నెపం చూపి, లేక పరిస్థితుల అననుకూలతల రక్షణలో తన్నుతాను తలదాచుకోవటానికి అవలంబించిన వైఖరి మూలంగా; దైవగ్రంథపు అనేక ఆదేశాలతో మన ఆచరణాత్మక సంబంధం తెగిపోయింది. కేవలం ధర్మం యొక్క ఓ చిన్న భాగాన్ని మాత్రమే అమలు చేసే అధమ స్థాయికి దిగజారిపోవటం జరిగింది. ప్రారంభంలో ధర్మం పునాది సూత్రాలపై నిష్ఠాగరిష్ఠమైన ఆచరణ కొనసాగింది. కాని కాలం గడిచేకొద్దీ ఈ నిష్ఠాత్మక ఆచరణలో విశ్రాంతి, స్వీయ మానసిక సంతృప్తులు చోటుచేసుకున్నాయి. ఈ క్రమం కొనసాగి ప్రస్తుతం ధర్మం, కేవలం కొన్ని ఆరాధనల, ఆచార వ్యవహారాల మారుపేరుగా పరిమితమై పోయింది. ఈ పరిమిత రూపాన్ని మాత్రమే ఇస్లాంగా భావించి మిగిలినదంతా ధర్మం (దీన్)కు సంబంధం లేనిదిగా తలపోయటం జరిగింది. ఫలితంగా ఒక మస్జిద్ యొక్క ఒక చిన్న ఇటుకను ఎవరైనా నష్టపరిస్తే – దాని కోసం మెడలు, నరుక్కొనే స్థాయికి ఎదిగి (?), రక్తపుటేరులు ప్రవహింపజేయటానికి సిద్ధపడుతున్నారు. కాని, అల్లాహ్ యొక్క అత్యంత ప్రధానమైన అనేక ఆదేశాలను నిర్లక్ష్యపర్చడంపై కనీసం రెండు కన్నీటి చుక్కలు కార్చడానికి కూడా మనకళ్ళు నోచుకోవటం లేదు. కొన్ని పనులను ధర్మాచరణలనీ, మరికొన్నింటిని ప్రాపంచికాలని భావించటం వల్ల ఏర్పడిన సహజ దుస్థితిగా దీనిని అర్థం చేసుకోవాలి. ఖుర్‌ఆన్ మరియు ప్రవక్త సంప్రదాయాన్ని

నోటితో ధిక్కరించని మనం, వాటి అమలు విషయం ప్రస్తావించబడేసరికి, లెక్కలేనన్ని సాకులు మనకు గుర్తుకు వచ్చేస్తాయి. చేతనాత్మకంగానూ, లేక అచేతనాత్మకంగానూ అదే సంకుచిత ధోరణిని, పాక్షిక ధర్మాచరణను వల్లెవేస్తూ, ఆచరిస్తూ పరిస్థితిని అనుకూలతల డాలుతో మనల్ని మనం రక్షించుకునే ప్రయత్నం చేస్తున్నాం.

మనలోని విశ్వాసపు బలహీనత, విధి-కర్తవ్య నిర్వహణల పట్ల నిర్లక్ష్యం, తేలికపాటి అనుకూలమైన పనుల నిర్వహణ పట్ల మొగ్గు - అన్నీ కలసి ఉమ్మత్‌ను దైవేతర - తిరస్కార - అసత్య వ్యవస్థ ముందు తలవంచే దుస్థితికి గురిచేసింది. ఈ దుస్థితి మరింత ముందుకు కొనసాగి, ఉమ్మత్‌ను దైవగ్రంథంలోని అతి పెద్ద భాగాన్ని అనుసరించకుండా వుండే దయనీయ స్థితిని సృష్టించింది. ఈ దయనీయ స్థితి ప్రభావం వల్ల ఉమ్మత్ తన నేరాన్ని కప్పిపుచ్చుకునే ప్రయత్నం చేస్తుంది. ఇస్లామీయ ధర్మావగాహననే కుంచింపచేసే మరుగుజ్జుతనానికి, భావదాస్యానికి గురిఅయిపోయింది. ధర్మం యొక్క ఆత్మనే పెకలించివేసే స్థాయికి దిగజారిపోయింది. ఇక ఎప్పటికీ, తాను నిర్లక్ష్యం చేసివేసిన దైవాదేశాల వైపు వేలెత్తి చూపించే 'స్వేచ్ఛలేని'తనానికి గురయిపోయింది. చివరగా ధర్మపరమైన రాజకీయ అవగాహనా రాహిత్యం ఉమ్మత్‌ను మరింతగా చీకట్లలోనికి నెట్టివేసింది. ఈ బలహీనతలు, లోపాలు అన్నీ ఒకదానితో మరొకటి కలసి, ఒకదానితో మరొకటి శక్తిపొంది, భౌతికాభివృద్ధి అనే అందమైన వలలో ఉమ్మత్‌ను బంధించివేసింది. ఫలితంగా ఉమ్మత్‌లో వాస్తవాన్ని తరచిచూసే నిశిత దృష్టి సన్నగిల్లింది. ఉన్నత శిఖరాలకు చేరుకునే మార్గాలను, అన్వేషణా ద్వారాలను అది తనకు తానుగా మూసుకుంది. ఒక వ్యక్తి, తాను తప్పు చేస్తున్నాననే చేతన కలిగి ఉంటేనే అతను ఎప్పటికైనా తన్ను తాను సరిదిద్దుకొనే ప్రయత్నం చేస్తాడని ఆశించవచ్చు. ఆ భావనే లేకపోతే, తన దృష్టిలో 'తప్పు-తప్పుకాకుంటే', నేరం నేరంగా అంగీకరించలేకపోతే, దిద్దుబాటుకు అవకాశం ఇక ఎంతమాత్రమూ ఉండదు. నేడు ఉమ్మత్ ఈ దుస్థితి నుండి బయటపడాలనే అనుకుంటే తన తప్పును మనస్ఫూర్తిగా అంగీకరించవలసి ఉంది. వీలైనంత త్వరగా ధర్మాచరణలో సంపూర్ణ విధేయత, అనుసరణల మార్గం అవలంబించవలసి ఉంది. ఏ కొరతలనూ, పరిమితులనూ తనకు తానుగా సృష్టించుకున్నదో, వాటన్నింటిని అధిగమించే కృషికి అది పూనుకోవాలి. ఇది ఒక్కటే, ఈ దుస్థితి నుండి బయట పడటానికి ఏకైక మార్గం కాగలదు.

# దూరదృష్టి లోపించిన ఉమ్మత్

అల్లాహ్ మార్గదర్శకత్వం, హితోపదేశం ఒక ప్రత్యేక, అద్భుత స్వభావం కలిగి ఉంటుంది. ఒకే విషయం చెప్పబడుతుంది – ఆ విషయం ద్వారా ఒకరికి మార్గదర్శక ద్వారాలు తెరుచుకుంటాయి. సత్యం అతని ముందు సాక్షాత్కరిస్తుంది. కాని, అదే విషయం మరొకరిని మార్గభ్రష్టత్వానికి గురిచేస్తుంది. అజ్ఞానపు తిమిరంలోకి నెట్టివేస్తుంది. సత్యమార్గంలో ప్రయాణిస్తూ ఉన్న బాటసారి అకస్మాత్తుగా వక్రమార్గం వైపునకు మరలిపోయేలా చేస్తుంది. అల్లాహ్ మార్గదర్శకత్వం సమతూకంపై ఆధారపడి ఉంటుంది. ఎవరైతే సత్యమార్గాన్ని కోరుతూ, దాన్ని అన్వేషిస్తాడో – అతనికి మాత్రమే సత్య ద్వారాలు తెరవబడతాయి. కాని సత్యంపట్ల నిర్లక్ష్య వైఖరి ప్రదర్శించేవానికి సత్య కిరణాలు కానరావు. కళ్ళున్నవారు సూర్యుని వెలుగుతో లోకమంతా కానగలరు. కాని గుడ్లగూబలు, గబ్బిలాలు పగటి వెలుగులో ఏమీ కానలేవు. అదేవిధంగా దివ్య ఖుర్ఆన్ మార్గదర్శక దివ్య తేజస్సు మానవులందరికీ మార్గదర్శకమే. కాని, అదే గ్రంథం 'నేను చాలా మందికి మార్గదర్శనం చేసినట్లే చాలా మందిని మార్గం తప్పించివేస్తాను' అని కూడా ప్రకటిస్తుంది. (యుజిల్లూబిహీ కసీరన్ – వ యహ్దీబిహీ కసీరా). ఈ ప్రకటనలో అదే దైవ సమన్యాయం నిబిడీకృతమై ఉందనేది గమనార్హం. అంటే, ఎవరైతే సత్యమార్గాన్ని చూడాలని అభిలషిస్తారో వారికే ఈ దివ్య గ్రంథం ఆ మార్గాన్ని చూపిస్తుందని స్పష్టమవుతుంది. సత్యమార్గాన్ని కోరుకోని వారిని బలవంతంగా, సత్యమార్గం వైపునకు నెట్టడం అనేది జరగదు. దైవగ్రంథపు ఈ ధర్మబద్ధ సమ న్యాయసూత్రం కేవలం దైవధిక్కారులకు మాత్రమే వర్తించదు, ఈ సూత్రం విశ్వాసుల వర్గానికి కూడా వర్తిస్తుంది. కేవలం ఈ గ్రంథాన్ని విశ్వసించినంత మాత్రాన మార్గదర్శనం పొందడం సాధ్యం కాదు. ఖుర్ఆన్‌పై విశ్వాసం ఉంచడంతో పాటు, తన జీవితపు విభిన్న రంగాలకు, వ్యవహారాలకు ఈ గ్రంథం నుండే మార్గదర్శకత్వాలను అభిలషించాలి... అన్వేషించాలి. ప్రతి సమస్యకు పరిష్కారం, ఈ గ్రంథం నుండే ఆశించాలి. అలా చేయని పక్షంలో నిర్ద్వంద్వంగా, విశ్వాసిని సైతం ఈ దివ్య గ్రంథం అజ్ఞానపు చీకటి అగాధాల వైపునకు విసిరివేస్తుంది. ఈ సందర్భంలో ఈ దివ్య గ్రంథం 'ఈ వ్యక్తి నన్ను విశ్వసించేవాడు' అని ఎంతమాత్రమూ

భావించదు. ఈ కారణంగానే ఈ గ్రంథం ఒక విశ్వాసిని సైతం అప్రమత్తంగా ఉండమని హెచ్చరిస్తుంది. 'ఓ ప్రభూ! నాకు మార్గదర్శక వెలుగు నిరంతరం ప్రసాదిస్తూ ఉండమని ఎల్లవేళలా అల్లాహ్‌ను వేడుకొంటూ ఉండమని' తాకీదు చేస్తుంది. (రబ్బనా లాతుజిగ్ ఖులూబనా బఅద ఇజ్ హదైతనా – (ప్రభూ! సన్మార్గం పొందిన తరువాత మా హృదయాలో వక్రత రానీయకు).

ఖుర్ఆన్ ఆదేశాలు సమన్యాయ సూత్రంపై ఆధారపడి ఉంటుందని మనం గ్రహించాం. ఎక్కడి నుండి మార్గదర్శకత్వం లభిస్తుందో – మార్గభ్రష్టత్వ సామగ్రి కూడా అక్కడ నుండియే విడుదల అవుతుంది. ఆదేశాలను, దాని సంబోధనలను గమనిస్తే అది ముస్లిం ఉమ్మత్‌ను ఒక సాధారణ పాలితవర్గంలా కాక, ఆజ్ఞలను అమలుపర్చగల రాజ్యాధికార పాలక వర్గంగా సంబోధిస్తుంది. ఉదా: 'ఓ విశ్వాసులారా! ఒకే దేవుని విధేయత పాటించండి. ఆయన ముందు తలవంచండి. ఇతర ప్రజలందరికీ ఇదేమార్గం వైపునకు ఆహ్వానిస్తూ ఉండండి. ఓ విశ్వసించిన వారలారా! తిరస్కారులతో పోరాడండి. పీడన అణచివేయబడే వరకూ. దుర్మార్గం యొక్క తల నలగగొట్టబడేంత వరకూ పోరాడండి! ఓ విశ్వాసం పొందినవారలారా! మంచిని ఆజ్ఞాపించండి. చెడును నిరోధించండి. ఓ ముస్లింలారా! దొంగతనం చేసినవారి చేతులు ఖండించండి. ఓ విశ్వాసపు వర్గమా! వ్యభిచారులకు కొరడా దెబ్బల శిక్ష విధించండి' లాంటి ఖుర్ఆన్ సున్నత్‌ల ఆదేశాలను గమనిస్తే, విశ్వాసుల వర్గపు ఉన్నత స్థానాన్ని తెలుపకనే తెలుపుతుంది. అల్లాహ్ దృష్టిలో ఈ ఆదేశం స్వీకరించేవర్గం, ఒక పాలనాధికారం గల వర్గంగానే ఉందనేది గమనార్హం. కేవలం తమ గృహాలకో – ప్రార్థనాలయాలకో పరిమితమైన వారు ఈ సంబోధనకు అర్హులు కారు. నాయకత్వం, అధికారపు పీఠంపై ఉన్నవారు మాత్రమే ఈ సంబోధనకు అర్హులని తేటతెల్లం అవుతుంది. దీనికన్నా అల్ప స్థాయికల విషయాన్ని ఖుర్ఆన్ ఈ విశ్వాసుల వర్గం నుండి కాంక్షించడం లేదు కూడాను. ఆలోచించి చూడండి, ఖుర్ఆన్ యొక్క ఈ కాంక్ష ఉమ్మత్‌ను ఎంతటి ఉన్నతస్థానంలో అధిష్టింపచేసిందో! ముస్లిం సమాజ ఆత్మను ప్రక్షాళనం చేసి, దాని స్థానాన్ని, దాని ఔన్నత్యాన్ని తెలియపర్చే ఆదేశం ఎంత మహోన్నతమైనదో గుర్తించండి. కాని, దురదృష్టవశాత్తు ఈ ఉమ్మత్ యొక్క ఆచరణ అందుకు అనుగుణంగా లేదు. ఈ ఉమ్మత్ ఆచరణ ఎలా ఉండవలసిందీ? ఎలా ఉన్నదీ? సృష్టికర్త అల్లాహ్

ఆదేశంలోని వివేకాన్ని అసలు ఈ ఉమ్మత్ అర్థం చేసుకున్నదా? పోగొట్టుకున్న తన స్థానాన్ని, మరిచిపోయిన తన కర్తవ్యాన్ని మరలా జ్ఞప్తికి తెచ్చుకున్నదా? లేదు. ఈ ఉమ్మత్‌కు ఈ జాగరూకతే నేడు కరువైంది. తన బలహీనతలను గుర్తించి, అంగీకరించి దానిని పారద్రోలడానికి నిరంతరం కృషి చేయవలసి ఉంది. కాని, ఈ ఉమ్మత్‌లో చైతన్యమే లేకుండా పోయింది. ఈ ఉమ్మత్‌ను, దాని స్వామి, ప్రభువు అయిన అల్లాహ్ ఏ స్థానంలో చూడదలిచాడో, ఆ స్థానాన్ని పొందడానికి తమ సర్వశక్తులూ ధారపోయవలసి ఉండింది. కాని అది ఈ ప్రయత్నం చేయడమే మానకుంది. దైవప్రతినిధిగా, అధికారం పొందిన ఒక అధికారిగా, తన బాధ్యత నిర్వహించవలసి ఉండింది. కాని, ఆ బాధ్యతనే విస్మరించింది. ముస్లిమ్ ఉమ్మత్ తన బాధ్యతలను, బరువుగా భావించి ఆ బరువును తన భుజస్కంధాలు మోయలేవని తనకు తానుగానే తీర్మానించుకుని చతికిలబడిపోయింది. ఈ బాధ్యతల బరువును వదిలించుకుంది.

పై వివరణ వెలుగులో 'గత్యంతరం లేని పరిస్థితి'లో అనుసరించే విధానాన్ని ఆదేశించిన దైవగ్రంథంలోని వాక్యాన్ని గమనించవలసి ఉంది. 'గైరబాగివ్ వలాఆద్' యొక్క ఆదేశంలో "గత్యంతరం లేని పరిస్థితి" కూడా షరతులపై ఆధారపడి ఉండటం గమనార్హం. పరిస్థితుల క్లిష్ట స్వరూపం, తన విశ్వాసపు నిష్ఠను నిలబెట్టుకోవాలనే బలీయమైన కాంక్ష – నిషిద్ధాన్ని (హరాంను) స్వీకరిస్తున్నామనే మానసిక అసహ్యత – ప్రాణం నిలుపుకోవాలనే అవసరంపై ఆధారపడిన వెసులుబాటుగా అర్థం చేసుకోవాలి. ఈ విషయమే 'ఫలా ఇస్మ అలైహి' స్థానాన్ని చూపిస్తుంది. ఈ స్థానంలో ఇక వదిలివేయడానికీ, త్యాగం చేయడానికీ ఇక ఏమీ మిగలని స్థితిగా మనం అర్థం చేసుకోవాలి. ఈ పరిస్థితుల్లో నిస్సందేహంగా నిషిద్ధాన్ని (హరామ్‌ను) ఉపయోగించుకునే, దాని ద్వారా అవసరం గడుపుకొనే, వెసులుబాటు దైవగ్రంథం ఇచ్చింది. ఈ వెసులుబాటు దైవాదేశపు ఒక పార్శ్వాన్ని మాత్రమే తెలియపర్చింది. ఈ ఆదేశానికి మరో పార్శ్వం కూడా ఉంది. ఆ పార్శ్వాన్ని 'గైర బాగివ్ వలాఆద్' అనే పదాలు స్పష్టం చేస్తున్నాయి. 'నిషిద్ధం ద్వారా అవసరం తీర్చుకునే' పరిస్థితులపై విధించబడిన షరతుగా ఈ పదాలు మనకు దర్శనమిస్తాయి. ఒక ముస్లిం, ఒక నిషిద్ధ (హరాం) వస్తువును ఉపయోగించవలసిన విధిలేని, గత్యంతరం లేని పరిస్థితి ఏర్పడినప్పుడు – ఆ సమయంలో, ఆ ముస్లిం మనస్సు సిగ్గుతో కుమిలి పోతూ ఉండాలి. ఆ నిషిద్ధ

పదార్థ స్వీకారం కూడా ప్రాణం నిలుపుకొనేంత కనీసమైందిగా ఉండాలి. ఈ పరిస్థితి మనకు మరో విషయాన్ని కూడా స్పష్టం చేస్తుంది. అదేమిటంటే, ఒక ముస్లిం ఈ గత్యంతరం లేని దుర్భర స్థితి నుండి బయటపడటానికి నిరంతరం కృషి చేయవలసి ఉంటుంది. ఈ నిషిద్ధ ఆహార స్వీకార స్థితి నుండి వీలైనంత త్వరగా బయటపడటానికి మనసా వాచా కర్మణా కఠినంగా శ్రమించాలి. తీవ్రమైన ఎండలో, మల మల మాడుతున్న ఒక రాతిపై చెప్పులు లేని పాదాలు ఉంచినపుడు, ఆ మంటకు ఏ విధంగా తన పాదాలను ఆ రాతిపై నుండి తొలగించుకునే ప్రయత్నం ఒక మనిషి చేస్తాడో – సరిగ్గా ఇటువంటి ప్రయత్నమే చేయవలసి ఉంటుంది. అంతేకాదు, అనివార్య పరిస్థితిలో ఆహారం స్వీకరించే సమయంలో, 'ఇది మృత పశువు మాంసము (ముర్దార్), నేను దీనిని తింటున్నాను.' 'ఇది పంది మాంసము. దీనిని నేను నా పళ్ళతో నమలుతున్నాను." 'ఇది కుళ్ళిన ఒక జంతు మాంసము, దీనిని నేను మింగుతున్నాను.' 'ఇది ఒక అసహ్యమైన పదార్థం. దీనితో నా చేయి, నోరు, కడుపు మొత్తంగా కంపుకొడుతుంది' అని భావించాలి.

దైవగ్రంథపు పై హెచ్చరికకు అనుగుణంగా మన జీవితం ఉండి ఉంటే నేటి మన స్థితికి 'ఈ దుస్థితి' కలిగి ఉండేది కాదు. ఈ ఓటమి, పిరికితనం, సంకుచిత స్వభావం, హ్రస్వదృష్టి, విశ్వాసపు హీనస్థితి, భావదారిద్ర్యం – అన్నీ కలిసి ఉమ్మత్ యొక్క శక్తి సామర్థ్యాలను ఇంతగా బలహీనపర్చి ఉండేవికావు. కోట్లాది ప్రజల ఈ ప్రజా సమూహం (ముస్లిం జనాభా) మొత్తంగా 'అననుకూల పరిస్థితుల' సాకు, నెపం చూపి, శతాబ్దాల తరబడి అసత్య వ్యవస్థతో, అత్యంత విజ్ఞానపరంగా, సిగ్గుఎగ్గూ లేకుండా చెట్టాపట్టాల్ వేసుకొని నడిచేది కాదు. దివ్య ఖుర్ఆన్ అనుయాయులమని చెప్పుకుంటూ, తమ జీవిత ప్రయాణంలో మాత్రం ఖుర్ఆన్ వ్యతిరేకులతో ఆనందంగా, సంతోషంగా, సంపూర్ణ అనుమతితో పయనిస్తూ ఉండేది కాదు. అంతరాత్మ ఈ ఉమ్మత్‌ను ధిక్కరించలేక, గొడవపడలేక పోతుంది. విశ్వాసపు హీనస్థితి ఉమ్మత్‌ను చేయిపట్టి ఆపనూ లేకపోతుంది. అసత్య, అహేతుక భావజాలాన్ని తిరస్కరించే – దైవేతర వ్యవస్థ తాగూత్‌కు వ్యతిరేకంగా ఉద్యమించే వారిగా ఉమ్మత్‌ను మలచలేకపోయింది. దివ్య ఖుర్ఆన్ నుండి ఈ ఉమ్మత్ స్ఫూర్తిని పొందివుంటే; సమస్త అసత్య వ్యవస్థకు వ్యతిరేకంగా, దృఢంగా కృషి చేసేలా ఉమ్మత్‌ను ఈ చేతన

తీర్చిదిద్ది ఉండేది. ఉనికిలో ఉన్న అశుద్ధ కంపుకొట్టే వ్యవస్థ నుండి విముక్తి పొందడానికి ఉద్యుక్త పర్చి ఉండేది. నేటి ముస్లిం ఉమ్మత్ అననుకూల పరిస్థితిలో దొరికే 'వెసులుబాటు'ను వెతికి పట్టుకుంది. కాని, 'గైరబాగివ్ వలా ఆద్' యొక్క 'షరతులు' మాత్రం మరుపునకు గురిచేసుకుంది.

పై మొత్తం చర్చద్వారా మన వాస్తవికత చిత్రపటం మన ముందు సాక్షాత్కరించి ఉంటుందని భావిస్తాను. ప్రస్తుత పరిమిత ఆచరణలో సంతృప్తిచెందడం ఆత్మ హత్యతో సమానం. ఈ సంతృప్తి, పాక్షికత అత్యంత ప్రమాదకరమైంది. ఈ స్థితి క్రమంగా విశ్వాసం పూర్తిగా నిర్జీవమయ్యే స్థితిని కల్పిస్తుంది. ధర్మావగాహనా లోపం లోపంగా కాక, దృష్టి రాహిత్యానికి నిదర్శనంగా మారిపోయే ప్రమాదం సృష్టిస్తుంది. బలహీనంగా కొట్టుకుంటున్నా ఈ ధర్మావగాహనా శ్వాస కూడా ఠపీమని నిలిచిపోయే ప్రమాదం తప్పక ఏర్పడుతుంది.

## 2. అననుకూల పరిస్థితుల సాకు

ఒక విశ్వాసి జీవిత లక్ష్యం, ధ్యేయం, విధి, కర్తవ్యం అయిన ధర్మ సంస్థాపన గురించి చెప్పే సాకులు, వాటి హేతుబద్ధతల గురెంచి మరింత క్షుణ్ణంగా తెలుసుకుందాం. ధర్మసంస్థాపనా విధి నుండి తమ్ముతాము తప్పించుకోవడమే గాక ఇతరులను కూడా ఈ విధి నుండి దూరంగా తరిమివేసే వీరి భావజాలాన్ని అర్థం చేసుకోవడం ఈ సందర్భంగా చాలా అవసరం. వీరు చెప్పే ఏకైక సాకు ఏమిటంటే, నేటి పరిస్థితులు ధర్మసంస్థాపనకు ఏమాత్రం అనుకూలంగా లేవు. అందువల్ల మన శక్తి యుక్తులను, ప్రతిభలను ఈ అనవసర విషయంపై వెచ్చించకుండా – ఆ పరిస్థితుల కల్పన కోసం – ఆ పరిస్థితుల అనుకూలతలు ఏర్పడటం కోసం అవసరమైన విషయాలపై ఖర్చుపెట్టాలని వీరు సూత్రీకరిస్తారు. ఈ ఆచరణ నిరంతరంగా చేస్తూ ఉంటే ఒకానొక రోజున మన జీవిత లక్ష్యం వైపునకు ఈ కృషి 'మార్చ్' చేయిస్తుందని నమ్మబలుకుతారు.

## పై వాదనపై కొన్ని ప్రశ్నలు

పై వాదన విన్న తరువాత సహజంగా ఈ వాదన యొక్క సత్యతపై కొన్ని ప్రశ్నలు ఎదురు అవుతాయి. 1. ధర్మ సంస్థాపనా కర్తవ్య నిర్వహణకోసం, మార్గం

సరళం చేసుకోవడానికి ఒక ప్రత్యేకమైన ఆచరణ అవసరమా? 2. నేటి పరిస్థితులలో ధర్మసంస్థాపనా కృషి అసాధ్యమా? 3. పై వాదనకు సంబంధించిన ఆచరణలు - ఫలితాలపై చారిత్రక ఆధారాలు, సాక్ష్యాలు ఏవైనా ఉన్నాయా? పై ప్రశ్నలకు హేతుబద్ధమైన సమాధానాలు లభ్యం కానంతవరకు, పై వాదనలోని సత్యాసత్యాలు బహిర్గతం కానేరవు. కనుక ఈ ప్రశ్నలకు అల్లాహ్ గ్రంథం నుండి, ప్రవక్తశ్రీ వారి, సదాచరణ నుండి ఎటువంటి సమాధానాలు లభ్యమౌతాయో తప్పనిసరిగా తెలుసుకోవాలి.

ముస్లిం ఉమ్మత్‌కు గౌరవోన్నతులు, బరువు బాధ్యతలు అందించిన గ్రంథరాజం దివ్య ఖుర్‌ఆన్ మాత్రమే ఈ ప్రశ్నలకు జవాబులు ఇవ్వగలుగుతుంది. ఒక ముస్లిం యొక్క సత్యత గురించి ఈ గ్రంథమే "తిబ్‌యానక లికుల్లి షైయిన్" అని ప్రకటించి ఉంది. జీవితపు అన్ని విషయాలలో మార్గదర్శకత్వం అందించిన ఈ గ్రంథం ప్రస్తుత చర్చనీయాంశమైన 'విషయ రాజం' (ధర్మసంస్థాపన)పై మార్గదర్శకత్వం అందించదా?

ఇక ప్రవక్తశ్రీ వారి పవిత్ర జీవితమే మనకు 'ఆ పని విధానాన్ని' స్పష్టంగా, సరళంగా అందించగలుగుతుంది. ప్రవక్తశ్రీ వారి ప్రత్యేక శిక్షణలో - తర్ఫీదులో వారి సహచరుల ఆదర్శవంతమైన ఆచరణ మాత్రమే ఈ విషయాన్ని నికార్సుగా, నిష్కల్మషంగా నిరూపించగలదు. ఎందుకంటే ఈ మహోన్నత లక్ష్యాన్ని, ధ్యేయాన్ని, తమ కర్తవ్యంగా, తప్పనిసరి విధిగా మొట్టమొదట స్వీకరించి, ఆచరించి చూపిన శుభాత్ములు వీరు మాత్రమే కదా!

## సాధ్యాసాధ్యాల సాకుతో విధుల పట్ల నిర్లక్ష్యం

దైవగ్రంథం దివ్య ఖుర్‌ఆన్ మొదటి ప్రశ్నకు ప్రతి విశ్వాసి ప్రధాన విధి అయిన జీవిత లక్ష్యం-ధ్యేయాల సాధన కొరకు నిరంతరం అవిరళ కృషి చేయడం అవసరమని ఎటువంటి పరిస్థితులలోనైనా పరిణామాన్ని గురించి ఆలోచించక ముందుకు సాగాలని జవాబు ఇస్తుంది. ఈ దైవప్రవక్తల సత్‌సాంప్రదాయం కూడా ఈ విషయాన్నే దృఢపరుస్తుంది. ప్రవక్తలు తమ జాతి ప్రజల ముందు తప్పనిసరిగా - ఖచ్చితంగా ఈ క్రింది అంశాన్ని ప్రకటించేవారని దివ్య గ్రంథం తేటతెల్లం చేసింది.

**"అల్లాహ్‌ను ఆరాధించండి - మిథ్యాదైవాల ఆరాదనకు దూరంగా ఉండండి."**

**(16 : 36)**

**ఇంకా, "నేను తప్ప (మరో) దేవుడు లేడు. కనుక మీరు నాకే దాస్యం చేయండి." (21:25)**

పైన పేర్కొన్న ఈ చిరు పదబంధాలు, ఇస్లామీయ విప్లవాత్మక ఆచరణను క్లుప్తంగా, ప్రస్ఫుటంగా పరిచయం చేస్తున్నాయి. ఈ కార్యాచరణనే ధర్మసంస్థాపన (ఇఖామతె దీన్) అని అంటారు. 'ఆరాధన' (ఇబాదత్) 'ఆరాధ్యుడు' (ఇలాహ్), మరియు 'మిథ్యాదైవాలు' (తాగూత్) అనే పదాల నుండి విస్తృతార్థాల పట్ల నిర్లక్ష్యం వహించడం జరుగుతుంది. కాని దైవగ్రంథం దివ్య ఖుర్ఆన్‌లోని సూరతు షూరా యొక్క 13వ వాక్యం (ఆయత్) "ఆయన నూహ్ ప్రవక్తకు ఆజ్ఞాపించిన ధర్మాన్నే నీకు కూడా నిర్ణయించాడు. దానినే (ముహమ్మద్ - స) ఇప్పుడు నీ వైపునకు మేము వహీ ద్వారా పంపాము. దానినే మేము ఇబ్రాహీంకు, మూసాకు, ఈసాకు బోధించాము. ఈ ధర్మాన్ని స్థాపించండి అని, దానిని గురించి విభేదాలలో పడకండి అనీ తాకీదు చేశాము" (42:13) అని స్పష్టపర్చి ప్రజల అవగాహనా రాహిత్యాన్ని, పరిమిత అర్థాల స్వీకరణను, నిర్లక్ష్యాన్ని పటాపంచలు చేయడం జరిగింది. ఈ స్పష్టమైన ఆదేశం ప్రవక్త నూహ్ (అ) అయినా, ఇబ్రాహీం (అ), మూసా (అ), ఈసా (అ)లు అయినా స్వయంగా చివరి దైవప్రవక్త ముహమ్మద్ (స) అయినా మరే ఇతర ప్రవక్త అయినా ఏ భేదభావం లేకుండా, అల్లాహ్ ఆదేశించిన - ఆజ్ఞాపించిన - అవతరింపజేసిన ధర్మాన్ని - ప్రచారం చేయడం, తదుపరి స్థాపించడం అనే విద్యుక్త ధర్మాన్ని, కర్తవ్యాన్ని, విధిని తప్పనిసరిగా నెరవేర్చి తీరవలసిందే. ఈ కర్తవ్యాన్నే వారికి అప్పగించటం జరిగింది. కాబట్టి పై ఆదేశం 'ఫాబాదుల్లాహ్' యొక్క పూర్తి అర్థం, తాత్పర్యం, అవగాహన కేవలం 'అఖీముద్దీన్' (ధర్మాన్ని స్థాపించండి!) అని మాత్రమేనని స్పష్టమౌతుంది.

పైన పేర్కొన్న శుభాత్ములు (ప్రవక్తలు) ఈ ధర్మసంస్థాపనా విధిని ఎలా నెరవేర్చారనేది ఈ సందర్భంగా తెలుసుకోవటం అత్యవసరం. ఈ విధి నిర్వహణలో తమ మిషన్ అమలులో, నిరంతర కృషిలో ఒక్క క్షణమైనా వారు ఆలస్యం చేశారా? పరిస్థితుల అనుకూలతల పట్ల సమీక్షలు చేశారా? సాధ్యాసాధ్యాల మూల్యాంకనాలు - బేరీజులు వేశారా? ఆలోచనల్లో, చర్చల్లో ఒక్క క్షణమైనా వ్యర్థపర్చారా? ఈ బేరీజులు, చర్చలు, మూల్యాంకనాలు, సమీక్షల ద్వారా - అనుకూల పరిస్థితులు

ఏర్పడ్డాయని తీర్మానించుకున్న తరువాతే, ధర్మసంస్థాపనా కృషికి పూనుకున్నారా? మన బుద్ధి, వివేకాలు ఈ ప్రశ్నలకు సమాధానం ఏమైనా ఇవ్వవచ్చుగాక, కాని, ఖుర్‌ఆన్ పై అంశాలన్నింటినీ ఒక్కొక్కటిగా తృణీకరించివేస్తుంది. ప్రతి ప్రవక్త ఈ ధర్మసంస్థాపనా విధిని నిర్వహించేందుకు అత్యంత ఉత్సాహంగా, గౌరవంగా ప్రతి నిమిషాన్ని వెచ్చిస్తూ, పరిశ్రమిస్తూ కదిలారు. ఈ కృషిలో, సృష్టికర్త నుండి విజయం కోసం ఎటువంటి గ్యారంటీనీ కోరలేదు. ఈ విధి నిర్వహణలో తన పరిస్థితిని గురించి ఆలోచించడానికి కనీస సమయాన్ని కూడా వ్యర్థపరచలేదు. వారి మనస్సులో సాధ్యాసాధ్యాల ప్రశ్నే తలెత్తలేదు. పరిస్థితుల అననుకూలతలు వారి హృదయాన్ని, నోటిని ఒక దినం కూడా కట్టిపడవేయలేకపోయాయి. తత్‌భిన్నంగా ఆయా ప్రవక్తలు తమ బాధ్యతను స్వీకరించిన క్షణం నుండి, జీవితపు ఆఖరి ఘడియ వరకు తన విధి నిర్వహణను నిరంతరంగా – క్రమబద్ధంగా కొనసాగించారు.

ఈ ప్రవక్తలలో కొందరు తమ సందేశ ప్రచారంలో సఫలీకృతులయ్యారు. సత్య సందేశ ప్రచార వారసుల వర్గాన్ని తయారుచేసి ఈ ప్రపంచాన్ని వీడిపోయారు. దైవధర్మాన్ని స్థాపించే ఒక నిష్ఠాగరిష్టులైన వర్గాన్ని తయారు చేయగలిగారు. వీరిలోని మరికొందరి సందేశ వాణి ప్రజల కఠిన శిలలవంటి హృదయాలను తాకి మరీ తిరిగి వచ్చింది. వీరు దైవధర్మాన్ని స్థాపించగలిగిన వర్గాన్ని తయారు చేయలేక పోయారు. ఉదాహరణకు ప్రవక్త నూహ్ (అ) దాదాపు వేయి సంవత్సరాలు 'రాత్రింబవళ్ళు' ఈ విధి నిర్వహణ కోసం వెచ్చించారు. కాని, ఈ సుదీర్ఘ కాలంలో అత్యంత సహనంతో నిరంతరంగా చేసిన కృషి ఫలితంగా కేవలం గుప్పెడు మంది విశ్వాసులు మాత్రమే ఆయనకు లభ్యమయ్యారు. తిట్లు, శాపనార్థాలు, రాళ్ళదెబ్బలు ప్రజల నుండి బహుమానంగా ఆయనకు అందింది. ఈ బహుమానాల వర్షం రేయింబవళ్ళు ఆయన తెగ, ఆయనకు అందిస్తూనే ఉండింది. తన జీవిత కాలాన్ని ముగించి, ఈ ప్రపంచాన్ని వీడే సమయానికి సత్య సందేశం అంగీకరించిన వారి సంఖ్య కేవలం వ్రేళ్ళమీద లెక్కపెట్ట గలిగింది మాత్రమే ఉండింది. ప్రవక్త ఇబ్రాహీం (అ) తన ముదుసలి వయసు వచ్చేవరకు దైవదాస్యపు సందేశాన్ని అందించడంలో ఆయన పడిన కష్టాలు, చేసిన త్యాగాలు మన ముందు సజీవంగా ఉన్నాయి. అల్లాహ్ ధర్మాన్ని స్థాపించటానికి ఆయన చేసిన కృషి అనితర సాధ్యమైనదిగా మనకు

దర్శనమిస్తుంది. ఈ నడుము విరిగే కృషి ఫలితంగా ఆయనకు దొరికిన ప్రతిఫలపు సంఖ్య కేవలం ఆయన కుటుంబీకులు, మరికొంతమంది సత్యప్రేమికులు తప్ప మరెవ్వరూ లేరు. ప్రవక్త లూత్ (అ), హూద్ (అ), సాలెహ్ (అ), ఈసా (అ)ల కృషి దాని ఫలితాలూ పై విధంగానే ఉండాయి. ఈ పవిత్ర వ్యక్తిత్వాల బృందంలో ప్రవక్త యహ్యా (అ) లాంటివారు కూడా ఉన్నారు. వీరి తీవ్రాతితీవ్రమైన కృషి ఫలితంగా ఒక్క దైవదాసుడు కూడా వీరికి లభ్యం కాలేదు. పైగా వారు తమ తలలను బలిపెట్టవలసి వచ్చింది. మరికొందరి తలలపై రంపాలు నడపబడ్డాయి. "వయఖ్తులూన న్నబియ్యీన బిగైరి హఖ్." (ఆలి ఇమ్రాన్)

ఇక చివరి దైవ సందేశహరులు ప్రవక్త ముహమ్మద్(స) గారి నిరంతర కృషి, శ్రమలు, బాధలు, కష్టాల గురించి చరిత్ర పుటలు నిండిపోయి ఉన్నాయి. ప్రవక్తలందరికంటే ప్రవక్తశ్రీవారిపై ఉన్న బాధ్యతల బరువు కూడా ఎక్కువే. అంతేకాదు, గత ప్రవక్తల సందేశానికి శ్రోతలు కేవలం వారి తెగవారు మాత్రమే. కాని, అంతిమ ప్రవక్తశ్రీ వారి సందేశ ప్రచారం చాలా విస్తృతమైంది. సర్వమానవాళికి చెందినది. ప్రపంచం మొత్తంగా, ఆయా ప్రాంతాలల్లో, దైవధిక్కార శక్తులు, దైవేతర శక్తులు, దుర్మార్గులు, జాత్యాహంకారులు (ఒక్కమాటలో తాగూత్‌ల) ఆధిపత్యం కొనసాగుతూ ఉండేది. అయినప్పటికీ ఈ అంతులేని ప్రతికూల పరిస్థితులు ఉన్నప్పటికీ, ప్రవక్తశ్రీ వారికి సందేశహరుని బాధ్యతలు అప్పగించబడిన వెంటనే - అల్లాహ్ వైపు నుండి "ఓ ప్రవక్తా! నీకు ఆజ్ఞాపించబడుతూ ఉన్న విషయాన్ని బహిరంగంగా ఎలుగెత్తి చాటు. షిర్క్ చేసే వారిని ఏమాత్రం లెక్కచేయకు" (15:94) అనే ఆజ్ఞ ఇవ్వబడింది.

ఇవ్వబడిన ఆజ్ఞకు అనుగుణంగా ప్రవక్తశ్రీ (స) వారు మసలుకునేవారు. ఎన్ని శ్రమలు, బాధలు, కష్టాలు ఎదురైనా ... తు.చ. తప్పకుండా ఆజ్ఞాపాలన చేసేవారు. ఈ నిరంతర కృషి ఫలితం కొన్ని సంవత్సరాలలోనే స్పష్టంగా కనిపించడం ప్రారంభమయింది. సత్య సందేశ ప్రచార మధురవాణి గృహాలు, వీధులు, సభలు, గ్రామాల పొలిమేరలు దాటిపోయింది. పర్వత శిఖరాలను దాటుకుంటూ విస్తృతం, ఉన్నతం అవుతూ సాగిపోయింది. ఈ సత్య సందేశానికి బదులుగా తాయిఫ్, మక్కా నగరాలు అందించిన హృదయవిదారక సన్నివేశాలను ప్రళయదినం వరకు ఈ నగర వీధులు మరచిపోలేవు. అయినప్పటికీ, ఈ నిష్ఠాగరిష్టుడైన దైవదాసుని (స)

ప్రయత్నంలో కించిత్ మార్పు రాలేదు. ఈ ప్రతికూల పరిస్థితుల ప్రభావం ప్రవక్తశ్రీ (స)పై కనీసంగా కూడా పడలేదు, సరికదా – నిరంతరం ఈ కర్తవ్య నిర్వహణలో ఏమైనా కొరత, అశ్రద్ధ జరిగిపోయిందా? అని నిరంతరం ఆత్మావలోకనం చేసుకోవడం ప్రవక్తశ్రీ (స) వారి సత్ చరిత్రలో మనకు కనపడుతుంది. సత్య వచన ప్రచారంలో వెంట్రుకవాసి అశ్రద్ధ కూడా మనకు కనపడదు. ప్రవక్తశ్రీ (స) వారి కోరికలు, కాంక్షలు అన్నీ కూడా సత్యసందేశ ప్రచారపు కేంద్ర బిందువుపైనే ఆధారపడి ఉండేవి. ప్రజా హృదయాలలో ఈ సద్వచనాన్ని ఎలా ప్రతిష్టింపచేయాలి? అనే తపన నిరంతరం వారిని వెంటాడుతూ ఉండేది. ఏ దైవధర్మం తన ద్వారా ప్రపంచ ప్రజలకు అందించబడిందో – ఆ ధర్మాన్ని ఆ దైవదాసుల వరకు సంపూర్ణంగా అందించడంలోనే ప్రవక్తశ్రీ (స) వారికి సంతృప్తి ఉండింది. నిరంతర తపనను, అల్లాహ్ అత్యంత ప్రేమతో విమర్శిస్తూ "నీ పని కేవలం సత్య సందేశాన్ని అందించడం మాత్రమే సుమా" – ప్రతి విషయాన్ని తేటతెల్లంగా విడమర్చి చెప్పివేయడమే సుమా" అని చెప్పడం జరిగింది. ఆ తర్వాత సందేశాన్ని స్వీకరించడం లేక మానడం, ఆయా వ్యక్తులపై ఆధారపడి ఉంటుందని, ప్రవక్తశ్రీపై ఎలాంటి బాధ్యతా ఉండదని స్పష్టపరచడం జరిగింది. **"ఫ ఇన్‌తవల్లా ఫ ఇన్నమా అలైకల్ బలాగుల్ ముబీన్"** – ఫలితాలతో సంబంధం లేకుండా సందేశాన్ని ప్రజలకు అందిస్తూ ఉండు, దీని ఫలితం ఎలా ఉంటుంది? అని ఆలోచించకు అని ప్రవక్తను ఓదార్చటం జరిగింది.

> **"ఓ ప్రవక్తా! ఏ దుష్ఫలితాలను గురించి వేము వారిని భయపెడుతున్నామో వాటిలో ఒకటో అరో మేము నీవు బ్రతికి ఉండగానే చూపినా, లేదా దానికిముందే మేము నిన్ను లేపుకున్నా, ఎలా అయినాసరే వారు రావలసింది మా వైపునకే కదా! వారు చేస్తున్న దానికల్లా అల్లాహ్‌యే సాక్షి." (10:46)**

పైన పేర్కొన్న కొంతమంది ప్రవక్తల చారిత్రక సంఘటనలు, ఆలోచించే వారికి మార్గదర్శకత్వం కోసం దివ్య ఖుర్‌ఆన్‌లో పేర్కొనబడ్డాయి. పై చారిత్రక సంఘటనలు – దైవ ధర్మసంస్థాపన కోసం, సత్య ధర్మ అనుసరణ కోసం, శకునాలు చూడవలసిన పనిలేదు. పరిస్థితుల అనుకూలతలు పాటించవలసిన అవసరం లేదని స్పష్టం చేస్తున్నాయి. పరిస్థితుల అనుకూలతలు – అననుకూలతల గురించి

పట్టించుకోవలసిన అవసరమే లేదని పై సాక్ష్యాలు రుజువు చేస్తున్నాయి. సఫలతలు, విజయాలు లభించే అవకాశం ఉంటేనే ధర్మ సంస్థాపనా కృషి చేయాలనే సూత్రీకరణకు ఈ చారిత్రక ఘటనల్లో తావేలేదు. ఏ విషయమైతే మనపై 'విధి' అయిపోయిందో, ఆ విధి నెరవేర్పుకోసం ఎటువంటి పరిస్థితులలోనైనా తీవ్రాతితీవ్రమైన కృషి తప్పనిసరిగా చేయవలసివుంటుంది. లేక దైవారాధన సందేశాన్ని లేక ధర్మసంస్థాపనా కృషిని ప్రారంభించటానికి ముందు పరిస్థితుల అనుకూలతలు బేరీజు వేయటం తప్పనిసరి అయివుంటే, ప్రవక్తల ఒక పెద్ద బృందం ఈ ధర్మ సంస్థాపనం విధిని నిర్వహించి ఉండేదే కాదు. నిజం చెప్పాలంటే పరిస్థితులు పూర్తిగా పాడయిపోయి ఉన్న సమయాల్లోనే (మరో మాటలో పూర్తిగా ప్రతికూల పరిస్థితులు ఏర్పడివున్న సమయాల్లోనే) ప్రవక్తలు అల్లాహ్‌చే పంపబడేవారు. ఆ పరిస్థితులు ధర్మసంస్థాపన కోసం ఏమాత్రం అనుకూలంగా ఉండేవి కావనే విషయం అర్థం చేసుకోవాలి. పరిస్థితుల ప్రతికూలతలు తీవ్రంగా ఉన్న కాలంలోనే ఈ దైవదాసులైన ప్రవక్తలు, పరిస్థితులను కించిత్ కూడా సమీక్షించకుండానే ప్రతికూలతల సముద్రంలో తమ సందేశ నావను నడిపే ప్రయత్నం చేశారు. ఈ ప్రయత్నంలో తీరం ఎక్కడ? ఎటువైపు ఉంది? వాతావరణం ప్రశాంతంగా ఉందా? లేదా? గాలులు నావ ప్రయాణానికి అనుకూలమా? అననుకూలమా? సముద్రంలో తుఫానుల ప్రభావం ఉన్నదా? అలల తాకిడి అనుకూలంగా ఉందా? తీరం ఎంత దూరంలో ఉంది? సముద్ర మార్గంలో అడ్డంకిగా పర్వత శిలలు ఏవైనా ఉన్నాయా? లాంటి ప్రశ్నలు ప్రవక్తల ఆలోచనల్లో అస్సలు రాలేదు.

పరిస్థితుల అననుకూలతల గురించి వాదించే నేటి ముస్లిం ఉమ్మత్‌కు ఎవరు ఆదర్శంగా ఉన్నారో – ఉమ్మత్ ఎవరిని అనుసరిస్తూ ఉన్నదో స్పష్టం చేసుకోవాలి. ప్రవక్తల సత్ సంప్రదాయం, ఆదర్శం గురించి మనం పై పుటల్లో క్షుణ్ణంగా తెలుసుకున్నాం. వారి సంప్రదాయంలో ఎక్కడా ప్రతికూలతల ప్రస్తావనే లేదు అనేది కూడా మనకు స్పష్టమయింది. ఒకవేళ మనం ప్రవక్తల ఈ సత్‌సంప్రదాయాన్ని, ఆనాటి అరబ్బు ముష్రిక్కులలాగా, వారిని 'అసాతీరుల్ అవ్వలీన్' అని భావించివుంటే సరి, కాని, మనం మన ప్రవక్తల సమూహాన్ని అదృష్టవశాత్తు అలా భావించడం లేదు. మనం, ఇంకా అంతటి హీనస్థాయికి దిగజారలేదు. మనం ఇప్పటికీ ప్రవక్తల

సమూహాన్ని దైవధర్మ సంస్థాపనా కృషిలో దీపపు స్థంభాల లాగా, మీనార్లలాగానే భావిస్తున్నాం. వీరి సత్‌చరిత్రను, పవిత్ర ఆచరణను దివ్యఖుర్‌ఆన్ తన ప్రతి పేజీలోనూ మన మార్గదర్శకత్వం కోసం, ప్రస్ఫుటంగా అందించింది. ముస్లిం ఉమ్మత్‌లోని ప్రతి సభ్యుని యొక్క కర్తవ్యం, విధి అయిన ధర్మ సంస్థాపన గురించి మాటిమాటికీ హెచ్చరించింది. 'ప్రవక్తల మార్గం ఇదే సుమా!' అని స్పష్టపర్చింది.

## ప్రతికూల పరిస్థితులు కోరేదేమిటి?

విషయం ఏదైనప్పటికీ, పరిస్థితులు తమదైన ప్రభావాన్ని - స్థితిని కలిగి ఉంటాయి. మన ఆలోచనలపై ఆచరణలపై పరిస్థితుల ప్రభావం తప్పనిసరిగా ఉంటుంది. ధర్మప్రచార ఉద్యమంపై, సత్యధర్మ ఆచరణపై కూడా ఈ ప్రభావం తప్పనిసరిగా ఉంటుంది. ఈ వాదనలో నిజంగా ఎంతో కొంత వాస్తవిక దృష్టి ఉంది. అయితే, పైన పేర్కొన్న ఖుర్‌ఆన్ పంక్తుల్లో ఎక్కడ కూడా పరిస్థితుల ప్రభావం, సందేశ ప్రచారంపై ఉండనే ఉండదని ఎక్కడా చెప్పబడలేదు. అదే సమయంలో పరిస్థితుల అననుకూలతల ఆధారంగా ధర్మ సంస్థాపనా కృషిని వాయిదా వేయడం గాని, ఆపివేయడంగాని చేయకూడదు అని కూడా వివరించటం జరిగింది. ఇంకా చెప్పాలంటే, పరిస్థితుల ప్రతికూలతలు ఎంత తీవ్రంగా ఉంటాయో - అంతే తీవ్రంగా ధర్మసంస్థాపన కోసం కృషి చేయవలసి ఉంటుందని కూడా స్పష్టపర్చబడింది. బుద్ధీ, వివేకాలు కూడా ఈ విషయాన్నే అంగీకరించి తీరుతాయి -

1. ప్రవక్తల పరంపరలో ప్రతి ప్రవక్త ఆగమన కాలం ఇటువంటి ప్రతికూల పరిస్థితుల్లోనే జరిగింది. అప్పుడు పరిస్థితులు అత్యంత కఠినంగా ఉండేవి. సత్యధర్మ వెలుగు ఈ భూమిపై కనీసంగా కూడా ఉండేది కాదు. అజ్ఞానపు చీకటి రాజ్యమేలుతూ ఉండేది. దైవధిక్కార శక్తుల నల్లటి కారుమబ్బులే కమ్ముకొని ఉండేవి. సత్యధర్మ సందేశం విజయవంతం కావడం అస్సలు సాధ్యమయ్యే పరిస్థితే ఉండేది కాదు. ఇటువంటి భయంకర పరిస్థితుల్లోనే సత్యధర్మ ప్రచారపు దివ్వెను వెలిగించే అవసరం ఉంటుంది. అజ్ఞానపు తిమిరంలోనే జ్ఞానజ్యోతిని వెలిగించే కృషి చేయవలసి ఉంటుంది. పరిస్థితులు ఎంత కఠినంగా ఉంటాయో - అజ్ఞానపు చీకటి ఎంత దట్టంగా అలుముకుని ఉంటుందో - అదే స్థాయిలో వెలుగు దివ్వెలు వెలిగించే కృషి అవసరమౌతుంది.

అల్లాహ్ అభీష్టం – ఇష్టం రెండు కూడా ఈ పరిస్థితుల్లో జరిపే తీవ్ర కృషికే సంతుష్టమౌతాయి. తన దాసులు ఈ భయానక పరిస్థితుల మార్పుకోసం ఏ మేరకు కృషిచేయాలో, ఆ మేరకు కృషి చేయడాన్ని సృష్టికర్త అల్లాహ్ ఇష్టపడతాడు. ఎందుకంటే, ఈ అజ్ఞానపు, దుర్మార్గపు అంధకారం స్థిరంగా ఉండటం లేక మరింతగా పెరగడం అల్లాహ్‌కు ఏమాత్రం ఇష్టం ఉండదు.

2. అల్లాహ్ ధర్మం సమస్త మానవాళికి మార్గదర్శకమనీ – విజ్ఞానపు వెలుగు అనీ – మన బుద్ధివివేకాలు స్వయంగా అంగీకరిస్తాయి. ఎప్పుడైతే మనిషి లేక సమాజం ఎంతటి తీవ్రస్థాయిలో మార్గ భ్రష్టత్వానికి లోనై ఉంటాయో – అదేస్థాయిలో సమాజానికి, లేక మనిషికి విజ్ఞానపు వెలుగులు, రుజుమార్గం అవసరమౌతాయి. సత్యధర్మ ప్రచారానికి ఇంతకంటే అనుకూలమైన పరిస్థితులు వేరే ఉండగలవా? అజ్ఞానంలో, దుర్మార్గంలో నిండా కూరుకొనిపోయి ఉన్న మనషులకే సహకారం, సహాయం, సందేశం, జ్ఞానాల అవసరం ఉంటుంది. చీకటి ప్రేమించబడుతున్న వేళ, దుర్మార్గం కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తున్న వేళ, అజ్ఞానపు చిమ్మచీకట్లు మనిషిని కమ్ముకొనివున్న వేళ, ఎవరైతే మానవత్వాన్ని మేల్కొలపటానికి నియమింపబడ్డారో, వారు ఆ కాలాన్ని మౌనంగా భరిస్తూ చూస్తూ, సహిస్తూ ఉండనేలేరు. వారు విశ్రాంతిని తమపై నిషేధించుకుంటారు. కార్యరంగంలో ధీరోదాత్తులుగా ఉరుకుతారు. బిగ్గరగా మరింత బిగ్గరగా గొంతు నరాలు చిట్లిపోయేంత బిగ్గరగా సత్యధర్మాన్ని, దాని సందేశాన్ని వినిపిస్తారు. సాధారణ పరిస్థితులలో వారు విశ్రాంతి తీసుకోవడం గురించి ఆలోచించగలరేమో గాని, ఈ క్లిష్ట పరిస్థితులలో వారు విశ్రాంతి గురించి ఏమాత్రం ఆలోచించరు. పరిస్థితుల భీకర తుఫాను చుట్టుముట్టి ఉన్నప్పుడు ఎవరైనా అందమైన కలలు కంటూ తియ్యటి నిద్రకు ఉపక్రమించడం న్యాయమౌతుందా? ఈ ధోరణి సమాజానికి ఆరోగ్యకరం అస్సలు అవుతుందా?

పై వివరణ వల్ల, ప్రజలు ఏ కాలంలోనైనా, సత్యధర్మం నుండి ఎంతగా అపరిచితులై ఉంటారో, ఎంతగా భౌతిక లాలసతల వ్యాపారులుగా మారిపోయి ఉంటారో, దైవధిక్కార శక్తులు ఎంతగా విస్తరించి పరిపాలనా వ్యవస్థపై పట్టుబిగించి ఉంటాయో – సత్యధర్మ ధ్వజవాహకులైన దైవదాసులు అదే స్థాయిలో అల్లాహ్ ధర్మాన్ని స్థాపించే కృషిని విధిగా, కర్తవ్యంగా, నిష్ఠగా, అత్యంత అవసరంగా, కడు

దీక్షగా కొనసాగించవలసి ఉంటుంది. ప్రస్తుత పరిస్థితులలో ప్రపంచం దుర్మార్గం - అసత్యమార్గాలపై పరుగులు పెట్టడం నిజమే అయితే, దైవాదేశం దానికి కర్ణ కఠోరంగా ఉండి వినడానికే ఇష్టపడని పరిస్థితికి లోనైవుంటే, ఈ పరిస్థితులలోనే దైవధర్మ సందేశాన్ని మరింత బలంగా వినిపించడం అత్యవసరమౌతుంది. ధర్మసంస్థాపనా విధిని కడు దీక్షతో కొనసాగించటం పరమావధిగా భావించబడుతుంది.

ఇదే విషయాన్ని మరో కోణంలో కూడా ఆలోచించి చూడాలి. ధర్మసంస్థాపనా విధి యొక్క సాధ్యాసాధ్యాల గురించి, జయాపజయాల గురించి చర్చించడం అస్సలు కుదరని పని. ఎందుకంటే, ఎట్టి పరిస్థితిలోనూ, ధర్మసంస్థాపనా విధి అవిశ్రాంతంగా చేయవలసి ఉంటుంది. చివరికి మన కళ్ళముందు ఈ కృషి వ్యర్థమై పోతున్నట్టు కనపిస్తున్నా - అపజయం మన కంటి ముందు దర్శనమిస్తున్నా కూడా ఈ కృషి నుండి మరలడం సముచితం కాదు. దైవధర్మ ప్రచార సందేశ ఉద్యమం, ప్రపంచంలోని ఇతర ఉద్యమాలు లేక స్కీముల వంటిది కాదు. ఇతర ఉద్యమాలలో లేక స్కీములలో విజయం పొందడమే లక్ష్యంగా ఉంటుంది. కృషి ఫలించడం లేదని తెలిసిన వెంటనే ఉద్యమం ఆపివేయబడుతుంది ... స్కీము నిలిపివేయబడుతుంది లేక వాయిదా వేసుకునే అవకాశమూ ఉంది. కాని, ఇస్లామీయ ఉద్యమంలో అలా చేయడం కుదరదు సరికదా సాధ్యమూ కాదు. ఇక్కడ ఒక వ్యక్తి తన్ను తాను ముస్లింగా అంగీకరించిన వెంటనే అతనిపై ధర్మసంస్థాపనా కృషి విధి అయిపోతుంది. అతని జీవితం ఈ లక్ష్యం కోసం అంకితమై (వక్ఫ్ అయి) పోతుంది. అల్లాహ్‌ను విశ్వసించడం - ప్రేమించడం అంటేనే సహజంగా అల్లాహ్ ఆదేశాలను తనపై విధి చేసుకోవాలి అని అర్థం. తన చుట్టూ ఉన్న సమాజంపై, ఈ దైవాదేశాలే అమలు కావాలని అభిలషించాలి. అందుకోసం నిరంతరం ప్రతి క్షణం శ్రమించాలి. అంతేకాదు, అల్లాహ్‌కు ఇష్టంలేని ప్రతి రాతిని తొలగించివేయడానికి, తుడిచివేయడానికి పూనుకోవాలి. ప్రవక్త ముహమ్మద్ (స) చెప్పినట్లుగా, నీటికి నిప్పుకు ఎలా పొసగదో - అదేవిధంగా విశ్వాసం మరియు చెడులకు సయోధ్య కూడా సాధ్యం కాదు. ఈ విధంగా చెడును తొలగించి పారేయడం, మంచిని దాని స్థానంలో స్థాపించడం అనే కర్తవ్యం, ధర్మసంస్థాపనకు పర్యాయపదం మాత్రమేనని గుర్తించాలి. ఈ విషయం ఇస్లాంకు భిన్నమైనది కాదని తెలుసుకోవాలి. ఈ కర్తవ్యమే ఇస్లాం యొక్క ఆత్మ మరియు

గుండెకాయని గుర్తించాలి. హృదయ స్పందనలు లేని ప్రాణి జీవించిఉందని చెప్పడం సాధ్యమే కాదు. అదేవిధంగా ఒక వ్యక్తి విశ్వాసి అయి వుండీ, అతని హృదయంలో ధర్మసంస్థాపనా తపన లేకపోతే అతని ఆచరణలో ధర్మస్థాపనా కృషి లేకపోతే అతను విశ్వాసిగా నిర్జీవుడని భావించవలసి ఉంటుంది. ఈ స్థితి ఒక విశ్వాసికి అత్యంత దయనీయమైనదని తెలుసుకోవాలి. తన జీవిత లక్ష్యం నుండి పలాయన మంత్రం పఠించే వ్యక్తిగా ముద్రవేయాలి. ఈ స్థితిలో ఒక విశ్వాసి ముస్లింగా తన ఉనికిని తాను కోల్పోయిన వాడౌతాడు. గ్రంథవహులైన యూదులు, క్రైస్తవులకు సంబంధించి దివ్య ఖుర్ఆన్ ఈ విషయంగా తెలియపరుస్తూ "మీరు తౌరాతు మరియు ఇంజీలు గ్రంథాలను జీవితంలో స్థాపించుకోనంత వరకు మీరు సత్యంపై ఉన్నట్టు కాదు. మీ ఉనికి కేవలం ఒక ఉనికి తప్ప మరేమీ కాద"ని స్పష్టం చేసింది. కనుక నేటి కాలంలో ధర్మసంస్థాపన సాధ్యం కాదని చెప్పడం అంటే – ఒక ముస్లింగా మనగలగడం సాధ్యం కాదని చెప్పడంతో సమానమే అవుతుంది. అదేవిధంగా ప్రపంచ పరిస్థితులు ధర్మసంస్థాపనకు అనుకూలంగా లేవని చెప్పడం కూడా ఇస్లామీయ జీవన విధానం నుండి చేతులు దులుపుకోవడంగా భావించవలసి ఉంటుంది.

## గుణపాఠం

ఏ పని అయితే జీవితపు అసలైన విధి – కర్తవ్యం అయివుంటుందో – ఆ విషయం, పరిస్థితుల అనుకూలతల చర్చకు అతీతంగా ఉంటుంది. ఇది కేవలం ముస్లిం లేక ఇస్లాంలకు సంబంధించిన సూత్రీకరణ కాదు. ఈ సూత్రం సార్వజనీనమైనది. అన్ని ఉద్యమాలకు వర్తించేది కూడాను. ఈ విషయాన్ని ఒక వైపున ప్రవక్తలు, వారి సహచరులు ఆచరణాత్మకంగా అమలుచేసి చూపించగా – మరోవైపున దైవతిరస్కారులు వారి సహచరులు కూడా ఇదే నియమ నిబద్ధతలను కనబర్చారు. వారు కూడా తమ జీవిత లక్ష్యం – ధ్యేయాల పట్ల కడు జాగ్రత్త వహించారు. ఈ లక్ష్యాలను తమ దృష్టి నుండి ఏనాడూ దూరం చేయలేదు. పరిస్థితుల దయాదాక్షిణ్యాలపై వారు ఏనాడూ ఆధారపడలేదు. సామాజిక వాతావరణం అనుకూలంగా ఉంటే సంతోషించినవారు – అననుకూలతల వాతావరణంలో కూడా ఏనాడూ వెనకడుగు వేయలేదు. తమ ఆశయాల ఆవిష్కరణల కోసం నిరంతరం

శ్రమించారు. తమ జీవితం మొత్తాన్ని వెచ్చించి పోరాడారు. వారి చరిత్ర మొత్తం, వారి ఆచరణాత్మక సాక్షిగా నేటికీ చరిత్రలో నిలిచి ఉంది.

కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడు, సిద్ధాంతకర్త అయిన కారల్ మార్క్స్ అనుచరుల చరిత్రను ఉదాహరణగా తీసుకొని చూడండి. మార్క్సుకు కొన్ని ప్రత్యేకమైన ఆలోచనలు, సిద్ధాంతాలు ఉండేవి. ఆ సిద్ధాంతాలపై, భావాలపై ఆయనకు అంతులేని విశ్వాసం ఉండేది. ఈ సిద్ధాంత స్థాపననే మానవ సమస్యల పరిష్కారంగా ఆయన సంపూర్ణంగా విశ్వసించాడు. ఈ కారణంగా ఈ లక్ష్యాన్నే తన మత ధ్యేయంగా మలచుకొని ఏకోన్ముఖుడై కార్యరంగంలో నిమగ్నుడయ్యాడు. ఈ కృషి మొదలుపెట్టబడి, ఆ తరువాత కొనసాగింది, ఆనాటి అత్యంత బలమైన, శక్తివంతమైన రష్యా జార్ చక్రవర్తి పాలనలోనే అనేది గమనించాలి. సోషలిస్టు వ్యవస్థ స్థాపనకు, ఆ పరిస్థితులు ఏమాత్రం అనుకూలంగా లేవనేది కూడా గమనార్హమే. జార్ చక్రవర్తి దుష్ట దుర్మార్గ పాలనకు వ్యతిరేకంగా సాగిన ఈ పోరాట మార్గం మొత్తంగా అననుకూలతలతో కంటకప్రాయంగా ఉండింది. కాని, సోషలిస్టు సూత్రాలపై సమాజాన్ని వ్యవస్థీకృతం చేయాలనే కృత నిశ్చయులైవున్న ఈ కార్యకర్తలు, కష్టాల కడలిని, ప్రతికూల పరిస్థితులను, ఆపదలను కనీసంగా కూడా లెక్కచేయలేదు. తమను చుట్టిముట్టివున్న ఈ అననుకూలతల వాతావరణాన్ని రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిస్థితులను వారు అస్సలు పట్టించుకోనేలేదు. జార్ చక్రవర్తి దౌర్జన్యాలు - సైనిక పటాలాలు ఉద్యమకారులపై విరుచుకుపడ్డాయి. అంతులేని హింసను కొనసాగించాయి. అనేకమందిని హతమార్చారు. మిగిలినవారిని సైబీరియా మంచు నరకంలో విసిరివేశారు. 'సోషలిస్టు విశ్వాసులు' చవిచూడని బాధలు లేవు. పడని కష్టాలూ లేవు. ఈ క్రమం సంవత్సరాల తరబడి కొనసాగింది. అయినప్పటికీ, ఎంతటి నిర్బంధమైనా, బాధలైనా - వారి దీక్షను, నిబద్ధతను కదిలించలేకపోయాయి. ఈ కమ్యూనిస్టు ప్రేమికులు బాధల తుఫానును, కష్టాల కడలి అలలను ఎదుర్కొంటూనే ఎదురీదుతూనే తమ ధ్యేయం వైపునకు ముందుకు ... మునుముందుకు... పదండి పోదాం పైపైకి అంటూ నడిచారు.

ఈ కమ్యూనిస్టులే ఆ తరువాత జార్ చక్రవర్తి పరిపాలనకు మంగళం పాడి సోషలిస్టు వ్యవస్థను స్థాపించారు. బాహ్యా పోరాటం అయితే ముగిసింది కాని,

సోషలిస్టుల్లో అంతర్గత పోరాటం - వైరుధ్యం మొదలయ్యింది. మరీ ముఖ్యంగా లెనిన్ మరణానంతరం బోల్షివిక్ పార్టీ పగ్గాలు స్టాలిన్ చేతుల్లోకి వెళ్ళాయి. స్టాలిన్ చేతిలో సోషలిస్టు వ్యవస్థ తన అంతర్జాతీయ స్వభావాన్ని క్రమక్రమంగా కోల్పోతూ ... జాతీయ సోషలిజంగా కుంచించుకుపోసాగింది. ఈ ప్రయాణం సోషలిస్టు సిద్ధాంతకర్త మార్క్స్ సూత్రీకరణలకు పూర్తిగా విరుద్ధమైనది. ఈ కారణంగానే ట్రాటిస్కీ, స్టాలిన్‌ను వ్యతిరేకించాడు. మార్క్స్ అంతర్జాతీయతను పార్టీకి ఆత్మగా మలిచే కృషికి పూనుకున్నాడు. ట్రాటీస్కీని తీవ్రంగా వ్యతిరేకించిన స్టాలిన్, ట్రాటీస్కీని పాలనాధికార వ్యవస్థ నుండి తిలోదకం పలికాడు. కమ్యూనిస్టు రహస్య పోలీసులు ట్రాటిస్కీని, అతని అనుయాయులను తమ కఠిన నిఘాకు గురిచేశారు. అతని నోటికి తాళాలు బిగించబడ్డాయి. అయినప్పటికీ, ఏ సిద్ధాంతాన్ని ట్రాటిస్కీ నిజమైనదని విశ్వసించాడో - ఏ సిద్ధాంతం పునాదులపై ప్రజాసమస్యలు పరిష్కరించబడతాయని నమ్మాడో దాన్ని వీడడానికి ఇష్టపడలేదు. సరికదా, దాని ప్రచారాన్ని కూడా వదలలేదు. రహస్యంగా అమెరికా చేరుకొని, అక్కడి నుండి తన అంతర్జాతీయ సోషలిస్టు సిద్ధాంతాన్ని ప్రచారం చేయడం మొదలెట్టాడు. తన జీవిత లక్ష్య సాధనకోసం తపన పడటం, కృషి చేయడం మొదలెట్టాడు. అయినప్పటికీ స్టాలిన్ ఏజంట్లు అక్కడికి కూడా చేరుకున్నారు. అనేక కుట్రలు పన్నారు. చివరికి అతనికి మరణాన్ని పాయసంగా అందించారు. ఈ "మార్క్సిస్టు విశ్వాసి' తను నమ్మిన సిద్ధాంతం కోసం, అత్యంత సహనంతో ఆమరణాన్ని ఆమోదించాడు. తాను నమ్మిన లక్ష్యం - ధ్యేయాల కోసం తన్ను తాను బలిపెట్టుకున్నాడు.

ఇక రెండవ ప్రపంచ యుద్ధానికి కారకులైన జర్మనీ, జపాన్ ధరిత్రులను గమనించండి. జాత్యాహంకార ప్రతినిధులు అయిన ఆ రాజ్యాధినేతలు - తమ జీవిత లక్ష్యాల కోసం సర్వస్వాన్నీ పణంగా పెట్టి పోరాడారు. తాము నమ్మిన 'విశ్వసించిన' దానికోసం, దాని విజయం కోసం అహరహం కృషిచేశారు. తమకు ఎదురుపడిన జాతులన్నింటినీ అణచివేసేందుకు, కత్తి మొనకు ఎర చేసేందుకు సిద్ధపడ్డారు. యుద్ధ మైదానంలో పై రెండు జాతులు వరదలాగా శత్రు సైన్యాలను ముంచెత్తాయి. కేవలం కొన్ని వారాలలో వేలాది మైళ్ళ భూభాగాలను హస్తగతం చేసుకున్నారు. కాని, అదృష్టం తిరగబడిన కారణంగా, ఎంతటి వేగంగా ముందుకు

సాగారో – అంతే వేగంతో వెనక్కి మరలవలసి వచ్చింది. అంతేకాదు, వీరి సైన్యాలపై భీకరమైన దాడులు జరిగాయి. సర్వం కోల్పోయే పరిస్థితి ఎదురైంది. అయినా ఈ రెండు జాతుల యువకులు తమ్ము తాము మృత్యుముఖంలోకి పంపడానికి సంతోషంగా ముందుకు వచ్చారు. తమ లక్ష్యం – ధ్యేయాల కోసం శరీరానికి బాంబులు కట్టుకొని విమానాల నుండి శత్రు సైనికుల మధ్య దూకి వారిని హతమార్చారు. విమానాల నిండా బాంబులు నింపుకొని వాటిని శత్రుసైనికుల ఓడలతో ఢీకొట్టారు. యుద్ధాల కిరాతక చరిత్రలో 'ఆత్మాహుతి దాడి' అనే కొత్త పదాన్ని అదనంగా చేర్చారు. చివరికి దైవశాసనం వీరిని పూర్తిగా ఓడించి వేసినపుడు, తమ్ము తాము దేవతలుగా మలుచుకోవడానికి, యుద్ధరంగంలో పోరాడుతున్న తమ జాతివారికి ఆత్మపర సహాయకులుగా మారడానికి సామూహిక ఆత్మహత్యలు చేసుకున్నారు.

పైన వివరించిన జాతుల ఆత్మ త్యాగాలకు ఎటువంటి భవిష్యత్తు లేదని మనకు తెలుసు. వీరి త్యాగాలకు, బలిదానాలకు మరణం తర్వాత ఎటువంటి ప్రయోజనం లభించదనీ మనకు తెలుసు. వీరి త్యాగాలకు కేవలం, ప్రాపంచిక, భౌతిక ప్రయోజనాలే కారణాలుగా ఉన్నాయి. అయితే ఈ చారిత్రక సంఘటనల నుండి మనం నేర్చుకోవలసిన గుణపాఠాలు ఏవి? కేవలం భౌతిక ప్రయోజనాల కోసం మాత్రమే – ఈ జాతులు ఇంతటి త్యాగాలు, బలిదానాల ప్రదర్శనకు సిద్ధపడితే – సృష్టికర్త అల్లాహ్ అభీష్టం నెరవేర్చుకోసం, మరణానంతర సాఫల్యం కోసం మనం (విశ్వాసులం) ఎంత తీవ్రమైన కృషి చేయాలి? దైవధిక్కార, సత్యతిరస్కార వ్యవస్థ (తాగూత్)పై వీరికి ఉన్న విశ్వాసపు స్థాయి, మన దైవవిశ్వాసంలో లేకుండా పోయిందేం? అసత్య సాక్షులు ప్రదర్శించిన ధైర్యసాహసాలు, సత్యసాక్షులు ఎందుకు ప్రదర్శించలేకపోతున్నారు? దైవ తిరస్కారులు తమ జీవిత లక్ష్యానికి యిచ్చిన ప్రాముఖ్యత – ప్రాధాన్యతలు, సత్యప్రియులు తమ జీవిత లక్ష్యానికి ఎందుకు ఇవ్వలేకపోతున్నారు. ప్రవక్తల త్యాగాలను, తీవ్రమైన కృషిని 'ప్రవక్తతత్వం'లో భాగంగా చెప్పి మనల్ని మినహాయించుకొనే వాదనలు చేయవచ్చు. కాని, పై దైవతిరస్కారుల త్యాగాలకు, వారు ప్రదర్శించిన ధైర్య సాహసాలకు, సాధించిన అద్భుతాలకు ఏం సమాధానం చెప్పగలం. సాధ్యాసాధ్యాల గురించి, అనుకూల ప్రతికూల పరిస్థితుల గురించి చర్చించేముందు, కనీస గుణపాఠం గ్రహించదగిన పై చారిత్రక సంఘటనలను

మనం మననం చేసుకొని ఉండవలసింది కదా! కనీసం వీరి నుండి జీవిత లక్ష్యాన్ని సాధించుకొనే పద్ధతిని నేర్చుకొని ఉండవలసిందికదా! దురదృష్టవశాత్తు మనం ఈ పనిని కూడా చేయలేక పోయాం. ఎవరి జీవిత లక్ష్యం కేవలం భౌతికమైనదో, పరిమితమైనదో, వారు ఆ లక్ష్య సాధనకోసం సర్వం ఒడ్డి పోరాడుతున్నారు. కాని, ఎవరి జీవిత లక్ష్యం మహోన్నతమైనదో, అత్యంత విశాలమైనదో, అజరామరమైన ఇహపర సాఫల్యం అందించగలదో వారు మాత్రం, సాధ్యాసాధ్యాల – పరిస్థితుల అనుకూలతల చర్చలు చేస్తూ సమయాన్ని వ్యర్థపర్చుకుంటున్నారు. “నా నమాజ్, నా త్యాగాలు, నా జీవితం, నా మరణం సమస్తం అల్లాహ్ కోసం మాత్రమే” అని ప్రకటించిన ఈ సందేశప్రచార సంఘం (జమాఅత్) ఇంతటి హీన స్థితికి ఎందుకు దిగజారింది? ఒక గ్రుడ్డివాడు సైతం వెతుక్కుంటూ, తడుముకుంటూ తన దారిని తెలుసుకుంటాడే! విశ్వాసపు వెలుగు, జ్ఞానకాంతుల నయనాలు గల ఈ ఉమ్మత్ ఈ ప్రయత్నం ఎందుకు చేయటం లేదు!?

## అత్యుత్సాహం - దుందుడుకు వాదపు ఎత్తిపొడుపు

పై సుదీర్ఘ వివరణ తర్వాత, విధి గావించబడిన జీవిత లక్ష్య సాధనకు, పరిస్థితుల సానుకూలతల గురించి చర్చించటానికి ఆస్కారమే లేదని రుజువు అయింది. విశ్వాసపు స్థాయికి అభిప్రాయాన్ని భరించడమే వీలులేదు. తిరస్కార వ్యవస్థ కూడా ఈ అభిప్రాయాన్ని ఆమోదించదు. పై సుదీర్ఘ వివరణ తర్వాత కూడా ఎవరైనా ప్రతికూలతల గురించి, వాటి ప్రభావం గురించి వాదిస్తే ... మాట్లాడితే అతణ్ణి కేవలం అవకాశవాదపు ఆలోచనలు గల వానిగా పరిగణించవలసి ఉంటుంది. అయితే, ఈ అవకాశవాదుల మేధావివర్గం, పై వివరణ మొత్తాన్ని ‘అతి ఉత్సాహపు వాదం’ గానో, ‘దుందుడుకు ప్రతిపాదనలు’గానో విమర్శించవచ్చు. పై వివరణలు నేటి ప్రపంచ పరిస్థితులకు పొసగనివని సూత్రీకరించవచ్చు. నిజంగా, ఈ అవకాశవాద మేధావివర్గపు విమర్శలో నిజం ఉండి ఉంటే, మనం తప్పనిసరిగా, సంతోషంగా ఆమోదించి తీరవలసిందే. ఎందుకంటే, బాధ్యతల ఈ బరువును మోసుకొని, ప్రమాదభరితమైన దారిలో పయనించడం ఎవరికి మాత్రం ఇష్టంగా ఉంటుంది? అయితే దురదృష్టవశాత్తు మనకు ఆ అవకాశం లేదు. ఎందుకంటే, పై మేధావుల వాదన అంగీకరించడం ద్వారా మనం మరో లోతైన ప్రమాదంలో పడిపోయే ప్రమాదం

ఉంది. అదేమిటంటే; 'ఈ విధంగా ఆచరణ సాధ్యంకాని, బుద్ధివివేకాలచే నిరంతరం విమర్శించబడే ఈ ధర్మాన్ని (ఇస్లాంను) అస్సలు ఆమోదించాల్సిన అవసరం ఏముంది? ఒక వ్యక్తి ఒక ధర్మాన్ని పరమసత్యంగా అంగీకరిస్తూ ఉండీ, దానిని అమలుపర్చే వాగ్దానం కూడా చేస్తూ ఉండివుంటే – ఆ వ్యక్తి పూర్తిజెయ్యడంతో అవసరమైతే, అతని ధర్మం కోరితే అగ్ని గుండంలో సైతం నిర్భయంగా దూకడానికి సిద్ధపడాలి. అలాకాక, ఆ ధర్మం కోరిన విషయాలను వింటూ, అంగీకరిస్తూ, ఆ తర్వాత వాటిని నిర్లక్ష్యపరుస్తూ ఉండి, ఆ విషయాలను అతి ఉత్సాహపూరితమైనవనీ, దుందుడుకు వాదమనీ భావించడం సాధ్యం కాదు. కనుక, ధర్మసంబంధ విధివిధానాలు ఆచరణలు వగైరాల గురించి చర్చించడానికి ముందు నిజాయితీగా 'నా పొజిషన్ ఏమిటి?' అని తెల్చుకోవడం అత్యంత అవసరం.

అయినప్పటికీ పై విమర్శను కూడా నిజాయితీగానే స్వీకరించి నిజంగా మనం అత్యుత్సాహానికి, ఆవేశానికి గురై ఉన్నామా? ఉత్సాహం, ఆవేశాలకు మన జీవితంలో అస్సలు స్థానమే ఉండకూడదా? మొదటి ప్రశ్నకు మరలా జవాబు ఇవ్వవలసిన అవసరమే లేదు. ఇప్పటి వరకు జరిగిన చర్చ మొత్తంలో ఈ విమర్శలో పసలేదని తేటతెల్లం అయిపోయింది. దానికి అవసరమైన రుజువులు, సాక్ష్యాలు, చారిత్రకంగా సహేతుకంగా ముందుంచడం జరిగింది. ఇక రెండవ ప్రశ్నకు; కొంచెం ఆలోచించే వారికి దాని సమాధానం ఇట్టే లభించగలదు. ప్రపంచ వ్యాప్తంగా ఉవ్వెత్తున లేచిన కొనసాగిన ఉద్యమాలు, ఏ విధంగా కొనసాగాయో సమీక్షించి చూడవలసి ఉంది. ఈ ఉద్యమాలు కేవలం సిద్ధాంతం, భావజాలం పునాదులపైనే ఉవ్వెత్తున లేచాయా? లేక వాటి వెనుక ఆవేశం – ఉత్సాహాలు ఇంధనంగా పనిచేశాయా? పరిశీలించి చూడగా ఏ ఉద్యమమైనా నిస్సందేహంగా విజయం సాధించడానికి బుద్ధీవివేకాలు, తాత్విక భావజాలాలతో పాటు ఆవేశం, ఉత్సాహం కూడా అవసరమని స్పష్టంగా తెలుస్తుంది. ఏ విధంగా ఉద్యమానికి తాత్వికపరమైన ప్రశాంత ఆలోచనలు అవసరమో అదేవిధంగా ఆవేశం, ఉత్సాహం ఉరకలు వేసే వేడినెత్తురు కూడా అవసరమే అవుతుంది. అదేవిధంగా దేనికి ఉన్న ప్రాముఖ్యతలు దానికి తప్పనిసరిగా ఉంటాయి. అంతేకాక, ఎప్పుడైనా ప్రశాంత చిత్తంతో తాత్వికంగా, బుద్ధీవివేకాలతో పరిష్కరించవలసిన విషయాలను ఆవేశం, ఉత్సాహాల చేతికి అందిస్తే అక్కడ విజయం కాస్తా పరాజయంగా

మారిపోతుందని గుర్తించాలి. బుద్ధి, తాత్విక భావజాలాల మరియు ఆవేశ-ఉత్సాహాల సంబంధం ఈ క్రింది విధంగా ఉంటుంది : నిస్సందేహంగా బుద్ధి-తాత్విక భావజాలాలే జీవిత లక్ష్యాన్ని నిర్దేశిస్తాయి. పరిశీలించి, పరిశోధించి, మనిషి ఏ పనిని చేయాలో, ఏది చేయకూడదో నిర్వచించేవి బుద్ధి భావజాలాలే. ఈ పనులలో కూడా మంచి పనులు ఏవి? వాటి స్థాయి భేదాలు ఏమిటి? అనేది కూడా బుద్ధి-భావజాలాలే నిర్ణయిస్తాయి. ఒకసారి ఈ నిర్ణయం జరిగిపోతే, ఆ విషయాలను తన జీవిత లక్ష్యంగా స్వీకరించటం మనిషికి తప్పనిసరి అవుతుంది. తప్పనిసరి మాత్రమే కాదు, తన జీవితపు పరుగు పందెం మొత్తంగా ఆ లక్ష్యం కోసం మాత్రమే కొనసాగించాలి. ఈ లక్ష్య నిర్దేశనలో ఆవేశానికి, ఉత్సాహానికి ఏమాత్రం చోటు కల్పించనే కూడదు. ప్రశాంతంగా ఆలోచించి, పరిశీలించి, పరిశోధించి బుద్ధి-వివేకాలు-తాత్విక భావజాలాలతో ఒక జీవిత లక్ష్యాన్ని నిర్దేశించుకున్న తరువాత, ఇప్పుడు ఆ లక్ష్యాన్ని ఛేదించడానికి ఉత్సాహం, ఆవేశాలను ప్రవేశపెట్టడం తప్పనిసరి అవసరమౌతుంది. ఎందుకంటే నిర్దేశించుకున్న లక్ష్యం వైపునకు అడుగులు వేయడం కేవలం బుద్ధి-భావజాలాలకు సాధ్యం కాదు. ఎప్పటివరకైతే ఉత్సాహం-ఆవేశాల సహకారం దానికి దొరకదో అప్పటి వరకు అది తన గమ్యాన్ని చేరుకోవడం సాధ్యం కాదు. కొన్ని సందర్భాలలో ముఖ్యంగా కార్యాచరణలో ఉత్సాహం-ఆవేశాలు, బుద్ధి-భావజాలాలపై పైచేయి సాధించటం కూడా జరుగుతుంది. ఉత్తమ లక్ష్యాల సాధనకు కార్యకర్తల మనస్సుల్లో, ఆలోచనల్లో - ఆవేశం, ఉత్సాహం ఉరకలు వేయించకుండా ఉద్యమం ఒక్కడుగు కూడా ముందుకు సాగడం సాధ్యం కాదు. ఈ ఉత్సాహం-ఆవేశాలు ప్రభావం చూపనంతవరకు మనిషిలోని ఆచరణాశక్తి నిద్రపోతూ ఉంటుంది. ఒక్కమాటలో బుద్ధి-భావజాలాలు-ఇంజన్‌ను, రైలు పట్టాలను తయారుచేసి దిశను నిర్దేశిస్తాయి. అయితే ఈ ఇంజన్‌లో ఉత్సాహం-ఆవేశాలు 'స్టీమ్‌శక్తి' లాగా పనిచేస్తూ ఇంజనును పరుగుపెట్టిస్తాయి. మానవ జీవన వ్యవస్థ నిర్మాణంలో ప్రధాన ధ్యేయాల సాధనలో ఉత్సాహం-ఆవేశాల పాత్ర అత్యంత ప్రధానమైనదే కాదు, అత్యంత సహజమైనది కూడా. ఈ సహజత్వాన్ని బుద్ధి-భావజాలాలు ఎన్నడూ వ్యతిరేకించవు. సరికదా, దానిని స్వాగతిస్తాయి. కనుక, 'అవకాశవాద మేధావి వర్గం' చేస్తున్న విమర్శల్లో ఏమాత్రం పసలేదు.

బుద్ధి–భావజాలాలకు, ఉత్సాహం–ఆవేశాలకు మధ్యనున్న ఈ వాస్తవిక సంబంధాన్ని అర్థం చేసుకొని చూడండి. బుద్ధి–భావజాలాలు, పూర్తి సంతృప్తి, ప్రశాంతతలతో అల్లాహ్ ధర్మాన్ని అనుసరించడం – ఆచరించడం జీవిత కర్తవ్యంగా నిర్ణయించిన తర్వాత – ఈ జీవిత లక్ష్యాన్ని ఆచరణలో పెట్టడానికి, దానిని పరిపూర్తి చేయడానికి ఉత్సాహం–ఆవేశాలు తమ సంపూర్ణ శక్తిని వినియోగిస్తే అది 'దుందుడుకు అతివాదం' ఎలా అవుతుంది? కనుక, ఇస్లాంను విశ్వసించడం, ధర్మసంస్థాపనను తన జీవిత లక్ష్యంగా చేసుకోవడం జరిగిన తర్వాత కూడా, ఆ లక్ష్యసాధన కోసం లేచి నిలబడకపోవడం, లేక నిర్లక్ష్యపర్చడం, లేక సుస్తీ ప్రదర్శించడం మేధావితనం అనిపించుకోదు. సరికదా, మేధో వ్యతిరేకమైన చర్య అవుతుంది. బుద్ధి, ఆలోచనల పేరుతో, బుద్ధి ఆలోచనలను అవమానించడంగా భావించవలసి ఉంటుంది.

## తప్పుడు వైఖరికి కారణాలు

ధర్మసంస్థాపనా విషయానికి సంబంధించిన అన్ని విషయాలు ప్రస్ఫుటమయిన తరువాత కూడా, ఒక పెద్ద సున్నితమైన ప్రశ్న మనలో ఉత్పన్నమవుతుంది. అదేమిటంటే, విషయం ఇంత స్పష్టంగా ఉన్నప్పటికీ ప్రజలు పరిస్థితుల అనుకూలతల చర్చలు ఎందుకు చేస్తున్నారు? ఈ అనుకూల–ప్రతికూల భావజాలాలు వీరి మెదళ్ళలోకి ఎక్కడి నుండి ప్రవేశించాయి? సిసలయిన జవాబు మాత్రం అల్లాహ్‌కే ఎరుక. కాని, మానవ ఆలోచనల ద్వారా ఈ భావస్థితికి రెండు అంశాలు అర్థంకాని కారణంగా ఈ స్థితి ఉన్నట్లు అర్థమవుతుంది. ఒకటి; ధర్మసంస్థాపన మానవ జీవన విధి కావడం – దాని హోదాను అది పొందడంలోని వాస్తవ అర్థం ఏమిటి? రెండవది : ఈ విధి కోసం చేసే అవిరళ కృషి విజయవంతం కావడంలోని అసలు అర్థం ఏమిటి? ఈ రెండు విషయాలు స్పష్టంగా అర్థమైతే, మన ఆలోచనలు ఈ విషయాలను సహేతుకంగా స్వీకరిస్తే, దివ్య ఖుర్ఆన్ చూపిన మూసలో మనం పోతపోయబడితే, పరిస్థితుల అనుకూల – ప్రతికూలతల చర్యలకు ఇక తావు ఉండదు.

## విశ్వాసి అసలు సిసలు బాధ్యత

మన ముందు ఎప్పుడైతే 'ధర్మసంస్థాపన' అనే పదం ప్రస్తావించబడుతుందో – అప్పుడు మొత్తం ధర్మాన్ని తక్షణం మన జీవితకాలంలోనే విజయవంతంగా

స్థాపింపచేయాలనే ఆలోచన వచ్చేస్తుంది. అయితే, ఇది నిజమైన ధర్మసంస్థాపనా భావన కాజాలదు. మన మీద విధి అయిన ఆచరణ ఏమిటంటే, ఈ ధర్మసంస్థాపనా కృషిలో మనం నిరంతరం నిమగ్నమై ఉండాలి. మన మానవ వనరులు సహజ నైపుణ్యాలు అన్నీ ఈ ధర్మసంస్థాపన కోసం వెచ్చిస్తూ, నిరంతరం అవిరళ కృషి చేస్తూ ఉండాలి. ఎవరైతే ఈ కృషి సాగించారో వారు తమ జీవితంలో సఫలత సాధిస్తారు. విధిని కర్తవ్యాన్ని, బాధ్యతను నెరవేర్చినవారిగా పరిగణించబడతారు. ఏ ఒక్క శక్తి కూడా ఈ సందేశ ప్రచారకుని మాట వినకపోయినా, భూమిపై ఒక రేణువు అంత ప్రాంతంపైన కూడా ధర్మం సంస్థాపించబడకపోయినా, ఏమీ చింతించవలసిన అవసరమే లేదు. అల్లాహ్ ప్రతి వ్యక్తిపై అతను మోయగలిగినంత బరువు బాధ్యతలనే మోపుతాడు. (లా యుకల్లిఫుల్లాహు నఫ్సన్ ఇల్లా ఉస్అహా) వ్యక్తి యొక్క సహజ శక్తికి మించిన బరువు బాధ్యతలు ఆ వ్యక్తిపై మోపడం అల్లాహ్ సంప్రదాయం కాదు. ఉదాహరణకు : అల్లాహ్ మన నుండి 'తఖ్వా' (దైవభీతి + దైవప్రీతి = తఖ్వా) కోరుతున్నాడు. అయితే ఈ తఖ్వా స్థితి మన సహజ శక్తి స్థాయికి లోబడే ఉండాలని అల్లాహ్ కోరుతున్నాడు.

**"అల్లాహ్ తఖ్వాను స్వీకరించండి. మీ శక్తిసామర్థ్యాల మేరకు." (64:16).**

మరో ఉదాహరణను చూద్దాం. అల్లాహ్ శత్రు దాడుల గురించి వివరిస్తూ 'శత్రువుతో ధీటుగా పోరాడండి' అనీ, 'శత్రువు శక్తిసామర్థ్యాలను ధ్వంసం చేయడానికి సిద్ధంగా ఉండ'మనీ, 'యుద్ధసమయంలో ఇది తప్పనిసరి విధి' అనీ హెచ్చరించడం జరిగింది. అయితే శత్రువు యొక్క శక్తిని ఎలాగైనా సరే ధ్వంసం చేసి తీరవలసిందేననీ, ఇక్కడా షరతు విధించలేదు. "శత్రువును ఎదుర్కోవడానికి మీ శక్తి మేరకు ఎంతటి శక్తిని కూడగట్టుకోగలరో అంతటి శక్తిని కూడగట్టండి" అని చెప్పడం జరిగింది. (అ ఇద్దూలహుమ్ మస్తత'తుమ్ మిన్ ఖువ్వతిన్' - 8:60). ఇదేవిధంగా ప్రవక్తశ్రీ (స) వారు ప్రజలతో వాగ్దానం తీసుకొనేటప్పుడు వారి వాగ్దానంలో 'శక్తిమేరకు' అనే పదాన్ని తప్పనిసరిగా జోడించేవారు. అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం, "మేము ప్రవక్త (స)తో ఇతాఅత్ (అనుసరణ-ఆజ్ఞాపాలన)కు సంబంధించి 'బయత్' (ప్రతిజ్ఞ) చేసేవారము. ఆ సమయంలో (ప్రవక్త) 'నా శక్తిమేరకు' అని చెప్పండి అని అనేవారు." (ముస్లిం గ్రంథం)

అల్లాహ్ తన ఆదేశాల అమలులో ప్రతి వ్యక్తియొక్క శక్తిసామర్థ్యాల స్థాయిని తప్పనిసరిగా పరిగణనలోనికి తీసుకుంటాడు. ధర్మంలో ఇది తిరుగులేని సూత్రంగా ఉంటుంది. ఈ సూత్రం ప్రకారం సామాజిక వాతావరణం ఎంతటి వ్యతిరేకంగా ఉంటే, ఆ మేరకు మన ఆచరణకు 'రాయితీ' ప్రసాదించబడుతుంది. ప్రత్యేక కార్యాచరణలో, ప్రత్యేక వ్యక్తుల ప్రత్యేకతలు, వారి శక్తి సామర్థ్యాల విషయంలో కూడా ఇదే పద్ధతి పాటించబడుతుంది. ప్రతి వ్యక్తీ అల్లాహ్ దర్బారులో, అతనికి ఇవ్వబడిన శక్తి సామర్థ్యాల మేరకు జవాబు ఇవ్వవలసి ఉంటుంది. ఉదాహరణకు : ఒక వ్యక్తి తనకు శక్తి సామర్థ్యాలన్నీ ప్రసాదించబడిన తరువాత కూడా, అతను తన జీవిత లక్ష్యమైన 'ధర్మసంస్థాపనం' మార్గంలో కృషి చేయకపోతే లేక చేయగలిగినంత కృషి చేయలేకపోతే, ప్రసాదించబడిన శక్తులను వెచ్చించకపోతే, అతను తప్పని సరిగా దోషిగా, ముద్దాయిగా, కృతఘ్నునిగా పరిగణించబడతాడు. మరొకడు తన వద్ద శక్తి లేనప్పటికీ ఉన్న శక్తిని సంపూర్ణంగా ధర్మసంస్థాపనా మార్గంలో వెచ్చించినట్లైతే, దానివల్ల భౌతికంగా ధర్మసంస్థాపనకు ఏమాత్రం లాభం చేకూరనప్పటికీ, అతను దైవప్రీతికి తప్పనిసరిగా పాత్రుడు అవుతాడు. ఇంకా అతను దైవదాస్యపు హక్కు నెరవేర్చినవానిగా పరిగణించబడతాడు. కనుక, ఒక విశ్వాసి యొక్క బాధ్యత ఏమంటే, తనకు ఏ మేరకు శక్తి ఉన్నదో – ఏ పరిస్థితుల్లో తాను ఉన్నాడో, ఆ శక్తిమేరకు – ఆ పరిస్థితులు అనుమతించిన మేరకు తన శక్తిని వెచ్చిస్తూ, ధర్మసంస్థాపనా కృషిని చేయవలసి ఉంటుంది. క్రమక్రమంగా, పరిస్థితుల, శక్తి సామర్థ్యాలపై ఆధారపడి తన కృషిని మరింత విస్తృతపరచనూ వచ్చు లేదా మరింతగా క్లుప్తీకరించుకోనూవచ్చు.

పై విషయాన్ని మనం రోజూ ఆచరించే నమాజ్ ఉదాహరణ ద్వారా మరింత స్పష్టంగా అర్థం చేసుకోవచ్చు. నమాజ్ మనపై తప్పనిసరి విధి అయివుంది. ఈ నమాజ్ ఆచరణలో ఖియామ్, రుకూ, సజ్దాలాంటి అంశాలు తప్పనిసరి అవుతాయి. అయితే ఒక వ్యక్తి ఖియామ్‌లో నిలబడగలిగినంత శక్తి ఉండి కూడా నిలబడకపోతే, కూర్చొని నమాజ్ ఆచరిస్తే అతని నమాజ్ నెరవేరదు. అయితే ఈ వ్యక్తే ఏ కారణం చేతనైనా నిలబడలేని పక్షంలో అతను కూర్చొని నమాజ్ ఆచరించే 'రాయితీ'కి అర్హుడౌతాడు. ఇంకా ఈ వ్యక్తి మొదటి, రెండవ రకాత్‌లలో కాలినొప్పివల్ల నిలబడలేకపోయినప్పటికీ, మూడవ లేక నాలుగవ రకాత్‌లో కాలునొప్పి తగ్గిపోతే,

అతను తప్పనిసరిగా లేచి నిలబడవలసి ఉంటుంది. అంటే; బలహీనతలు ఉన్నప్పుడు ఇవ్వబడిన 'రాయితీ', బలహీనత తగ్గేకొలదీ, శక్తి పుంజుకొనేకొలది ఆ రాయితీ ఇవ్వబడదని (లభించదని) గుర్తించాలి. ధర్మసంస్థాపనా కృషిలో కూడా అదే సూత్రం వర్తిస్తుంది. ఎవరికి ఎంతటి శక్తి ప్రాప్తమై ఉందో వారు ఆ మేరకు ఆ కృషిలో నిమగ్నం కావలసి ఉంటుంది. అంతకంటే అధికంగా కృషి చేయడం అతనికి అవసరం లేదు. అలాగే అంతకన్నా తక్కువ కృషి చేయడం క్షేమకరమూ కాదు. భూమిపై అల్లాహ్ ధర్మాన్ని సంపూర్ణంగా స్థాపించడం ఒక చివరి 'గోల్'గా మాత్రమే ఉంటుంది. ఈ గోల్ లేక లక్ష్యం సాధించబడటానికి నిరంతరం చేసే బాధ్యతాయుతమైన శ్రమ తప్పనిసరిగా అవసరమై ఉంది. ఈ లక్ష్యం, నా జీవితకాలంలోనే నెరవేర్చబడాలని ప్రతి విశ్వాసి హృదయం తప్పనిసరిగా ఆశించాలి. కాని, అక్కడ తప్పనిసరిగా తను ఉండటం విధిగా భావించకూడదు. ఈ మార్గంలో తాను ఎన్ని అడుగులు వేయగలడో అన్ని అడుగులూ వేయడాన్నే తప్పనిసరి విధిగా భావించాలి.

## అపజయానికి తావే లేదు

ధర్మసంస్థాపన విధి కాబడటం యొక్క వాస్తవికత పైవిధంగా ఉన్నప్పుడు, ఈ విధి నిర్వహణలో చేసే కృషియొక్క సాఫల్యం వాస్తవ భావన ఏమై ఉంటుంది? మన శక్తి సామర్థ్యాల మేరకు, మన కృషి ఉండటం తప్పనిసరి అని తేలిపోయిన తర్వాత, ఆ తప్పనిసరి కృషి చేసే వ్యక్తికి అసఫలత, అపజయం అనేది ఉండనే ఉండదు. ఈ ధర్మసంస్థాపనా మార్గం, కేవలం మార్గమే కాదు, ఇది స్వయంగా గమ్యం కూడా అయిన మార్గం. ప్రపంచంలోని ఇతర ఉద్యమాలలో పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉంటుంది. అక్కడ తమ పూర్తి ప్రయత్నం తర్వాత కూడా సఫలత లభించనూవచ్చు. లేక అసఫలతకు లోనుకానూవచ్చు. కాని, ధర్మసంస్థాపనా ఉద్యమంలో, ఈ అవిరళ కృషిలో ఒక వ్యక్తి, తన శక్తి సామర్థ్యాల మేరకు కొరతలేకుండా సంపూర్ణ కృషి నిర్వహిస్తే – ఇక్కడ అసఫలత, అపజయాల ప్రశ్నే తలెత్తదు. ఎందుకంటే, ఒక విశ్వాసి నుండి అల్లాహ్ కోరుతున్నది కేవలం 'శక్తికి తగ్గ అవిరళ కృషి' మాత్రమే కదా. ఒక విశ్వాసి తన ఆఖరి శ్వాస వరకు ధర్మసంస్థాపనా కృషిలో నిమగ్నమై ఉంటూ, తన సర్వశక్తులు ఒడ్డి కృషిచేయడాన్నే విశ్వప్రభువు అల్లాహ్ ఇష్టపడుతున్నాడు. మరణానంతర తీర్పుదినం నాడు శక్తి సామర్థ్యాల పునాదులపైనే తీర్పు చేయబడుతుంది.

ఈ కారణంగా దైవాభీష్టం - ఆమోదపు కారుణ్యం ఈ విశ్వాసిని తన రక్షణలోనికి సంపూర్ణంగా తీసుకుంటుంది. అప్పుడు అతను వాస్తవ సాఫల్యానికి అర్హుడై పోతాడు. తన జీవిత కాలంలో దైవధర్మాన్ని స్థాపించే తప్పనిసరి విధిలో, ఏ కొరతా చూపనివాడు - జీవిత లక్ష్యం - ధ్యేయాల సాధనలో నిరంతరం శక్తిమేరకు కృషి సలిపినవాడు సఫలుడు కాకుండా ఉండగలడా?

ఈ మార్గంలో తన శక్తియుక్తులను, తన శక్తిమేరకు వినియోగించలేనివాడు తన సామర్థ్యం మేరకు సద్వచనాన్ని సమున్నత పర్చే హక్కు నెరవేర్చనివాడు తప్పనిసరిగా అసఫలతకు, అపజయానికి లోను అవుతాడు. ఈ విధంగా ఒక విశ్వాసి తన సమస్త శక్తి సామర్థ్యాలను ధర్మసంస్థాపనా మైదానంలో పడవేసిన తరువాత, ఇక ఆ విశ్వాసికి లభించే ఫలితం కేవలం సఫలత - విజయం తప్ప మరేదీ ఉండే వీలే లేదు. కనుక ఈ కృషిలో నిరాశ నిస్పృహ, ఫలితాల పట్ల ఆశ అనే అంశాలకు తావు ఉండే వీలే లేదు.

## విజయం - ఇస్లామీయ భావన

నేడు ప్రపంచంలో ఏ భౌతిక వనరుల సాధనే జీవిత సాఫల్యంగా - విజయంగా భావించబడుతుందో - అదే విషయాన్ని ముస్లింలు కూడా దత్తత తీసుకున్నారు. ఈ కారణంగానే ముస్లింల దృష్టి పథం నుండి వాస్తవిక విజయానికి సంబంధించిన ఇస్లామీయ భావనలు దూరమైపోయాయి. ఈ ప్రపంచంలో మనిషి పోగుచేసిన భౌతిక సంపదల సమృద్ధినే, నేడు సఫలత లేక విజయంగా భావించటం జరుగుతుంది. అయితే ఈ 'పొరపాటు విజయ భావననే' ఖుర్‌ఆన్ తీవ్రంగా ఖండిస్తుంది. వాస్తవిక విజయం ఏమిటో కూడా అది స్పష్టపరుస్తుంది. మనిషి తక్షణం పొందే లాభాన్ని, లేక ప్రయోజనాన్ని మాత్రమే విజయంగా భావిస్తున్నాడు. కళ్ళకు కనిపిస్తున్న వస్తు సంపదనే విజయ సొత్తుగా భావిస్తున్నాడు. తత్భిన్నంగా ఖుర్‌ఆన్ మరో విషయాన్ని సాఫల్యంగా, విజయంగా మన ముందుకు తెస్తుంది. ముస్లిం అనే పదం యొక్క పరిచయంలోనే - ఒక ముస్లిం మరణానంతర తీర్పుదినాన పొందే విజయమే నిజమైన విజయం అనే విషయం దాగి ఉంటుంది. భౌతిక వనరుల సమృద్ధి తాత్కాలిక మైనదనీ, అశాశ్వతమైనదనీ ఒక ముస్లిం దృఢంగా విశ్వసిస్తాడు. ఈ కారణంగా తన

జీవితపు పెట్టుబడి మొత్తాన్ని మరణానంతర సఫలత కోసం వెచ్చిస్తాడు. సత్య ధర్మసంస్థాపనంలోని మొదటి అడుగులోనే తన పెట్టుబడి మొత్తాన్ని కోల్పోయినప్పటికీ అతడు విజయుడే అవుతాడు. అలాగే విశ్వమంతా ధర్మసంస్థాపనా పతాకం రెపరెపలాడే రోజు వరకు తన పెట్టుబడి కొనసాగుతూ ఉన్నప్పటికీ అతడు విజయుడే అవుతాడు. ఏ సమయంలోనైనా, ఏ పరిస్థితిలోనైనా ఈ వ్యక్తి సఫలుడే అవుతాడు. విజయాన్ని తప్పనిసరిగా ఆస్వాదిస్తాడు.

నాటి రోమ్ సామ్రాజ్యవాదం ఇస్లామీయ ప్రభుత్వాన్ని నేలమట్టం చేయడానికి ప్రయత్నాలు చేస్తూ ఉన్న సమయంలో, నాటి మదీనా కపటులు, రోమనుల ప్రయత్నాలు ఫలవంతం కావాలని కలలు కనేవారు. మహాశక్తివంతమైన రోమను సైనికుల పదఘట్టనల క్రింద ఈ పిడికెడు విశ్వాస అహంభావులు, తలతిక్క ముస్లింలు నలిగి నుజ్జు నుజ్జు అయిపోవడం తప్పనిసరి అని అత్యాశపడ్డారు. ఈ పరిస్థితుల్లో విశ్వప్రభువు అల్లాహ్ తన ప్రియసందేశహరులు ముహమ్మద్ (స)ను, కపటులకు తెలియపర్చవలసిందిగా ఈ క్రింది మాటలు ఉటంకించాడు. “ఓ ప్రవక్తా! (ఈ కపటులతో) ఇలా అనండి : మీరు మా విషయంలో దేనికొరకు నిరీక్షిస్తున్నారో అది, రెండు మేళ్ళలో ఒకటి తప్ప మరొకటేముందీ?” (9:52)

ఈ చెప్పబడిన అంశం ఏ విషయాన్ని తెలియపరుస్తుందో జాగ్రత్తగా గమనించాలి. ఈ వాక్యం స్పష్టంగా ఎలుగెత్తి చాటుతున్న విషయం ఏమిటంటే, ముస్లింలు యుద్ధమైదానంలోకి అడుగుపెట్టడమే, వారు విజయం, సఫలతలు సాధించడానికి నిదర్శనంగా చెప్పబడింది. ఈ యుద్ధంలో వారు విజయులైనా – లేక అపజయం పాలైనా, రెండు స్థితులు కూడా వారికి విజయాన్నే అందిస్తాయి. ఒక విశ్వాసి అయిన యోధుడు దైవమార్గంలో యుద్ధం చేయడానికి ఇంటి నుండి బయలుదేరుతాడు. అతని హృదయం నిండా విజయ బావుటా ఎగురవేయాలనే ఆశ నిండి ఉంటుంది. ఈ ఆశ నిజంగా స్వాగతించదగినదే. ఈ యుద్ధంలో తన కరవాల శక్తిని ఉపయోగించి, అసత్యాన్ని నేలమట్టం చేయడానికి యత్నిస్తాడు. కాని ఇదే యుద్ధంలోని మరో రూపాన్ని (అపజయాన్ని) మనం అపజయంగా భావించవలసిన అవసరమే లేదు. ఎందుకంటే, ఈ యుద్ధ మైదానంలో తాను, తన తోటి నేస్తాలు అందరూ చంపబడితే, ఈ మరణం కూడా సఫలతగానే భావించబడుతుంది.

'దైవమార్గంలో మరణం' అనబడే ఈ వాస్తవ విజయం ముందు ఇతర విజయాలన్నీ బలాదూర్‌గా కనిపిస్తాయి. ఇంతటి గొప్పదైన అమరత్వపు సాఫల్యం – విజయం మరొకటి ఉండనే ఉండదు.

పై ఉదాహరణ ఒక మహోన్నత విజయానికి ఒక చిన్న పాటి వివరణ మాత్రమే. ధర్మసంస్థాపన యొక్క విశాలమైన, లోతైన ఆచరణకు ఒక చిన్న వివరణ మాత్రమే. ప్రవక్త యహ్యా (అ) (బాప్తిస్మమిచ్చు యోహాను)కు ఈ ధర్మసంస్థాపనా కృషిలో భాగంగానే ఉరికంబం ఎక్కవలసి వచ్చింది. మరి చూడబోతే ఆయన తన ఆచరణ ద్వారా ఈ భూమిపై ఒక జానెడు స్థలంపై కూడా ధర్మాన్ని స్థాపించలేకపోయారు. అయినప్పటికీ ప్రవక్త యహ్యా (అ) సంపూర్ణ విజయం సాధించిన విజేతగా పరిగణించబడ్డారు. మరోవైపున చివరి దైవసందేశహరులు (స) కేవలం కొద్ది కాలంలోనే ఒక విశాలమైన భూభాగంపై అల్లాహ్ ధర్మాన్ని స్థాపించి విజయులయ్యారు. ఈ బహిరంగ రహస్యాన్ని అర్థం చేసుకోవడానికి కూడా 'విశ్వాసి హృదయం' అవసరమౌతుంది. హేతువు గురించి, ఔచిత్యం గురించి తర్జనభర్జన చేసే వారికి ఈ భావోద్వేగపు విషయాలు జీర్ణం కాకపోవచ్చు.

## ఆచరణాత్మక ధర్మసంస్థాపనకు అంతులేని అవకాశాలు

నేడు సాధారణంగా విజయానికి సంబంధించి ఎటువంటి భావన ఉన్నదో – ఆ భావనల ఆధారంగా చూసినా ధర్మసంస్థాపన కోసం జరిగే అవిరళ కృషికి, అపజయాల కంటే విజయావకాశాలే మెండుగా ఉన్నాయి. ముస్లిం ఉమ్మత్‌లోని పది లేక ఇరవై శాతం ప్రజలు ఈ విజయం పొందడం కోసం సిద్ధపడవలసి ఉంటుంది. ప్రవక్త సంప్రదాయం ప్రకారం, ప్రవక్తల సదాచారాన్ని అనుసరిస్తూ కొనసాగితే, ఈ కృషి విజయం సాధించడంలో సందేహమే లేదు. చీకటి రాత్రి తర్వాత జ్వాలామయమైన ఉషోదయం తప్పనిసరికదా! ఈ క్రింద పేర్కొన్న విషయాలకు సంబంధించిన అవసరాలను పరిపూర్ణంగా తీర్చగలిగితే, ధర్మసంస్థాపనా కృషిలో విజయం తప్పనిసరి అని మనకు మనమే రూఢీ చేసుకోగలం.

1. ధర్మసంస్థాపనా కార్యకర్తలు, నాయకుల ప్రత్యేక కోవ.
2. మానవ నైజం వాంఛించేది

3. మనిషి యొక్క ప్రస్తుత బౌద్ధిక, భౌతిక, సాంస్కృతిక క్రమవికాసం - దానితో పాటుగా అతనిలో అంతర్మథనం చెందే మనసు.

సాధారణంగా 'ధర్మసంస్థాపనా కృషిలో విజయం' గురించి ఆలోచించేవారు అనుకూల-అననుకూలతల గురించి బేరీజు వేసేవారు, ఒక ఉజ్వలమైన సత్యాన్ని మరిచిపోతారు. అదేమిటంటే, ధర్మసంస్థాపనా విధి కేవలం సూత్రబద్ధతలేని, స్వార్థపరుల, భీరువుల ద్వారా కూడా సాగించబడాలని కోరుకుంటారు. నిజానికి ఈ పని ఎవరైతే తమ్ము తాము 'విశ్వాసులు'గా ప్రకటించుకుంటారో వారికి ప్రత్యేకించబడినది అని గ్రహించాలి. వీరు దివ్య ఖుర్‌ఆన్ ఆదేశాల మేరకు ఒకే సృష్టికర్తపై సంపూర్ణ విశ్వాసం కలిగివుంటారు. సృష్టికర్తకు తప్ప మరెవ్వరికీ విధేయత - దాస్యం చేయనివారై ఉంటారు. ఈ విశ్వానికి ప్రభువు, శక్తి ప్రదాత, ఆజ్ఞాపించే అధికారం కలిగిన చట్టనిర్దేశకుడు, కృషిని అంగీకరించి ప్రతిఫలం ప్రసాదించే స్వామికి మాత్రమే విధేయులై ఉంటారు. ప్రవక్త ముహమ్మద్ (స)ను మాత్రమే తమకు ఆదర్శప్రాయులుగా వీరు అంగీకరిస్తారు. తమ జీవితపు ప్రతి రంగంలోనూ, ప్రవక్తశ్రీ (స) వారిని తప్ప, మరెవ్వరినీ అనుసరించనివారై ఉంటారు. శాశ్వతమయిన మరణానంతర జీవితాన్ని, తాత్కాలిక భౌతిక జీవితం కంటే మేలైనదిగా భావిస్తారు. వారు నమాజ్, రోజా, జకాత్, హజ్‌లాంటి విధులను తప్పనిసరిగా నెరవేర్చేవారై ఉంటారు. సత్యానికి సాక్షులుగా, సత్య ధర్మ ధ్వజవాహకులుగా, సత్య ధర్మ ప్రచారకులుగా, సమ న్యాయ వ్యవస్థకు ప్రతినిధులుగా, అసత్యాన్ని అసహ్యించుకునే వారుగా, చెడుకు సహజ శత్రువులుగా, దౌర్జన్యాన్ని ఎదిరించేవారుగా ఉంటారు. వీరు తమ ఆచరణ ద్వారా సులభంగా గుర్తించబడగలుగుతారు. వీరు చెడును, మంచి ద్వారా నిర్మూలించే కృషి చేస్తారు. అజ్ఞానాన్ని, తమ జ్ఞానం ద్వారా పారద్రోలుతారు. తమ స్వంత వారికీ, బంధువులకూ నష్టదాయకమైనప్పటికీ న్యాయానికి కట్టుబడేవారై ఉంటారు. శత్రువు తనపై ఎంతటి క్రూరత్వం ప్రదర్శించినప్పటికీ, అతను తన చేతికి చిక్కినప్పుడు సైతం అతనిపై కసి తీర్చుకోని వారై ఉంటారు. ప్రతిక్షణం మధ్యేమార్గాన్ని అవలంబించేవారై ఉంటారు. తమ సర్వస్వాన్ని ధారపోసి అయినా ఇతరుల మానమర్యాదలను రక్షించే గుణం కలిగి ఉంటారు. ఇతరుల ధన ప్రాణాలను కాబా గృహమంత పవిత్రమైనదిగా భావించే సహృదయులై ఉంటారు.

వారు తమకోసం ఏది కోరుకుంటారో - ఇతరుల కోసం కూడా అదే కోరుకునే విశాల హృదయులై ఉంటారు. వీరి లోగిళ్ళు అనాథలకు, వితంతువులకు ఆశ్రయాన్నిచ్చే చలువ పందిళ్ళు అయి ఉంటాయి. వీరి సమస్త జీవితం, అనగా వీరి మరణం, వీరి జీవితం స్నేహం-శత్రుత్వం, సమస్తం అల్లాహ్ కోసం అయి ఉంటుంది. ఈ లక్షణాల్లో కొన్ని హెచ్చుతగ్గులు గల బృందాన్నే మనం నేడు 'విశ్వాసుల వర్గం'గా భావిస్తున్నాం. కనుక, ధర్మసంస్థాపనా విధికి ఉన్న అనుకూలత - ప్రతికూలతల గురించి చర్చించే సమయంలో ఈ వర్గాన్నే మనం ధర్మసంస్థాపనకు అర్హులైన ప్రతినిధులుగా భావించవలసి ఉంటుంది. ఈ మౌలిక విషయాన్ని వదిలేసి పరిస్థితులను సమీక్షిస్తే తప్పుడు అభిప్రాయాలకు, నిర్ణయాలకు మనం చేరుకుంటాం. ఈ ఉన్నత మానవ లక్షణాలు గల వర్గం మన కళ్ళ ముందు ఉంటే ఇక ధర్మసంస్థాపనా కృషిలో అపజయం గురించి ఆలోచించనే కూడదు. ఇంతటి ఉన్నతమైన భావాలు, ఉత్కృష్టమైన నైతిక విలువలు, విశాలమైన ఆలోచనలు గల విశ్వాసుల వర్గం ఆధ్వర్యంలో ధర్మసంస్థాపన జరగకుండా ఉంటుందా? మరీ ముఖ్యంగా ప్రపంచంలోని మరే పార్టీకి లేనంత మంది దీక్షాబద్ధ సభ్యులు ఈ పార్టీకి ఉన్నప్పుడు విజయం ఎలా కష్టమౌతుంది? నేటి ఈ భారీ ప్రజా సమూహం అంటే ముస్లిం ఉమ్మత్ పైన పేర్కొన్న గుణ విశేషణాలలో కాణాచి కాదనేది కాదనలేని సత్యం. అదే సమయంలో పైన పేర్కొన్న విశిష్ఠతలు గలవారితో ఈ ఉమ్మత్ ఖాళీగా కూడా లేదు. ఇప్పటికీ సంఖ్యాపరంగా తక్కువ అయినా పైన పేర్కొన్న విశిష్ఠతలు గల వ్యక్తులు ఈ ఉమ్మత్‌లో ఇప్పటికీ ఉన్నారు. నివురు గప్పివున్న ఈ నిప్పు కణికలకు, ప్రపంచానికి వెలుగు పంచాలనే ఆలోచన, అందుకై ప్రకాశించే పద్ధతి అలవడితే అల్‌హందులిల్లాహ్ ఈ చీకటి ప్రపంచాన్ని ఏదో ఒక రోజున తమ వెలుగుతో నింపివేయకుండా ఉండలేరు.

ఇప్పుడు మానవ సహజ నైజం గురించి తెలుసుకుందాం. మనిషి తన సహజ నైజం ప్రకారం మంచిని ప్రేమించేవాడుగా, దానిని అంగీకరించేవాడుగా ఉంటాడు. ఏ కొద్దిమందినో వదిలేస్తే, గణనీయమైన సంఖ్య మంచిని, సత్కార్యాలను అభిమానించే వారై ఉంటారు. ఏదో మేరకు మంచికోసం, మంచి వైపున నిలబడేవారై ఉంటారు. అసత్యాన్ని, అధర్మాన్ని, చెడును ప్రేమించేవారు సైతం, తమ సహజ నైజానికి 'చెడు శిక్షణ' ఇవ్వడం ద్వారా చెడ్డవారిగా మారివుంటారు. ఇటువంటివారు ఈ ప్రపంచంలో

బహుకొద్దిమంది మాత్రమే ఉంటారు. ఈ అతికొద్దిమంది షైతానులే ప్రజల జీవితాన్ని విశేషంగా ప్రభావితం చేయగలుగుతున్నారు. సమాజ నాయకత్వ స్థానాన్ని ఇటువంటివారే హస్తగతం చేసుకొని ఉన్నారు. ప్రజలు నిశ్శబ్దంగా వీరి వెంట నడుస్తూ ఉన్నారు. రోజు రోజుకూ వీరి నాయకత్వంలో చెడు యొక్క దుర్గంధంలో కూరుకొని పోతూ ఉన్నారు. అయినప్పటికీ వీరిలోని మంచిని ప్రేమించేతత్వం ఇంకా సజీవంగా ఉంది. వీరి ముందు తాత్వికంగా, ఆచరణాత్మకంగా ధర్మం యొక్క దివ్య తేజస్సును ప్రదర్శించగలిగితే వీరి నుండి గణనీయమైన సంఖ్య ఉద్యమం వైపు ఆకర్షితులౌతారు. కనీసంగా ఉద్యమాన్ని అభిమానించేవారిగానైనా మార్పు చెందుతారు. తన సహజత్వానికి అనుగుణంగా ఉన్న విషయం తన ముందు సంపూర్ణంగా ప్రదర్శించబడితే దాని వైపు ఆకర్షితులు కాకుండా ఉండటం సాధారణ మనిషికి సాధ్యం కాని పని. ఏ చెడును తన సహజత్వం అసహ్యించుకుంటుందో, అందులోనే పడి పొర్లాడటానికి ఎవరూ ఆమోదించరు కదా!

ఇక ఉపేక్షించటానికి వీలులేని చివరి అంశం ఏమిటంటే, సామాజిక క్రమ వికాసం. గతించిన కాలాన్ని గమనిస్తే, మనిషి యొక్క తాత్విక స్థాయి అపరిపక్వంగా ఉండేది. ప్రజలలో మురాతత్వం, హద్దులు దాటిన మతతత్వం ఉండేది. వారి హృదయ కవాటాలు ఒక పరదేశ సందేశాన్ని స్వీకరించటానికి సిద్ధంగా ఉండేవి కావు. సందేశ ప్రచార మార్గాలు, అవకాశాలు బహు తక్కువగా ఉండేవి. ఈ కారణంగా సత్యధర్మ ప్రచారపు ఫలితం పెద్దగా కనిపించేది కాదు. చేసిన ప్రయత్నాలు నిష్ఫలమయ్యేవి. కాని, నేటి పరిస్థితులు పూర్తిగా భిన్నంగా ఉన్నాయి. మనిషి నేడు మూఢ నమ్మకాల నుండి, హేతుబద్ధతలేని భావజాలాల నుండి తన్ను తాను వేరుపర్చుకునే, దాన్నుండి పైకి ఎదిగే ప్రయత్నం చేస్తున్నాడు. దినం దినం సత్యాన్ని బలపర్చేవానిగా మార్పు చెందుతున్నాడు. మానవ జీవిత సమస్యల్ని పరిష్కరించే పసలేని సిద్ధాంతాలన్నిటిని ఒక్కొక్కటిగా విసర్జిస్తూ వస్తున్నాడు. పాశ్చాత్య సంస్కృతి ఈ ప్రపంచాన్ని అంతులేని నష్టానికి గురిచేసింది. అదే సమయంలో, సత్యాన్ని, హేతుబద్ధతను, జ్ఞాన విజ్ఞానాలను విశ్వసించే భావజాలాన్ని కూడా మనిషికి అందించింది. ఈ భావజాలం ఒక సత్య ధర్మ సందేశాన్ని స్వీకరించటానికి ఎక్కువ అనుకూలతలు కలిగి ఉంటుంది. సమతుల్యత, సంతులత, విశ్వసనీయతలను ఈ భావజాలం ఇష్టపడుతుంది... ఆహ్వానిస్తుంది.

పాశ్చాత్య భావజాలం నిజానికి అనేక మూఢభావాలను, నమ్మకాలను ధ్వంసం చేసి వేసింది. అంతేకాదు, ఈ మూఢ, అజ్ఞాన భావజాలాల పునాదులపై నిర్మించబడిన మత పునాదులను సైతం పాశ్చాత్య భావజాలం పెకలించివేసింది. లేదా, కనీసం బీటలు వార్చింది. నిజానికి నేటి పాశ్చాత్య భావజాలం ప్రారంభానికి కూడా ఒక తాత్విక సిద్ధాంతం పునాదిగా ఉండింది. ఈ భావజాలం ఉద్యమరూపం దాల్చిన తర్వాత, ఆ ఉద్యమ ఉధృతిలో అనేక అజ్ఞానాలు, మూఢనమ్మకాలు, మత ఛాందసత్వాలు కొట్టుకొనిపోసాగాయి. ఈ ఉద్యమానికి, దిశానిర్దేశం చేసే ప్రత్యేకమైన నాయకత్వం లేని కారణంగా, అనేక వక్రతలకు లోనైంది. అదే సమయంలో ఈ ఉద్యమాన్ని క్రూరంగా అణచివేసేందుకు, అడ్డుకునేందుకు నాటి యూరప్ మతఛాందసవాదం తీవ్రంగా ప్రయత్నించింది. ఫలితంగా ఈ వైజ్ఞానిక ఉద్యమం అన్ని మతాలను వ్యతిరేకించినట్లుగానే, తనకు సహాయపడగల, దిశానిర్దేశం చూపగల ఇస్లాంను కూడా వ్యతిరేకించి అపారమైన నష్టానికి గురిఅయింది. జరిగిన ఈ నష్టాన్ని నేటి తరం సరిగ్గానే గుర్తించగలుగుతుంది. అది మరలా తన ఆచరణను 'సంతులనం – మధ్యేమార్గం' వైపునకు మరల్చుకునే ప్రయత్నం చేస్తుంది. ఇంకా ఈ పారిశ్రామిక విప్లవం, మత ఛాందసవాదుల కబంధహస్తాలలో ఇరుక్కొని ఉండిన లక్షలాది ప్రజల భావాలను, మెదళ్లను విముక్తం చేసివేసింది. వారు స్వేచ్ఛగా తమకు ఏది సత్యమని, ఏది సహేతుకమని భావిస్తే దానిని సంపూర్ణ హృదయంతో, చైతన్యవంతంగా స్వీకరించే వారిగా మార్చివేసింది. ఈ భావస్వేచ్ఛతో పాటు, సామాజిక – రాజకీయ ఆర్థిక పరిస్థితులు కూడా ఇస్లాం సందేశ ప్రచారానికి అనుకూల మైదానంగా మార్చివేశాయి.

ఎప్పుడైతే ప్రపంచ పాలనాధికారం, దాని రాజకీయ వ్యవస్థల పగ్గాలు – దైవద్రోహులు, దైవధిక్కారుల చేతికి అందాయో – అప్పటి నుండి వారు సృష్టికర్త యొక్క విధివిధానాలను, ఆదేశాలను తమ వీపుల వెనుక పారవేశారు. ఈ కారణంగానే ప్రపంచ మానవాళి ఈ దైవద్రోహ–దైవధిక్కార చర్యలకు సరైన ఫలితాన్ని కూడా అనుభవించటం మొదలెట్టింది. ఈ స్థితియొక్క తీవ్రత నేడు స్పష్టంగా మనకు కనిపిస్తుంది. అంటే; మానవుడు దైవ శాసనాన్ని కాదని, తనకు తానుగా ఏర్పర్చుకొని శాసనాలు, సిద్ధాంతాలు, సూత్రాలు అన్నీ కూడా ఒక్కొక్కటిగా పనికి రానివిగా, వ్యర్థమైనవిగా రుజువు అవుతూ ఉన్నాయి. అంతేకాదు, ఈ మానవ స్వయం కల్పిత

సిద్ధాంతాలు, వాటి పాలనా వ్యవస్థల కారణంగా, మానవ సమాజం రోజు రోజుకూ అనేక సమస్యల ఊబిలో కూరుకొని పోతుంది. ఈ సమస్యల వలయం సృష్టించిన భయానక దృశ్యాలను చూచి గావుకేకలు పెడుతుంది. ప్రత్యామ్నాయ వ్యవస్థ కోసం వెతుకులాట మొదలుపెట్టింది. సామాజిక న్యాయం, సమన్యాయం, సమతుల్యత, సహకార ఆర్థిక వ్యవస్థలు గల జీవన విధానం కోసం వేయి కళ్ళతో, ఆతృతగా ఎదురు చూస్తోంది.

స్పష్టంగా మనకు దర్శనమిస్తున్న ఈ చారిత్రక సంఘటనల వెలుగులో పరిస్థితిని సమీక్షించి చూడండి. ధర్మసంస్థాపన కోసం ఇంతకన్నా మంచి పరిస్థితులు ఉండగలవా? పేర్కొనబడిన ప్రపంచ సామాజిక వాతావరణం భయానకంగా, భీతిగొలిపేదిగా, సహనం పాటించేదిగా, వేచిచూచేదిగా, నిరాశా నిస్పృహలకు తావిచ్చేదిగా ఉన్నదా? సమాధానం 'లేదు' అని అయితే – ఇస్లామీయ జీవన విధానమే సత్యమైనదని విశ్వసించేవారు, జీవితం విసిరే సవాళ్ళు అన్నింటికీ, సమస్యలకు సంతృప్తికర సమాధానం పరిష్కారం కేవలం ఇస్లాం వద్ద మాత్రమే ఉన్నదని విశ్వసించేవారు, పూర్తి విశ్వాసంతో, ఉత్సాహంతో, నమ్మకంతో నడుం బిగించి కార్యరంగంలోకి దిగాలి కదా! మనిషిలో సహజంగా మంచిని అభిమానించే తత్వం ఉందని, మనిషి సృష్టితాలన్నింటిలో సర్వోన్నత జీవి అని కూడా వీరు విశ్వసిస్తారు. మనిషి జన్మతః నేరస్తుడు, పాపి కాడని, చెడుకు పూజారి కాడనీ వీరికి తెలుసు. అయినప్పటికీ వీరు కార్యరంగంలోకి దిగరు. ఎందుకంటే, వీరు ఎంతగా ఇస్లాంను, దాని సత్యతను పొగుడుతారో – ఆ స్థాయిలో వీరి హృదయాలలో ఇస్లామీయ సత్యత నాటుకొని ఉండదు. వీరు ఇస్లామీయ గొప్పతనపు రాగాలాపనలు ఎన్ని చేసినా, వీరి ఆచరణా రంగంలో ప్రేరణ, ఉత్సాహం, ఆవేశం మచ్చుకు కూడా కానరావు. ఇటువంటివారు దైవధర్మం పట్ల నిర్లక్ష్యం – నిరాశలకు గురైతే అది సహజ పరిణామమే. అదే సమయంలో దైవధర్మం కూడా వీరి విషయంలో నిరాశ చెంది ఉంటుందని గ్రహించాలి. అయితే ఎవరి హృదయాలు దైవధర్మం పట్ల సంపూర్ణ విశ్వాసం కలిగి ఉంటాయో వాటికి నిరాశా నిస్పృహలు అంటనే అంటవు. ఎందుకంటే, నేటి ప్రపంచ పరిస్థితులు, సాధారణ సామాజిక ఎత్తుపల్లాలు, మానవ హక్కులు అన్నీ ఇస్లాంకు అనుకూలంగా ఉన్నాయని వారి హృదయాలు శాస్త్రీయంగా పరిశోధనాత్మకంగా గుర్తిస్తాయి. ఈ ప్రపంచం భౌతికంగా మానవ వనరుల

సముదాయంపై ఆధారపడి ఉంది గనుక, భౌతిక వనరులు, మానవ శక్తి సామర్థ్యాలు అన్నింటినీ ఇస్లామీయ ధర్మసంస్థాపనం కోసం వెచ్చించవలసి ఉంటుంది. పళ్ళెంలో ఉన్న అన్నపు ముద్ద మన ప్రయత్నం లేకుండా నోటివరకు చేరదు కదా! ధర్మసంస్థాపనకు పరిస్థితులు ఎంత అనుకూలంగా ఉన్నప్పటికీ, సామాజిక స్థితిగతులు పరిపక్వత చెందివున్నప్పటికీ, ధర్మసంస్థాపనకు అవసరమైన పథకాలు, నియమ నిబంధనలు, సూత్రాలు, పని విధానాలు, శక్తిసామర్థ్యాలు ఆచరణకు పూనుకోనంత వరకు ధర్మం స్థాపించబడటం సాధ్యమే కాదు అని గుర్తించాలి.

ఇస్లామీయ ధర్మసంస్థాపనకు అవసరమైన 'సైద్ధాంతిక' మరియు 'ఆచరణాత్మకత'లు ఈ క్రింద వివరించిన దానికి 'సాక్షులు'గా ఉండవలసి ఉంటుంది.

1. మొదటి (సైద్ధాంతిక) సాక్ష్యం ఏమిటంటే, ఈ 20వ శతాబ్దపు పరిభాషలో ఇస్లాంను ప్రపంచ ప్రజలకు పరిచయం చేయాలి. నేటి బౌద్ధిక, జ్ఞాన-విజ్ఞాన స్థాయికి అనుగుణంగా, హేతుబద్ధంగా సాక్ష్యాలు, రుజువులు చూపాలి. జీవితపు అన్ని రంగాలకు సంబంధించి ఇస్లాం మార్గదర్శకాలను, వాటి శాస్త్రీయతలను అందించాలి. నేటి సామాజిక పరిస్థితులను ఇస్లాంకు అన్వయించాలి. ఈ చర్యలన్నింటి ద్వారా నేటి సామాజిక, రాజకీయ, ఆర్థిక, బౌద్ధిక సమస్యలన్నింటికీ సహజమైన, హేతుబద్ధమైన, శాస్త్రీయమైన పరిష్కారం కేవలం ఇస్లాం మాత్రమే ఇవ్వగలదని స్పష్టం చేయాలి.

2. ఇక రెండవదైన ఆచరణాత్మక సాక్ష్యం ఏమిటంటే, ఏ విషయాన్ని సైద్ధాంతికంగా ప్రకటిస్తున్నామో, దానిని ఆచరణాత్మకంగా ఆచరించి చూపాలి. కఠినాతి కఠినమైన పరిస్థితులలో కూడా రుజుమార్గం నుండి ఒక్క అడుగు కూడా ప్రక్కకు జరగకూడదు. అల్లాహ్‌తో సంబంధం రోజు రోజుకూ మరింతగా దృఢతరం చేసుకుంటూ ముందుకు సాగాలి. మన భౌతిక, బౌద్ధిక జీవితాలల్లో – శుచిశుభ్రతలు, పవిత్రతలు వెల్లివిరిసేలా మన ఆరాధనలు ఉండాలి. వ్యక్తిగత, సామూహిక జీవితాల్లో ఇస్లామీయ విలువలు, నైతికతలు పూర్తిస్థాయిలో పుష్పించాలి. జాతి, దేశం, తెగ, కౌటుంబిక మరియు వ్యక్తిగత స్వార్థాలను త్యజించి, కేవలం ఇస్లామీయ ప్రయోజనాలకే ప్రాధాన్యత నివ్వాలి. అన్యాయాన్ని న్యాయంతో, చెడును మంచితో ఎదుర్కోవాలి. అసత్యానికి జవాబు – సత్యంతో ఇవ్వాలి. అరాచకత్వాన్ని – నీతితో, శాసనబద్ధంగా

ప్రతిఘటించాలి. ఈ కృషిలో అవసరమైనపుడు మన విశ్రాంతిని, క్షేమాన్ని, కోరికలను త్యజించాలి. ధన ప్రాణ బలిదానాలకు, త్యాగాలకు - కనీసం లెనిన్, స్టాలిన్‌ల అనుయాయులు కమ్యూనిజం కోసం చేసిన త్యాగాల స్థాయిలోనైనా సిద్ధపడాలి. అలాగే నాజీలు తమ జాత్యాహంకారం కోసం, జపనీయులు మికాడో ప్రసన్నత కోసం చేసిన త్యాగాల స్థాయిలోనైనా చేయగలగాలి.

ఈ విధంగా సైద్ధాంతిక, ఆచరణాత్మక సాక్ష్యాన్ని - ఇవ్వగలిగిన స్థాయిలో ఇవ్వగలిగితే అప్పుడు ... ఖచ్చితంగా సత్యం యొక్క విశేష శక్తి, దైవ సంప్రదాయపు వాగ్దానం సాక్షాత్కరించి తీరుతుంది. ప్రజల హృదయాలను గెలుచుకుంటూ, వారి హృదయాలలో దాగివున్న అనుమానపు ముడులను విప్పదీస్తూ, ధర్మసంస్థాపనా కృషిలో ముందుకు సాగుతూ చివరకు విజయాన్ని కైవసం చేసుకుంటుంది. విశాల ప్రజానీకపు ఆశలు ఆకాంక్షలు నెరవేరుతాయి. ఈ సత్యప్రధానమయిన వ్యవస్థకు ప్రజల చూపులు నీరాజనాలు పడతాయి. ఈ ప్రపంచం మరలా ఒకసారి “యద్ఖులూన ఫీ దీనిల్లాహి అఫ్వాజా” (ప్రజలు తండోపతండాలుగా అల్లాహ్ ధర్మంలోకి ప్రవేశించే) దృశ్యాన్ని చూడగలుగుతుంది.

నేడు ప్రపంచంపై అసత్య వ్యవస్థ యొక్క ఆధిపత్యం చలాయించబడుతుందని మనకు తెలుసు. అయితే, ఈ ఆధిపత్యం, అసత్య వ్యవస్థ యొక్క జన్మహక్కు కాదు. ప్రకృతిపరమైన వారసత్వమూ దానికి లేదు. ప్రకృతి ధర్మం ప్రకారం పాలనా వ్యవస్థను నడిపించే హక్కు కేవలం సత్య ధర్మానికి మాత్రమే ఉంది. అయితే, సత్యధర్మం, దాని ప్రతినిధులు మరుపునకు గురై తమ విధులను సక్రమంగా నిర్వర్తించడంలో నిర్లక్ష్యం చేస్తున్నారు. ఈ కారణంగా తమ స్వంత గృహ బాధ్యతలను వదలివేసారు. ఈ అవకాశం కనిపెట్టిన అసత్యపు విగ్రహాలు ఈ గృహం ఖాళీగా ఉండటం చూసి, అందులో చొరబడి పోయాయి. క్రమంగా తిష్ఠవేసుకున్నాయి. ఇదంతా ఎందుకు జరుగుతుంది? గృహాన్ని సృష్టించినవాడు, ఈ గృహం ఎప్పుడూ ఖాళీగా ఉండకూడదని, అవ్యవస్థగా ఉండకూడదని నిర్ణయించిన ఫలితంగా ఇలా జరుగుతుంది. నిజానికి ఈ గృహాన్ని నిజ హక్కుదారుడు కళకళ లాడేలా చేయవలసి ఉంది. (అలా చేయని పక్షంలో) ఆ గృహం బూజుపట్టి పోవటాన్ని ఆ గృహ సృష్టికర్త ఎన్నటికీ ఆమోదించడు. కనుక, హక్కుదారుడు కానివానికి ఆ సమయంలో గృహప్రవేశ అనుమతినిస్తాడు. అయితే ఈ తాత్కాలిక చొరబాటుదారుడిని, ఆ గృహం విధిలేక బలవంతంగా భరిస్తూ

ఉంటుందని మరచిపోరాదు. ఎప్పుడైతే అసలు హక్కుదారుడు, తన నెలవును, దాని వ్యవస్థను హస్తగతం చేసుకునే ప్రయత్నం తీవ్రంగా చేస్తాడో–అప్పుడు ఆ గృహంలోని ప్రతి వస్తువు, ఆ నిజ హక్కుదారునికి సహాయపడుతుంది. స్వయంగా గృహ యజమాని (సృష్టికర్త అల్లాహ్) యొక్క సహకారం కూడా అతనికి ప్రాప్తిస్తుంది. ఫలితంగా చొరబాటుదారుడైన అసత్య వ్యవస్థ బయటికి గెంటివేయబడతుంది. ఈ వాదన కేవలం తర్కపరమైనది కాదు సుమా! దైవ గ్రంథం ఖుర్ఆన్ ఈ తర్కాన్నే స్పష్టమైనదని స్పష్టం చేసింది.

**"సత్యం వచ్చేసింది. అసత్యం నశించింది. అసత్యం నశించకతప్పదు." (17:81)** అని స్పష్టంగా ప్రకటించింది.

సత్యం రానంత వరకు మాత్రమే, అసత్యపు రాజ్యం బ్రతికి ఉంటుందని మనకు పై దైవవాణి స్పష్టపర్చింది. ఎప్పుడైతే సత్యం వస్తుందో ... కాదు కాదు ... సత్యాన్ని తీసుకొని రావలసినవారు వస్తారో ... అప్పుడు అసత్యం పలాయనమంత్రం పఠించేస్తుంది. కనుక మన తీవ్ర ప్రయత్నం తర్వాత కూడా సత్యధర్మ వ్యవస్థ స్థాపన సాధ్యం కాదని వాదించడం, దైవవాక్యంపై అవిశ్వాసానికి ప్రతీకగా భావించవలసి ఉంటుంది. దైవాన్ని (అల్లాహ్ క్షమించుగాక!) అబద్ధీకునిగా నిందమోపటం అవుతుంది. తనకు ఇష్టం లేనప్పటికీ, అసత్య వ్యవస్థ స్థాపన కోసం జరిగే త్యాగాలకు, బలిదానాలకు వాటి ప్రాపంచిక ఫలితాన్ని తప్పక అందించే అల్లాహ్ – తనకు అత్యంత ప్రీతిపాత్రమైన సత్యధర్మ వ్యవస్థ కోసం జరిగే కృషిని, త్యాగాలను, బలిదానాలను వ్యర్థపరుస్తాడా? లేదు ... లేదు! అలా ఎన్నటికీ జరగదు. ఈ నేపథ్యంలో అల్లాహ్ హామీ, వాగ్దానాలు ఉన్నాయి.

**"అల్లాహ్ తనకు సహాయం చేసేవారికి తప్పకుండా సహాయపడతాడు." (22:40)**

ఇంకా, **"ఎవడు అల్లాహ్‌కు భయపడుతూ పనిచేస్తాడో, అతనికి అల్లాహ్ కష్టాల నుండి గట్టెక్కే మార్గం చూపుతాడు." (65:2,3)**

**"అతనికి ఊహకు కూడా అందనటువంటి మార్గం ద్వారా ఉపాధి ప్రసాదిస్తాడు. అల్లాహ్‌ను నమ్ముకున్న వ్యక్తికి అల్లాహ్‌యే చాలు" (65:3)**

మరోచోట **"అల్లాహ్ పక్షమే ఆధిక్యం వహిస్తుందని తెలుసుకోవాలి."** (5:56) అనీ ఎలుగెత్తి చాటుతున్నాయి.

ఈ అల్లాహ్ పక్షం, ధర్మసంస్థాపనాదీక్షతో శత్రు మూకలకు ఎదురు నిలిచినప్పుడు, అల్లాహ్ సంపూర్ణ సహాయ సహకారం ఈ పక్షాన్ని వెన్నంటి నీడలా కొనసాగుతుంది. ఈ విషయాన్ని స్వయంగా అల్లాహ్ ఏమాత్రం అనుమానానికి తావులేని విధంగా స్పష్టంగా ప్రకటించాడు. అంతేకాదు, ఆకాశంలో తమ విధి నిర్వహణలో ఉన్న అల్లాహ్ దూతలు, ఈ అల్లాహ్ పక్ష యోధునితో భుజం భుజం కలిపి పోరాడటానికి ఏతెంచుతారు. ఈ కారణంగా అల్లాహ్ పక్షం తమ కంటే పదింతల పెద్దదైన సైన్యాన్ని సైతం అవలీలగా ఓడించగలుగుతుంది. బద్ర్, ఉహుద్, అహ్జాబ్, హునైన్ యుద్ధ మైదానాలలో, ఈ అపూర్వ ఘట్టాలు మన కళ్ళ ముందు దర్శనమయ్యాయి. ఈ చారిత్రక ఘట్టాలు నేడు కూడా సంభవాలే. ఏ దైవదూతలు ఆ మైదానాల్లో దిగారో, వారే నేడు కూడా ఏ మైదానాల్లోనైనా దిగగలరు. ధర్మసంస్థాపనా యోధులు, సత్యధర్మ సంస్థాపకులు వీరిని ఎప్పుడు కోరుకుంటే అప్పుడు ఆహ్వానం పలకవచ్చు. బద్ర్ యుద్ధ మైదానంలో, యుద్ధ ఘట్టాన్ని సమీక్షిస్తూ స్వయంగా అల్లాహ్ ఈ అనూహ్యమైన సహాయ సహకారాల గురించి వివరించాడు. ఈ సహాయ సహకారం కేవలం, ఒక ప్రత్యేక సమయం, సందర్భానికి మాత్రమే వర్తించదని కూడా స్పష్టం చేశాడు.

**"సహాయం ఎప్పుడు లభించినా అల్లాహ్ తరఫు నుండే లభిస్తుంది."** (8:10)

చెప్పబడేది ఏమిటంటే, విజయ – సాఫల్యాలు అల్లాహ్ వైపు నుండి మాత్రమే ప్రాప్తిస్తాయి. ఈ ప్రాప్తి నిన్న ఏ విధంగా ఉండిందో, నేడు కూడా అదేవిధంగా ఉంటుంది. కనుక, విశ్వాసుల బృందానికి ఈ దైవ సహాయం, సహకార ప్రాప్తి ప్రతి సమయంలోనూ లభించగలదు. ఈ విశ్వాసుల బృందం 'అన్సారుల్లాహ్' హక్కు నెరవేర్చగలిగితే, వెంటనే ఏమాత్రం ఆలస్యం కాకుండా అల్లాహ్ తాను 'మౌలా' (సహాయకుడు) 'నుస్రత్' (సహకారి) అయిపోతాడు.

గమనించవలసిన విషయం ఏమిటంటే, ఈ సహాయ సహకారాల హామి, వాగ్దానం చేస్తున్నది స్వయంగా విశ్వప్రభువు, సృష్టికర్త అయిన అల్లాహ్ అని తెలుసుకోవాలి. అల్లాహ్ తన వాగ్దాన పాలనలో ఏమాత్రం నిర్లక్ష్యం చేయడు.

అల్లాహ్ వాగ్దాన పాలన పట్ల అనుమానం కల వ్యక్తి అసలు విశ్వాసియే కాదు. ఆ వ్యక్తి తాను విశ్వాసినని ఒక పెద్ద అబద్ధాన్ని పలుకుతున్నాడు. వీరు కష్టాలు ఎదురైనప్పుడు "అల్లాహ్, ఆయన ప్రవక్త మనతో చేసిన వాగ్దానాన్నీ భ్రమలు తప్ప మరేమీ కావు." (33:12) అని ప్రకటించిన రోగగ్రస్తులు, కపట హృదయులు లాంటివారే.

పై వాస్తవాల వెలుగులు మన ముందు ప్రత్యక్షమై ఉన్నప్పటికీ, ఇంకా ధర్మసంస్థాపన సాధ్యం కాదని చెప్పగలమా? అలా చెప్పటం ఆత్మకు ద్రోహం చేసుకొని, కళ్ళను మూసుకోవడం అనిపించదా? ఇది విధి నిర్వహణ నుండి పలాయనం కాదా? పై వాస్తవాల వెలుగు ఉన్నప్పటికీ ఇంకా ధర్మసంస్థాపనా కృషి గురించి సమయానుకూలతల గురించి వాదించే వ్యక్తి యొక్క హృదయంలో తాత్విక భావజాలంలో విశ్వాసపు స్థాయి ఏపాటిదో ఇట్టే అర్థమవుతుంది. ఈ వాదనకు కేవలం తనలోని బలహీనతలను, పిరికితనాన్ని కప్పిపుచ్చుకునే దాని కోసం మాత్రమే లేస్తున్నాడని తెలుసుకోవాలి. పరిస్థితుల ప్రతికూలతల గురించి వాదించేవారు, నిజాయితీపరులే అయితే, అనుకూల పరిస్థితులు ఎలా ఉంటాయో స్పష్టం చేయాలి. ఎక్కడైనా, ఎప్పుడైనా ధర్మసంస్థాపనా కృషి జరుగుతున్నదంటే, అక్కడ ఏదో ఒక అసత్య-అధర్మ దైవేతర వ్యవస్థ ఉన్నదనే కదా అర్థం! మరి ఈ అసత్య, అధర్మ దైవేతర తాగూత్ వ్యవస్థలలో ధర్మసంస్థాపనకు అనుకూలమైన 'అత్యంత గౌరవమైన వ్యవస్థ' ఏదో వీరు స్పష్టం చేయాలి. ఈ గౌరవమైన తాగూత్ వ్యవస్థ, సత్యధర్మం వేంచేసిన వెంటనే స్వాగతం పలుకుతుందా? సత్యధర్మాన్ని అధికారపు సింహాసనంపై కూర్చుండబెట్టి తలపై కిరీటాన్ని అలంకరింపజేస్తుందా? ప్రపంచ చరిత్ర మొత్తంలో సత్యధర్మానికి తివాచీ పరిచి స్వాగతం పలికిన అసత్య తాగూత్ వ్యవస్థ ఏదైనా ఉండిందా? ధర్మసంస్థాపనా కృషి విజయవంతం అయిన సందర్భాలలోని సమయాలు ఈ అవిరళ కృషికి ఎప్పుడైనా అనుకూలంగా ఉండినాయా? భవిష్యత్తులో ఇటువంటి అత్యాశలు ఏమైనా ఉన్నాయా? మొత్తం ఇస్లామీయ ఉద్యమ చరిత్రను పరిశీలిస్తే, మొట్టమొదటి ప్రవక్త ఆదం (అ) నుండి, నేటి మన కాలం వరకు ఎప్పుడైనా ధర్మసంస్థాపనకోసం సమయం సానుకూలంగా ఉండిందా? ధర్మసంస్థాపన కోసం జరిగిన కృషి మొత్తంగా అనుకూల పరిస్థితుల్లోనే జరిగిందా? ఆనాటి పరిస్థితులతో పోల్చుకుంటే, నేటి

పరిస్థితులు కఠినంగా, దుర్భరంగా, క్రూరంగా ఉన్నాయా? 950 సంవత్సరాలు రాళ్ళ దెబ్బలు, తిట్లు శాపనార్థాల వర్షాన్ని భరించిన నూహ్ (అ) కాలం ఈ ధర్మసంస్థాపనకు అనుకూలమైనదని చెప్పవచ్చా? ప్రవక్త ఇబ్రాహీం (అ) కాలాన్ని అనుకూలమైన కాలంగా ఉదాహరించవచ్చా? నమ్రూద్ యొక్క 'దైవత్వం' వికటాట్టహాసం చేస్తుండిన ఆ కాలం, ప్రవక్త ఇబ్రాహీం (అ)ను అగ్నిగుండంతో ఆహ్వానించిన కాలం ధర్మసంస్థాపనకు అనుకూలమైనదని ఊహించవచ్చా? లేక దైవధిక్కార రోమన్ సామ్రాజ్యపాలన నలువైపులా విస్తరించి ఉండిన ఈసా (అ) కాలాన్ని జ్ఞప్తికి తెచ్చుకుందామా? కేవలం కొన్ని సంవత్సరాల కృషికి బదులుగా శిలువ శిక్ష విధించబడుతుందన్న తీర్పు వినవలసి రావటం అనుకూల పరిస్థితులుగా పరిగణిద్దామా? ఇక చివరి ప్రవక్తశ్రీ (స) వారి కాలంలో స్వయంగా ఏక దైవారాధనా గృహంలో 360 విగ్రహాలు తిష్టవేయబడి ఉండిన ఆ అజ్ఞానకాలాన్ని ఉదాహరణగా తీసుకుందామా? ఈ అధర్మ అసత్య, తాగూత్ విగ్రహ రాజధానిలో, సత్యధర్మ ప్రచారం చేసిన నేరానికి రాళ్ళ దెబ్బలు, ముళ్ళ రహదారులు, సామాజిక బహిష్కరణలు, హత్యాపథకాలు, కుట్రలు కుతంత్రాలు మొత్తంగా ధర్మసంస్థాపనకోసం అనుకూల పరిస్థితులని చెప్పుకుందామా? పైన పేర్కొన్నవన్నీ ప్రవక్తల ఆచరణలు – మనలాంటి సాధారణ వ్యక్తులతో వారి ఆచరణలని, వారి కాలాన్ని పోల్చకూడదని భావించి ఆత్మ సంతృప్తి చెందుదామా?

అయితే, మరి వారి తర్వాత కాలానికి చెందిన అనేకమంది విశ్వాసుల పరిస్థితులను చూద్దాం! యుగపురుషుడు (ముజద్దిద్) అల్ ఫసాని (రహ్మ) కాలాన్ని కొంత సమీక్షించి చూద్దాం. స్వయంగా ముస్లింల రాజ్యం ఇస్లాంకు వ్యతిరేకంగా తన పూర్తి శక్తిని ప్రదర్శిస్తూ ఉండిన కాలం అది. ఆ కాలంలో అల్‌ఫసాని (రహ్మ) సందేశ ప్రచారం, ధర్మసంస్థాపనా కృషి మొత్తంగా ప్రాణాంతకమైన అననుకూల పరిస్థితుల్లోనే కొనసాగింది. సయ్యద్ అహమద్ బరేల్వీ (రహ్మ), షాహ్ ఇస్మాయీల్ షహీద్ (రహ్మ)ల కాలాన్ని పరిశీలించండి. ఒక వైపున ఆంగ్లేయుల తుపాకులు వీరి గుండెలకు గురిపెట్టబడి ఉండగా, మరోవైపున శిఖ్ఖు ఖడ్గ ధారులు వీరి కంఠాలు కోరుతూ ఉంటారు. గడ్డం పెంచడంపై పన్ను సైతం విధించబడిన కాలం అది. ధర్మసంస్థాపనా కృషి ఈ అననుకూల వాతావరణంలోనే కొనసాగింది సుమా! కాస్త

నిజాయితీగా గుండెలపై చేయివేసుకొని చెప్పండి. పైన పేర్కొన్న కాలాల్లో, ఏ కాలం, నేటి కాలానికంటే, ధర్మసంస్థాపనకు అనుకూలంగా ఉండింది? ధర్మసంస్థాపన కోసం నేటి కంటే నాటి పరిస్థితులు అనుకూలంగా, ఆశాజనకంగా ఉండినాయా? నిరాశా నిస్పృహలకు, నేటి పరిస్థితుల కంటే, నాటి పరిస్థితులు అనుకూలమైనవా? కాదా? ఒక్కమాటలో ఇస్లామీయ ఉద్యమం ప్రారంభం నుండి నేటి వరకు ఏ పరిస్థితుల్లోనూ, చారిత్రక దశల్లోనూ, ఎప్పుడు కూడా పరిస్థితులు ధర్మసంస్థాపనకు అనుకూలంగా లేనేలేవనేది ఒక చారిత్రక నగ్నసత్యం. అయినప్పటికీ ఈ అననుకూల పరిస్థితుల్లో, కష్టనష్టాలను ఓర్చుకుంటూ, ధర్మసంస్థాపనకై నిరంతరంగా కృషి జరుగుతూనే ఉండటాన్ని మనం గమనిస్తాం. మరి నేడు మాత్రమే ధర్మసంస్థాపన అసాధ్యమనే తల రాతను మనం ఎందుకు బలవంతంగా రాసుకుంటున్నాం. సమస్త నిరాశానిస్పృహలు మన కోసమే ఎందుకు ప్రత్యేకించుకున్నాం.

అసలు దుర్మార్గమైన విషయం ఏమిటంటే, ధర్మసంస్థాపన నేడు 'అసాధ్యం-అసాధ్యం' అని కాకిగోల చేస్తున్న వారివద్ద, ఇందుకు సంబంధించిన ఎటువంటి తార్కిక వాదనలు, రుజువులు కూడా ఏమీ లేవు. మరో విచిత్రం ఏమిటంటే; ఈ పొలికేకలు పెడుతున్నవారు, ధర్మసంస్థాపనా కృషిలో కనీస ప్రయత్నం చేయకుండా, అసాధ్యపు మంత్రాన్ని వల్లెవేస్తూ ఉన్నారు. మనం మన పూర్తి సామర్థ్యంతో, శక్తి నైపుణ్యాలతో ప్రవక్తల పద్ధతిలో ధర్మసంస్థాపన కోసం కృషి చేసి ఉండి, ఆ కృషిలో విఫలమైవుంటే - అప్పుడు ఈ సామాజిక వాతావరణాన్ని, మన అనుభవాన్ని సాక్ష్యంగా, రుజువుగా చూపిస్తూ "అననుకూలత" - "అసాధ్యత"ల వాదనలు వినిపిస్తే న్యాయంగా ఉండేది. ఈ అనుభవం లేకుండానే మనం వాదించటం విచిత్రం! ఈ విధమైన మానసిక స్థితి కలవారు ప్రళయకాలం వరకూ ఈ 'అననుకూల' - 'అసాధ్యత'ల జపం జపిస్తూ, పనికిమాలిన వారిగా మిగిలిపోవడం తథ్యమని గ్రహించాలి. వీరు ఏ కాలాన్ని కూడా ధర్మసంస్థాపనకు అనుకూలంగా భావించనే భావించరు. వీరు నిరంతరం ధర్మవ్యతిరేక శక్తులకు అనుకూలురుగానే, అంతిమ పరిశీలనలో మిగిలిపోతారు. ఫలితంగా ఒక అసత్య వ్యవస్థ తర్వాత మరో అసత్య వ్యవస్థ, ఒక దైవధిక్కార వర్గం తర్వాత మరో ధిక్కార వర్గంగా రూపుమార్చుకొని, కొత్త కొత్త పేర్లతో, వేషాలతో, ముసుగులతో అధికారాన్ని చెలాయిస్తూనే ఉంటారు.

సత్యధర్మాన్ని నింపాదిగా రెండు కాళ్ళు ఒక దగ్గరపెట్టుకునే అవకాశాన్ని, సమయాన్ని కూడా ఇవ్వరు. ధర్మసంస్థాపనా కృషి మొదలైనప్పుడల్లా అసత్య, దైవధిక్కార వ్యవస్థ ఈ అవిరళ కృషికి వ్యతిరేకంగా తన వద్ద నున్న క్రూరాతి క్రూరమైన 'అననుకూల' – 'అసాధ్యత'ల ఆయుధాలను తీసుకొని ఎదురునిలుస్తుంది. సత్య ధర్మస్థాపకులకు, ఉత్తమ కార్యకర్తలకు కష్టాలు – బాధలు, కడగండ్లు–దౌర్జన్యాలు బహుమతులుగా ఇస్తారు. ఈ మార్గం పూలపాన్పు కాదని గుర్తించాలి. ఈ మార్గంలో అగ్ని సరస్సులు మాటువేసి ఉంటాయని మరువకూడదు. ఈ ఉద్యమ మార్గంలో ఎప్పుడు కూడా 'అనుకూలతలు' – 'సుసాధ్యాలు' దొరకనే దొరకవు. ఈ పోరుబాటన సాగే బాటసారులకు విశ్రాంతి అనేది ఉండనే ఉండదు. ఈ పరిస్థితిని దివ్య ఖుర్ఆన్ ఎటువంటి దాపరికం లేకుండా అనుమానాలకు తావివ్వకుండా, స్పష్టంగా విశ్వాసుల ముందు ప్రకటించింది. ధర్మసంస్థాపనా ఉద్యమ కార్యకర్తలు అనేక రకాలుగా పరీక్షింపబడతారని దివ్య గ్రంథం మాటిమాటికీ సెలవిచ్చింది. ఈ పరీక్షల కొలిమిలో కాలి, తన్నుతాను మేలిమి బంగారంగా రుజువు చేసుకోనంతవరకు అల్లాహ్ ప్రీతి పొందడం సాధ్యం కాదని కూడా స్పష్టపర్చబడింది. ఒకవేళ పరిస్థితులను అనుకూలంగా, సాధ్యంగా పైకి కనబడుతూ ఉన్నప్పటికీ, విధి ఆ పరిస్థితులను కఠినంగా, అననుకూలంగా మార్చివేస్తుంది. విశ్వాసుల యొక్క విశ్వాసపు స్థాయి, స్థితి, నికార్సులను తప్పక పరీక్షిస్తుంది. దైవమార్గంలో కష్టాలు, బాధలతో కూడిన పయనం, ఒక విశ్వాసికి పరీక్షగా పరిగణించబడుతుంది. విశ్వాసులు ఈ పరీక్ష నుండి పయనించి, తాము విశ్వాసులమని రుజువు చేసుకోవడం తప్పనిసరి అవుతుంది. కాని నేటి మన విశ్వాసి అయిన సిపాయి, యుద్ధం ప్రారంభం కాక మునుపే, యుద్ధ మైదానం నుండి పలాయనం చిత్తగిస్తున్నాడు. యుద్ధ మైదానంలో పేలుతున్న ట్యాంకుల మోతలు, గర్జిస్తున్న తుపాకుల తూటాలు తన స్వభావానికి ఏమాత్రం గిట్టవని తలుస్తున్నాడు. అదే సమయంలో దేశం, దేశప్రజలు తనను ఒక గొప్ప వీర సిపాయిగా, ధీరోదాత్తునిగా కొనియాడాలని, పతకాలు, అవార్డులతో సన్మానించాలని ఆశిస్తున్నాడు. కాని, ఈ ఆశలు, కోరికలు అన్నీ తీర్చబడేది కేవలం అసలైన యుద్ధ మైదానంలో పాల్గొనడం ద్వారా మాత్రమే కదా!

## జాతి ప్రయోజనం అనబడే విగ్రహం

ఈ సందర్భంగా జాతి ప్రయోజనం అనబడే మంత్రం కూడా బహుధా

ప్రస్తావించబడుతుంది. ఎట్టి పరిస్థితిలోనూ న్యాయం చేయడం, అల్లాహ్ కొరకు సాక్ష్యం ఇవ్వడం లాంటి ఆచరణలలో, వ్యక్తికి, స్వంత తల్లిదండ్రులకు సయితం వ్యతిరేకంగా నిలవాల్సి వస్తుందని మనకు తెలుసు. (కూనూ ఖవ్వామీన బిల్ ఖిస్త్). అంతేకాక, విశ్వాసుల ధన ప్రాణాలను స్వర్గానికి బదులుగా కొనుక్కున్నట్లుగా అల్లాహ్ సెలవిచ్చిన సంగతి కూడా మనకు ఎరుకే.

ఈ దైవగ్రంథ వివరణలను సైతం నేడు విమర్శనాత్మకంగా చూచే ప్రబుద్ధులు తయారయ్యారు. ప్రతి సందర్భంలోనూ న్యాయంగా ఉండటం, సత్యసాక్ష్యం ఇవ్వడం – నీ జాతికీ, నీ వంశానికీ లేక నీ స్వయానికి నష్టదాయకంగా ఉంటే, అటువంటి న్యాయాన్ని, సత్యసాక్ష్యాన్ని గోడకేసి విసిరికొట్టు అని చెబుతున్నారు. అల్లాహ్ అభీష్టాన్ని నెరవేర్చడంలో నీ ప్రాణానికి, నీ ధనానికి నష్టం కలిగేలా ఉంటే – ఆ దైవాభీష్టానికి దూరం నుండే 'సలాం' చేసి సాగిపోవాలని నేర్పుతున్నారు. జాతి ప్రయోజనపు ప్రేమలో విశ్వాసుల బృందం తన ఉనికి యొక్క లక్ష్యాన్నే వదిలివేయడానికి సిద్ధపడటం మామూలు విషయం కాదు. ఈ ఆలోచనా పునాదులపై నిర్మింపబడిన ఆచరణల భవనం, దివ్య ఖుర్ఆన్ స్థాపించగోరే దివ్య భవంతికి పూర్తిగా వ్యతిరేకమైనది కాకమానదు కదా! ఈ భావజాలం గల వ్యక్తి తన్ను తాను 'ముస్లిం'గా భావించుగాక, కాని నిజానికి ఇతను కేవలం తన జాతి ప్రయోజనానికి – వ్యక్తి, ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలకు తన ధర్మాన్ని బలిపెట్టుతున్న 'ముస్లిం'గా భావించవలసి ఉంటుంది. ఈ భావజాలం గల వ్యక్తి పైకి ఇస్లాం గురించి మాట్లాడవచ్చు, పై పై ఆరాధనలను దీక్షగా నెరవేరుస్తూ ఉండవచ్చు. కాని, నిజానికి ఆ వ్యక్తి తన ధర్మావలంబనలో ఏదైనా ఒక ఆచరణ తన జాతి ప్రయోజనాలకు నష్టదాయకంగా ఉంటే, తక్షణం ఆ ఆచరణ నుండి వైదొలగిపోతాడు. ఈ వ్యక్తి ఈ భౌతిక ప్రాపంచిక లాభంకై ధర్మాన్నీ – జాతి ప్రయోజనంకై దైవాభీష్టాన్ని ధన సంపాదనకై – జీవిత లక్ష్యాన్నీ, సుఖశాంతులకై అవిరళ కృషినీ, బలిపెట్టడాన్ని మేధావితనంగా, విజ్ఞతగా భావిస్తాడు. ఈ భావజాలాన్ని, విశ్వాసపు తాత్వికతగా అంగీకరించగలమా? దైవగ్రంథం విశ్వాసుల బృందానికి ఇస్తున్న శిక్షణ ఇదేనా? ఈ భావజాలాన్ని తిరస్కార (కాఫిర్) భావజాలంగా కాక, మరో పేరుతో పిలవగలమా? ఖుర్ఆన్ యొక్క "అల్లాహ్ ఏ వ్యక్తి యొక్క శరీరంలోనూ రెండు హృదయాలను పెట్టలేదు" (33 : 4) అనే వాక్యం మనకు గుర్తే లేకుండా

పోయింది. ప్రతి మనిషి శరీరంలో ఒకే హృదయం ఉన్నప్పుడు, ఆ ఒకే హృదయంలో, ఒకే సమయంలో, ఇద్దరు ప్రియతములు, ఇద్దరు ఆరాధ్యులు ఎలా ఉండగలుగుతారు. ఒక్క హృదయంలో ఒకేసారి, ఒకరి పట్ల మాత్రమే ప్రేమ ఉండగలుగుతుంది. ఆ ప్రేమ, అయితే తన సృష్టికర్త పట్ల వుంటుంది. లేదా తన జాతి ప్రయోజనం పట్ల ఉండాలి. ఈ విషయమై ప్రవక్త ఈసా (అ) యొక్క వివేకవంతమైన ఉటంకింపును గుర్తుకు తెచ్చుకోవడం సబబుగా ఉంటుంది. "ఎవడునూ ఇద్దరు యజమానులకు సేవకునిగా ఉండనేరడు. అతడు ఒకనిని ద్వేషించి మరొకరిని ప్రేమించును. లేదా ఒకని పక్షం నుండి మరొకనిని తృణీకరించును. మీరు దేవునికినీ, సిరికినీ దాసులుగా ఉండనేరరు." (మత్తయి 6 : 24)

కనుక సిరిని ప్రేమించే భావజాలం ఎప్పటికీ సృష్టికర్త అల్లాహ్‌తో సంబంధం కలిగి ఉండజాలదు. ఇది సూర్యుని ప్రజ్వలమైన వెలుగు అంతటి సత్యం. కనుక జాతి ప్రయోజనాల వెంపర్లాట అనేది ఒక అతి ప్రమాదకరమైన విగ్రహారాధనతో సమానం. ఈ విగ్రహాన్ని బ్రద్దలు గొట్టకుండా ఇస్లామీయ ప్రయోజనం సాధ్యమే కాదు. ప్రవక్తశ్రీ (స) వారి కాలంలో విగ్రహారాధకుల ప్రయోజనాలు కూడా ఈ భౌతిక ధన సంపత్తులతోనే ముడివడి ఉండేవి. విగ్రహారాధన విమర్శింపబడినప్పుడల్లా, ఈ విగ్రహారాధకులైన కపట నాయకులు, **"మేము ఏదన్నా ఆపదల వలయంలో చిక్కుకుంటామేమో అనే భయం మాకు ఉంది" (5:52)** అని చెప్పేవారు. అంటే పూర్తి నిబద్ధతతో, ఏకోన్ముఖులై, ఇస్లామీయ ధర్మసంస్థాపనకోసం పూనుకుంటే ప్రపంచంలోని కష్టాలన్నీ ఒక్కసారిగా దాడి చేస్తాయి. సామాజిక వాతావరణం అంతా ఒక్కసారిగా ఇస్లాం కారణంగా శత్రుపూరితమైపోతుంది. ప్రపంచం మొత్తానికి మనమే లక్ష్యంగా అయిపోతాం. ఇదే విషయాన్ని ముహమ్మద్ (స) గారితో, పిరికి విగ్రహారాధకులు **"ఒకవేళ నీతో పాటు మేము కూడా ఈ మార్గదర్శకత్వాన్ని అవలంబిస్తే, మేము మా భూభాగం నుండి తొలగింపబడతాము" (28:57)** అని చెప్పేవారు.

నేడు జాతి ప్రయోజనాలే మా ధ్యేయం అని మాట్లాడే వారిని చూస్తే, నాటి కపటుల సంజాయిషీ గుర్తుకు రావడం లేదా? 'ఖుర్‌ఆన్ సంపూర్ణమైన సత్య ఉపదేశం కాగా, ప్రవక్తశ్రీ (స) వారు సత్యసంధతలో అగ్రగణ్యులు. కాగా, ఇస్లాం ఇహపర సాఫల్యానికి ఏకైక రాజమార్గం. అయినప్పటికీ, మనం ఖుర్‌ఆన్‌ను అనుసరిస్తే ప్రవక్తశ్రీ

(స) వారి సత్యసంధతను అనుసరిస్తే, ఇస్లాం మార్గంపై పయనిస్తే మాత్రం మనం నాశనమయిపోతాం.' ఇది ఎంత కుట్రపూరిత దుర్మార్గమైన భావమో ఆలోచించండి. "ఈ మార్గంలో పయనిస్తే మనపై అంతులేని కష్టాలు, బాధలు విరుచుకుపడతాయి. అణువు అణువు మనకు వ్యతిరేకంగా నిలుస్తుంది. మనం ఆర్థిక దాస్యానికి, రాజకీయ అంటరానితనానికి గురిఅవుతాము." శోచనీయం! కడు శోచనీయం!! ఈ భావన, ఆచరణ నిజానికి జాతిప్రయోజనాలకు ఆహ్వానమా? లేక దైవ అభిశాపానికి ఆహ్వానమా? ఆలోచించే మెదళ్ళు ఫెటేల్ మని పేలిపోక తప్పవు కదా!

## వాస్తవ ప్రయోజనాలకు షరతులు

ఇస్లామీయ ప్రయోజనాలు, ఉమ్మత్ ప్రయోజనాలు రెండూ వేర్వేరుగా ఉంటాయా? ఇస్లామీయ ప్రయోజనం, ఉమ్మత్ ప్రయోజనానికి వ్యతిరేకమైనదా? ఇస్లాంను ఆచరించటం అంటే, ప్రపంచానికి అందులోని సౌఖ్యాలకు తిలోదకాలు ఇవ్వడమేనా? దివ్య ఖుర్ఆన్ బోధనలు ఈ ప్రశ్నలకు 'కాదు' అని సమాధానం ఇస్తున్నాయి. ధర్మసంస్థాపనా విధిని నెరవేర్చడం ద్వారా ఉమ్మత్ యొక్క మరణానంతర జీవితమే కాదు, దాని ప్రాపంచిక జీవితం కూడా ఉజ్వలంగా ఉంటుంది. జీవితావసరాలు పొందడం, ధర్మబద్ధమైన కోరికలు తీర్చుకోవడం ఉమ్మత్ యొక్క హక్కుగా పరిగణించబడుతుంది. అవసరాలను తీర్చుకోవడానికి వెంపర్లాడవలసిన అవసరమే ఉండదు. అత్యుత్తమంగా అవసరాలను 'ఎంచి, ఎంచి' మరీ ప్రసాదించటం జరుగుతుంది. ఉదాహరణకు వ్యక్తి గౌరవం, శాంతి, సంతృప్తి, మానవ హక్కులు అన్నింటికీ గ్యారంటీ లభిస్తుంది.

ఈ విషయమై దివ్య ఖుర్ఆన్, **'విశ్వసించినవారికే, తమ విశ్వాసాన్ని దుర్మార్గంతో కలుషితం చేయనివారికే శాంతి. వారు మాత్రమే రుజుమార్గంపై ఉన్నారు" (6:82)** అంటుంది.

అదేవిధంగా ఆర్థిక పటిష్ఠత గురించి సంపదల పుష్టి గురించి అల్లాహ్ సెలవిస్తూ, **"నగరాల ప్రజలు విశ్వసించి భయభక్తుల వైఖరిని అవలంబించి ఉంటే, మేము వారికొరకు ఆకాశంలోని, భూమిలోని శుభాల ద్వారాలను తెరచి ఉంచేవారము" (7:96)** అని హామీ ఇవ్వటం జరిగింది.

మరోచోట "ఈ గ్రంథ ప్రజలు తౌరాతులోనూ, ఇంజీలులోనూ వారి ప్రభువు తరపు నుండి వారివద్దకు పంపబడిన ఇతర గ్రంథాలనూ అనుష్ఠించి ఉంటే ఎంత బాగుండేది. ఆ విధంగా చేసి ఉంటే వారి కొరకు ఆహారం పై నుండి వర్షించి ఉండేది. క్రింది నుండి పొంగి ఉండేది" (5:66) అనీ ...

రాజకీయ నాయకత్వం గురించి ప్రస్తావిస్తూ, జాతికి ప్రయోజనకరమైన అంశాలను అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు :

**"సౌశీల్యవంతులైన మా దాసులే భూమికి వారసులౌతారని వ్రాసిపెట్టాము." (21:105)**

**ఇంకా "మీరు విశ్వాసులే అయితే మీరే ప్రాబల్యం పొందుతారు" (3:139), ఇంకా ఇంకా ...**

"మీలో విశ్వసించి మంచిపనులు చేసేవారికి అల్లాహ్ చేసిన వాగ్దానమేమిటంటే, ఆయన వారిని వారికి పూర్వం గతించిన ప్రజలను చేసిన విధంగా భూమిపై ఖలీఫాలు (ప్రతినిధులు) గా చేస్తాడు. వారికై అంగీకరించిన వారి ధర్మాన్ని వారికొరకు పటిష్ఠమైన పునాదులపై స్థాపిస్తాడు. వారి ప్రస్తుత భయస్థితిని, శాంతిభద్రతలతో కూడిన స్థితిగా మారుస్తాడు" (24:55)

మరోచోట అల్లాహ్ ఇలా ధైర్యాన్ని ఇస్తూ "మీరు గనక స్వయంగా సన్మార్గంలో ఉంటే, ఇతరులు మార్గభ్రష్టులు అయినప్పటికీ మీకు ఎంతమాత్రమూ హాని కలగదు" (5:105) అని సెలవిచ్చాడు.

పైన ఉదాహరించబడిన దివ్య ఖుర్ఆన్ సత్య వాగ్దానాలన్నీ మన ముందు స్పష్టంగా ఉన్నాయి. ధర్మసంస్థాపనా కృషి చేయడం వల్ల ఎదురు అవుతాయని భావించబడుతున్న భయానక పరిస్థితులను దివ్య ఖుర్ఆన్ వెలుగులో గమనిస్తే అవి అన్నీ కేవలం అపోహలని అర్థమవుతున్నాయి. ముస్లింల జాతి ప్రయోజనాలను, ఈ అనవసర ధర్మసంస్థాపనా కృషి మింగివేయగలదని వాదించేవారు ఇంకా తమ వాదనలకే కట్టుబడి ఉండటం భావ్యమేనా? తత్భిన్నంగా, ముస్లిం ఉమ్మత్ మొత్తంగా, నికార్సైన విశ్వాసం, సత్కార్యాల సమాహారపు జీవితాన్ని ఆచరించడం మొదలెడితే, ధర్మసంస్థాపనా కృషిని దృఢంగా నిష్ఠతో కొనసాగిస్తే, దాని ఫలితంగా మనకు పైన

పేర్కొన్న ఖుర్‌ఆన్ వాగ్దానాల ప్రయోజనాలన్నీ తప్పనిసరిగా ప్రాప్తమవుతాయి అనడంలో ఎలాంటి సందేహమే లేదు. నిజానికి ఈ ప్రయోజనాలే జాతికి నిజమైన ఉన్నతమైన ప్రయోజనాలుగా ఉంటాయి.

అలాగాక, ఏ దురదృష్టవంతునికైనా అసలు విశ్వాసపు శక్తిపైనే నమ్మకం లేకుండాపోతే, అల్లాహ్ వాగ్దానాలపై కూడా అతనికి ఎటువంటి నమ్మకమూ లేనట్లయితే, ఆ వ్యక్తి ఉమ్మతె ముస్లిమా గురించి మాట్లాడటమే పెద్ద దుర్మార్గంగా భావించవలసి ఉంటుంది. ఇటువంటి వ్యక్తికి ఎంత గొప్ప నికార్సైన సాక్ష్యం చూపినప్పటికీ అతను సంతృప్తి చెందలేదు. ఇటువంటి వ్యక్తికి ధర్మసంస్థాపన కాదుగదా, ఇస్లాం భావజాలమే నష్టదాయకంగా పరిణమించగలదు.

అల్లాహ్ చేత ప్రకటించబడిన వాగ్దానాలు, సంక్షేమాలు, వరాలు, గౌరవనీయ స్థానాలు అన్నీ కూడా, తీవ్రమైన కృషి, త్యాగాల, కష్టాల ఫలితంగానే లభిస్తాయనేది ఎవరూ కాదనలేని సత్యం. ఉద్యమ ప్రారంభంలో ముస్లింల సంఘం, ఎంతో కొంత పోగొట్టుకోక తప్పదు కూడా. అయితే ఈ కోల్పోవడం అనేది కేవలం ఇస్లామీయ లక్ష్యాల కోసం మాత్రమే ప్రత్యేకించబడలేదు. ఎవరు, ఏ లక్ష్యసాధనకోసం కృషి చేసినా, ప్రారంభంలో వారు, ఆ లక్ష్యసాధన కోసం ఎంతో కొంత పోగొట్టుకోవలసి ఉంటుంది. ఎవరైనా, ఏదైనా పొందాలనుకుంటే, అతను ఎంతో కొంత పోగొట్టుకోక తప్పదు. రైతు తన పొలం నుండి పంటను పొందాలనుకొన్నప్పుడు, పంట చేతికి రాకమునుపే, తన శ్రమను, ధనాన్ని, శ్రద్ధను తప్పనిసరిగా వెచ్చించవలసి వస్తుంది కదా? కనుక ఎవరైనా జాతి ప్రయోజనాల పంటను పొందాలనుకుంటే, దానికి ముందు తప్పనిసరిగా, దానికి అవసరమైన శ్రమ, కృషి, ధనం, శ్రద్ధలను వెచ్చించక తప్పదు. ఈ శ్రమ, శ్రద్ధ, కృషిలో లాభాలు తప్పకుండా లభించగలవు. కేవలం కొంత పైకాన్ని ఖర్చుపెట్టి చివరగా బంగారు మూటను పొందడం లాభదాయకం కాదా? ఈ లాభాన్ని 'ప్రయోజనాలకు నష్టదాయకం' అని భావించడం బుద్ధిమంతుల లక్షణం అవుతుందా?

## అడ్డ (డొంక) దారి

నేటి అననుకూల పరిస్థితుల్లో మన జీవిత లక్ష్యం అయిన ధర్మసంస్థాపనా

విధిని నెరవేర్చేడానికి ఏవైనా అడ్డదారులు, డొంకదారులు ఉన్నాయా? అని వెతికేవారూ లేకపోలేదు. ఈ అడ్డదారులు ఎన్నటికీ వాస్తవ విజయాలను అందజేయలేవని మనం స్పష్టం చేయక తప్పదు. ఇప్పటివరకు నడిచిన ఇస్లామీయ చరిత్ర అనుభవం, స్వయంగా మనిషి బుద్ధీ వివేచనలు ఈ విషయాన్నే స్పష్టపరుస్తూ ఉన్నాయి. ఏ విధమైన అడ్డదారి పాలసీలను గానీ ఉపయోగించి ధర్మసంస్థాపనా విధి నెరవేర్చబడినట్లు మనకు ఎక్కడా దాఖలాలు కనపడవు. ధర్మసంస్థాపనా కృషి సర్వావస్థల్లోనూ కొనసాగించబడింది. శాంతి, అశాంతి కాలంలోనూ, స్వతంత్రుల బానిసలలోనూ, ధనవంతులు–పేదవారి మధ్యలోనూ, ప్రతి తెగ–ప్రాంతాలలోను ఈ కృషి చేయబడింది. ప్రతి కాలంలోనూ, అన్ని రకాల సామాజిక స్థితిగతులలోనూ ప్రవక్తలు అరుదెంచారు. ఇలా అరుదెంచిన ప్రవక్తల అన్ని బోధనలు కంటే ముందుగా, ప్రప్రథమంగా, “(ఓ దైవదాసులారా!) అల్లాహ్‌ను ఆరాధించండి, మిథ్యా దైవాల (తాగూత్‌ల) ఆరాధనకు దూరంగా ఉండండి” (16:36) అని బోధించారు.

ఏ ప్రవక్త అయినా తన కాలంలో పైన పేర్కొన్న బోధనలే ప్రధానంగా బోధించాడు తప్ప ఎవరూ ఏ అడ్డదారి పాలసీని – వేచి చూచే పద్ధతిని పాటించినట్లు మనకు ఎక్కడా కనబడదు. ప్రవక్తల అనుచర సమాజమైన మనం ప్రవక్తలందరి ఈ సత్ సాంప్రదాయాన్ని పాటించకుండా, అడ్డదారుల కోసం వెతకటాన్ని ధర్మశాస్త్రం (షరీఅత్) అనుమతిస్తుందా? ప్రవక్తల పరంపరలో, ప్రవక్తల కాలం, వాటి సామాజిక పరిస్థితులు, సమస్యలూ ఒక్కటిగా లేవు. ఆయా కాలాల్లోని పరిస్థితులు వేరువేరుగా ఉండేవి. అయినా ప్రవక్తల పిలుపు మాత్రం ఏ కాలంలోనైనా, ఏ పరిస్థితిలోనైనా ఒకటిగానే ఉండింది. మరి నేటి 21వ శతాబ్దపు కాలం పై పరిస్థితులకు ఎలా భిన్నమైపోయింది. విభిన్న కాలాల్లో విభిన్న పరిస్థితుల్లో ‘ఒకే నినాదం’ ఇవ్వబడినప్పుడు అదే ‘నినాదం’ నేటి పరిస్థితులకు ఎందుకు పనికిరాదు?

బుద్ధి, వివేకం, ఇంగితజ్ఞానం ఉన్న వ్యక్తి ఈ వాదనను ఎప్పటికీ చేయలేడు – ధర్మసంస్థాపనా విధి నెరవేర్పునకు ఉన్న ప్రాథమిక సూత్రాలు, విధనాలు ఎన్నటికీ మారవు. అవి అన్ని కాలాలకు ఒకేవిధంగా ఉండితీరుతాయి. గతంలోనూ, వర్తమానంలోనూ, భవిష్యత్తులోనూ ఒకేవిధంగా ఉంటాయి. అయితే కేవలం బాహ్య అంశాలలో మాత్రమే తాత్కాలిక భావనలలో మాత్రమే మార్పులకు, చేర్పులకు

అవకాశం ఉంటుంది. మొదటి శతాబ్ది, రెండవ శతాబ్దానికి భిన్నమైనదే. అదేవిధంగా నేటి వరకు గడచిన కాలమంతా శతాబ్దాల రూపంలో దేనికదే విభిన్నమైనదే. ఆయా కాలాల్లోని సాధనాలలో వ్యత్యాసం ఉండగలవేమో తప్ప – లక్ష్యం, విధానం, సూత్రబద్ధ కృషిలో ఏమాత్రం తేడా ఉండదు. నేటి క్రీస్తు శకం, నాటి మూసా శకానికి భిన్నమైనదే. మూసా శకం, ఇబ్రాహీం శకానికి భిన్నమైనదే. ఈ భిన్నత్వాలు ఉన్నప్పటికీ, ప్రవక్తలందరూ ఏ తేడా లేకుండా ఒకేవిధమైన పని విధానాన్ని అవలంబించారు. కనుక ఈ పని విధానం ఒక్కటే సరైనదనీ, శాస్త్రీయమైనదనీ ప్రవక్తల ఆచరణ స్వయంగా సాక్ష్యం ఇస్తుంది. ఈ కారణంగా నేటికి కూడా ఈ పని విధానమే సరైనదని రూఢీ అవుతుంది. ఈ పని విధానమే ఒక విశ్వాసి యొక్క జీవిత లక్ష్యం అయిన 'ధర్మసంస్థాపనా కృషిని' దాని హద్దుల వరకూ చేర్చగలుగుతుంది. నిజంగా డొంకదారులు, అడ్డదారులు – ఇచ్చిపుచ్చుకునే దారులు అవలంబించవలసి ఉంటే స్వయంగా మానవ మహోపకారి (స) గారికి, వారి జీవితంలో ఈ దారులు ఎన్నో చూపబడ్డాయి. ఖురైష్ సర్దారులు ప్రతిపాదించిన అనేక విషయాలు ఈ కోవకు చెందినవే. గత పేజీలల్లో మనం వాటిని స్పష్టంగా చూశాము – మరోసారి నాటి ఖురైష్ సర్దారుల ఒక ప్రతిపాదనను ఈ సందర్భంగా గుర్తుచేసుకుందాం. దానికి ప్రతిగా ప్రవక్తశ్రీ (స) వారి పని విధానాన్ని కూడా తెలుసుకుందాం. ఖురైష్ సర్దారులు ప్రవక్తశ్రీ (స) వారిని తమ రాజుగా చేసుకోవటానికి అంగీకరించారు. దానికి బదులుగా 'తౌహీద్' (ఏకదైవారాధన) సందేశాన్ని ఆపమని కూడా వారు షరతు విధించలేదు. వారు కేవలం ప్రవక్తశ్రీ (స) వారు 'తమ విగ్రహాలను విమర్శించ కూడదని' మాత్రమే షరతు పెట్టారు. తమ మిథ్యా ధర్మంలోని లోపాలను ఎత్తి చూపకూడదని మాత్రమే వారు కోరారు. నేటి మన రాజకీయ మన్యుల కోరికల మేరకు ఈ షరతు ఎగిరి గంతేసి ఆమోదించదగినదిగా ఉంది. అలా ఆమోదించకుండా ఉండటం 'హరాం' (అధర్మం)గా భావించేవారు కూడా వుండవచ్చు. వీరే గనుక ఆనాడు ప్రవక్తశ్రీ (స) వారికి సలహాలిచ్చే స్థాయిలో ఉంటే, ప్రవక్తశ్రీ (స) వారు ఈ ప్రతిపాదనను వెంటనే అంగీకరించాలని సలహా ఇచ్చివుండేవారు. ఫలితంగా ఒక వైపున ప్రశాంతత ఏర్పడి; తౌహీద్ సందేశానికి అడ్డంకులు తొలగిపోయి ఉండేవి. మరోవైపున ప్రవక్తశ్రీ (స) వారికి, వారి అనుచర సమాజానికి ప్రాణాంతక స్థితి తప్పివుండేది. అంతేకాదు, అరబ్బుల రాజుగా చేతికి అందివచ్చిన అధికారాన్ని ఉపయోగించి అత్యంత 'వివేకవంతంగా' తన ధర్మం యొక్క విశ్వాసపు వ్రేళ్ళను ప్రజల హృదయాలలో

ప్రతిష్ఠింపజేసే అవకాశమూ ఉండేది. ఈ స్థితి క్రమక్రమంగా అరబ్బు ప్రాంతం మొత్తాన్ని మార్చివేసి ఉండేది. ధర్మం నిరాఘాటంగా స్థాపించబడి ఉండేది. కాని, కాలం సాక్షి! ఈ 'బంగారు అవకాశాన్ని' ప్రవక్త(శ్రీ (స) వారు నిర్ద్వంద్వంగా త్రోసిపుచ్చారు. దానికి బదులుగా ఇచ్చిన జవాబు చరిత్రలో సువర్ణాక్షరాలలో నేటికి – ఎప్పటికీ, లిఖించబడి ఉంటుంది. ఆ జవాబు ఇలా ఉండింది :

"నేను మీ వద్దకు ఏ సందేశాన్ని తీసుకొని వచ్చానో – దానికి ప్రతిఫలంగా మీ వద్ద నుండి సంపదను పొందడం లేక గౌరవోన్నతుల పదవులు పొందడం నా అభిమతం కానేకాదు. మీకు రాజుగా మారడం నా లక్ష్యమూ కాదు. నేను నా (మీ) ప్రభువు సందేశాన్ని మీ వరకు చేరవేశాను. ఆ విధిని నేను నెరవేర్చాను. మీరు నా సందేశాన్ని అంగీకరిస్తే, మీకు ఇహపరాలలో శ్రేయో–సాఫల్యాలు ప్రాప్తిస్తాయి. ఒకవేళ మీరు ఈ సందేశాన్ని తిరస్కరిస్తే, నేను మాత్రం ఈ సందేశ ప్రచార విధిని నెరవేరుస్తూ ఉంటాను. మీకు, నాకు మధ్య ఆ విశ్వప్రభువు తీర్పు తీర్చే వరకూ ఈ కృషి కొనసాగుతుంటుంది. (ఇబ్నె హిష్షామ్ – మొదటి భాగం)

పైన పేర్కొన్న మాటలు ఆవేశంలోనో, అత్యుత్సాహంలోనో పలికిన మాటలు కావు. ఈ మాటలు మహా మేధావి, మహా వివేకి, శాంత స్వభావ వ్యక్తిత్వం అయిన ప్రవక్త(శ్రీ (స) వారి నోట వెలువడినాయి. ఈ వ్యక్తిత్వం నోటి నుండి వచ్చిన ప్రతిమాట సృష్టికర్త అల్లాహ్ పర్యవేక్షణలోనే బయటికి వస్తాయని మనం పూర్తిగా విశ్వసిస్తాం. ఈ వ్యక్తిత్వం తన జీవిత కాలంలో ఎప్పుడు కూడా ఆవేశానికి లోనై ఎన్నడూ ఒక్క పదం కూడా పలికి ఎరుగదు. కనుక ఒక విశ్వాసి ప్రవక్త ముహమ్మద్ (స) తీసుకున్న నిర్ణయాన్ని పొరపాటు నిర్ణయంగా భావించడాన్ని కూడా ఆమోదించడు. అన్ని పరిస్థితులు అనుకూలంగా, తన చేతిలో పగ్గాల రూపంలో అందుతూ ఉన్నప్పటికీ, ప్రవక్త(శ్రీ (స) వారు ఆ డొంకతిరుగుడు మార్గాన్ని నిర్ద్వంద్వంగా వ్యతిరేకించారు. ఈ వ్యతిరేకించడం, ధర్మసంస్థాపనా విధి నిర్వహణకు, అడ్డదారులు పనికిరావని చెప్పడానికి ప్రబల సాక్ష్యంగా పేర్కొనవచ్చు. డొంకదారులు, అడ్డదారులు – సోకాల్డ్ మేధావులకు, సరైనవిగా కనబడవచ్చు గాక, కాని, ప్రవక్తతత్వపు వివేకానికి, మేధావితనానికి ఏమాత్రం పొసగేవి కావు.

హేతుబద్ధంగా ఆలోచించినప్పటికీ అడ్డదారి ప్రయాణం ఏమాత్రం ప్రయోజనకరం కాదని ఇట్టే తేలిపోతుంది. అడ్డదారి అంటేనే అసత్యాన్ని, సత్యంగా చూడడమని అర్థమౌతుంది. అంటే; నేడు ఒక ముస్లిం ఏ అసత్యపు బురదలో కూరుకొని ఉన్నాడో - దాన్నుండి బయటపడి మరో క్రొత్త అసత్యపు ఊబిలో దిగబడటంగా భావించవలసి ఉంటుంది. ప్రస్తుత అసత్య కట్టడాన్ని కూల్చివేసి, అడ్డదారి ద్వారా మరో అసత్య నిర్మాణాన్ని నిర్మించగలమే తప్ప సత్యనిర్మాణాన్ని నిర్మించనేలేము. ఇది కేవలం ఊహలపై ఆధారపడిన ఊహావాదం. నిజ ఆచరణకు ఏమాత్రం సాధ్యం కాదు. అడ్డదారి ద్వారా తెచ్చుకున్న నిర్మాణం పైకి ఎంత అనుకూలంగా కన్పిస్తున్నప్పటికీ – అది సత్య నిర్మాణానికి, ధర్మసంస్థాపనకు ఏమాత్రం అనుకూలమైనది కాదు. ఇది మన కళ్ళముందు గడిచిన చరిత్ర చెప్పిన సజీవ సత్యం. ఈ చారిత్రక సత్యం కోసం ఎక్కడో వెతకవలసిన అవసరమే లేదు. మన దేశ చరిత్రలోనే గమనించండి. భారత దేశంలో నేడు చెప్పబడుతున్న 'ఇస్లామీయ పాలనలే' ఉండేవి. మేధావులు ఆశిస్తున్న లక్షణాలన్నీ ఉండేవి. అయినప్పటికీ ఇక్కడ 'ధర్మసంస్థాపన' అనే నినాదం ఇచ్చిన వెంటనే బ్రతుకు దుర్భరం అయిపోయేది. ఈ కష్టాల కెరటాలను ఉరికింప చేసింది ముస్లిం పాలకులే అనేది మరచిపోరాదు. ప్రవక్త ఈసా (అ) జీవితాన్ని పరిశీలించండి. ఆనాడు రోము సామ్రాజ్య పరిపాలనలో మొత్తంగా ఇస్రాయీలీయులు ఉండేవారు. ప్రవక్త ఈసా (అ) ధర్మసంస్థాపన గురించి నినదించడం మొదలెట్టగానే, రోమ్ పాలకుల కంటే ముందుగా ఈసా (అ)ను బాధలకు, కష్టాలకు గురిచేసింది ఆయన స్వజాతివారే అనేది మనకందరికీ తెలుసు. మరోమాటలో ఆనాటి 'ముస్లింలే' ప్రవక్త ఈసా (అ)ను వ్యతిరేకించడంలో మొదటి వరుసలో నిలిచారు.

ఇక మన ప్రస్తుత కాలాన్ని తీసుకోండి. షేక్ ముహమ్మద్ బిన్ అబుల్ వహ్హాబ్ నజ్దీ (రహ్మ) ప్రారంభించిన ధర్మప్రచార ఉద్యమంపై ఆనాటి 'ముస్లిం' పాలకులే కన్నెర్రజేశారు. అంతులేని బాధలతో కష్టాలతో నజ్దీ (రహ్మ)కు స్వాగతం పలికారు. మరోధర్మ ప్రచారకుడు షేక్ జమాలుద్దీన్ అఫ్గాని (రహ్మ) ప్రారంభించిన ధర్మప్రచార ఉద్యమాన్ని ఆనాటి 'ఇస్లామీయ ప్రభుత్వాలే(?)' ఆయనకు నిలువ నీడ కూడా లేకుండా చేశాయి. ఇస్లాం పేరుపై దేశాన్ని ఏర్పాటు చేసిన పాకిస్తాన్ పాలకుల ముందు ధర్మసంస్థాపన గురించి ప్రస్తావించి క్షేమంగా తిరిగి రావడం నేడు

సాధ్యమౌతుందా? ఈజిప్టులోని మిలిటరీ ప్రభుత్వం కూడా ఇస్లాంని అంగీకరించేదే. అయినా అక్కడి ధర్మసంస్థాపనా కార్యకర్తలతో ఎంత కిరాతకంగా వ్యవహరించిందో ప్రపంచం చూసింది.

కనుక ఈ వాదనలన్నీ ఆయా సందర్భాలలో, దివ్య ఖుర్‌ఆన్ సందేశానికి భీతిల్లిన శక్తులు పలికే భీరువు వాదాలుగా ఉంటాయి తప్ప మరేమీ కావు. ప్రవక్తశ్రీ (స) వారు ప్రకటిస్తూ వచ్చిన దివ్య ఖుర్‌ఆన్ బోధనలకు బెంబేలెత్తిన కపటులు ప్రవక్తశ్రీ (స) వారితో "ఈ ఖురానుకు బదులు మరో ఖురానును తీసుకు రా! లేదా ఈ ఖురానులో కొన్ని మార్పులు, చేర్పులు మాకు అనుకూలంగా చేయి" అని చెప్పేవారు. నేటి ఆత్యయిక పరిస్థితులే ఆనాడు కూడా ఉండేవి. రూపం వేరు కావచ్చుగాని, వాటి స్వభావం మాత్రం ఒకటిగానే ఉండేది. ఆనాడు కూడా అవి సత్యమార్గాన్ని నిరోధించేవి. నేడు కూడా సత్యమార్గాన్ని నిరోధించడానికి తన పూర్తి స్థాయి శక్తిని ఒడ్డి కృషి చేస్తాయి. అడ్డదారుల వెంబడి లక్ష్యాన్ని సాధించాలని బయలుదేరేవారు, అడ్డదారుల చిక్కుల్లో ఇరుక్కొని పోకతప్పదు. ధర్మసంస్థాపనా విధి నిర్వహణ ఈ అడ్డదారి ప్రయాణీకునికి, ఈ అడ్డదారిలో ఎప్పటికీ సాధ్యమే కాదు.



# 3. సంపూర్ణ - శాశ్వత నిరాశా నిస్పృహాలు !?

## భయానకమైన లజ్జా విహీనత

ఇక మూడవ వర్గం కూడా, రెండవ వర్గం మాదిరిగానే ఆలోచిస్తూ ఉంటుంది. కనుక ఈ మూడవ వర్గం ఆలోచనలను ప్రత్యేకించి ప్రస్తావించవలసిన అవసరమే లేదు. గత పేజీలలో చేసిన చర్చ అందుకు సరిపోతుంది. విధి నుండి ముఖం త్రిప్పుకోవడం, ధ్యేయాన్ని విస్మరించటం లాంటి వ్యాధులు - రాజకీయ దూరదృష్టి, అనుకూల పరిస్థితుల పరదాల వెనుక దాచిపెట్టుకొనే ప్రయత్నం తప్ప మరేమీ కాదు. పై పేజీలలో జరిగిన చర్చ ద్వారా వీరి ముఖంపైని ముసుగు పూర్తిగా తొలగించే ప్రయత్నం జరిగింది. అయితే, ఈ ముసుగు ధరింపు వెనుక వీరిలో ఏ విశ్వాసపు హీనత పనిచేస్తుందో తలచుకుంటే మనసు కలత చెందక తప్పదు. వీరి భావ దారిద్ర్యం ఎంత వరకు దిగజారిందంటే, వీరు తమ బట్టలను వదిలివేసి నగ్నంగా తయారయ్యారా? అనిపిస్తుంది. ఈ నగ్న ధారణ వీరు స్పృహలో ఉండి చేస్తున్నారో లేక స్పృహ తప్పిన స్థితిలో చేస్తున్నారో ఆ దైవానికే ఎరుక. ధర్మసంస్థాపన మాత్రమే తప్పనిసరి ఏకైక లక్ష్యంగా గల ముస్లిం సమాజం, ఈ లక్ష్యాన్ని ఆమోదిస్తూనే, మనలాంటి బలహీన విశ్వాసులకు ఇది సాధ్యం కాదని తీర్మానించడం జరుగుతుంది. స్వయాన సందేశహరుల (స) శిక్షణ పొందిన సంఘమే (సహాబాల బృందమే) కేవలం 30 ఏళ్ళ కంటే ఎక్కువ కాలం ఈ ధర్మ రాజ్యాన్ని నిర్వర్తించలేకపోయినప్పుడు - 14 వందల సంవత్సరాల తర్వాత అదే నమూనా గల 'ధర్మరాజ్యం' ఎలా సాధ్యమని ప్రశ్నించడం జరుగుతుంది. ఈ ప్రశ్న చూడటానికి అమాయకంగా కన్పిస్తున్నప్పటికీ, నిజానికి ఈ ప్రశ్న అత్యంత ద్రోహపూరితమైనది. ఎందుకంటే, ఒక వ్యక్తి ధర్మసంస్థాపనా కృషి నుండి ప్రక్కకు తొలగిపోయి, సత్య తిరస్కారులు, దైవధిక్కారులతో చట్టాపట్టాల్ వేసుకొని కపట పాలసీలు ఆమోదించే వ్యక్తికి ఇస్లామీయ జీవన వరుసల్లో నిలిచే స్థానం లభించడం సాధ్యం కాదు. ప్రవక్తశ్రీ (స) వారు ఇటువంటి వారి స్థానాల్ని

విశ్వాసపు అధమస్థాయి కంటే దిగజారిన స్థానాన్ని కేటాయించారు. ఎంతటి బలహీనత ఉన్నా, అననుకూల పరిస్థితులు ఉన్నా, తన జీవిత లక్ష్యం నుండి ఒక ముస్లిం తన ప్రయాణపు దిశను మార్చుకోవడం సాధ్యం కాదు. ఇస్లాం తన మార్గాన్ని 'కారుచవుక ఎడిషన్'గా చెప్పనేలేదు. సఫలతలు, విజయాలు అతి తక్కువ ధరలకు లభిస్తాయని కూడా చెప్పలేదు. ఎవరైనా అలా భావిస్తే అది వారి తప్పుడు అవగాహనకు నిదర్శనం కాగలదు.

## ఖిలాఫత్ నుండి చారిత్రక రుజువులు

ధర్మసంస్థాపనకు వ్యతిరేకంగా మాట్లాడే ముస్లింలు ప్రధానంగా, వారి వాదనకు అవసరమైన, కొత్తదైన రుజువులను సహాబాల నుండి చూపిస్తారు. ప్రవక్తశ్రీ (స) వారి సహచరుల ఆధ్వర్యంలోనే ఈ 'ధర్మరాజ్యం' కేవలం 30 సంవత్సరాలు మాత్రమే ఉండి మనగలిగింది. కనుక ఈ ధర్మసంస్థాపన కోసం ఇప్పుడు కృషి చేయడం, శ్రమించడం ఎంతమాత్రమూ సాధ్యం కాదు.

నిజానికి ఈ వాదం, దానికి చూపుతున్న రుజువు చాలా బలమైనదిగా కనబడి, ఒక ఉద్యమ కార్యకర్తపై బలమైన ప్రభావాన్ని వేయగలుగుతుంది. ముస్లింల ధైర్యాన్ని తొలచివేసి వారిలో నిరాశా నిస్పృహలు కలుగచేయడానికి ఈ వాదం చాలా బాగా ఉపయోగపడుతుంది. ఈ చారిత్రక రుజువు కేవలం ఉత్సాహపూరితమైన కార్యకర్తనే కాదు, ఆలోచనాపరులైన కార్యకర్తలను సైతం నిరాశకు గురిచేయగలుగుతుంది.

అయితే ఈ సాక్ష్యాలు, రుజువులన్నీ వాస్తవ విరుద్ధమైన ఆలోచనలపై ఆధారపడినవి మాత్రమే. ఏ అంశాన్ని వీరు రుజువుగా చూపించి, ధర్మసంస్థాపన సాధ్యం కాదని వాదిస్తున్నారో – నిజానికి ఈ వాదన ధర్మసంస్థాపనా విధితో ఎలాంటి సంబంధం లేనిది మాత్రమే. ఏదైనా ఒక జీవిత విధానాన్ని మీరు సంపూర్ణంగా విశ్వసించినపుడు, ఆ జీవిత విధానం మీ నుండి కోరుతున్న డిమాండ్లను తప్పకుండా నెరవేర్చవలసి ఉంటుంది. ఆ జీవిత విధానం ఒక సుదీర్ఘకాలం కొనసాగుతుందా? లేక స్వల్ప వ్యవధిలోనే ముగిసిందా? అనే వాదనతో ఎలాంటి సంబంధం ఉండదు. ఈ వాద వివాదంలో పడి ఒక వ్యక్తి తన విశ్వాసానికి, దాని అమలుకు (మాటకు – చేతకు) మధ్య వైరుధ్యం చూపించడం కుదరదు. అలాచేస్తే ఈ చర్య ఆ వ్యక్తి

యొక్క నీచత్వానికి నిదర్శనంగా ఉంటుంది. మనం ఇస్లాంను అంగీకరించింది అది ఒక సత్యమైన జీవిత విధానమనే కదా? లేక మరో కారణం ఏదైనా ఉందా? అలా కారణం గనక ఉంటే, మనకు ఇస్లాం యొక్క ధార్మిక, పరలోక భావజాలంతో ఏ మాత్రం సంబంధం ఉండటానికి వీలులేదు. ఈ ధర్మం కోసం కృషిచేయవలసిన అవసరం కూడా లేదు. నేరారోపణలకు అవకాశం కూడా లేదు. అలాకాక, ఒక ముస్లింగా, ఇస్లాంను సత్యధర్మంగా అంగీకరిస్తే, దాని సాధ్యాసాధ్యాలపై చర్చించటం ఏమాత్రం సాధ్యం కాదు. ఈ ధర్మం, 30 లేక 40 సంవత్సరాలు కాదు, కేవలం ఒక్కరోజు, ఆ ధర్మం తన పూర్తి విశ్వరూప ప్రమాణంతో ఉనికిలో ఉండి పోయినా, దానికోసం కృషి చేయడం ఒక విశ్వాసికి పరమ విధి అయిపోతుంది. ఈ విధికోసం తన సర్వస్వాన్ని ధారపోసి కృషి చేయడం కూడా తప్పనిసరి అవుతుంది. ఎప్పుడైతే మనం ఒక విషయాన్ని విశ్వసించామో, దాని ధ్వజవాహకుల బాధ్యత స్వీకరించామో – ఇక మనకు ఆ మార్గంలో ఎప్పుడు, ఎవరు ఏమి చేశారు? లేక ఆ మార్గంలో ఎప్పుడు ఏమి జరిగింది? అని ఆలోచించే వీలే పడదు. ఇక మన ఆచరణను, మన జీవిత లక్ష్యం శాసిస్తుందే తప్ప - తారీఖులు దస్తావేజులు, చారిత్రక ఘట్టాలు ఎంతమాత్రమూ కావు.

చారిత్రక రుజువుల (?) వాదనను ఖండించడం, కనీసం దానిని తర్కించకపోవడం పాఠక మిత్రులకు నచ్చకపోయి ఉండవచ్చు. చాలా నిర్లక్ష్యంగా ఇచ్చిన నా ఈ సమాధానంతో సంతృప్తి చెందక పోయివుండవచ్చు. ధర్మసంస్థాపనా కృషిలో ఇంతటి నిర్లక్ష్య పూరిత సమాధానాన్ని నిరసించనూవచ్చు. అయితే రండి! ఈ విషయానికి సంబంధించి తార్కికంగా, హేతుబద్ధంగా, మరింత లోతుగా ఆలోచిద్దాం! ఈ ఆలోచన మనలను ఎక్కడి వరకు తీసుకొని వెళుతుందో కూడా చూద్దాం. దివ్య ఖుర్ఆన్, ప్రవక్త సంప్రదాయంలో ఒక విశ్వాసి యొక్క గుణవిశేషాల స్థాయి గురించి స్పష్టంగా చెప్పబడింది. అల్లాహ్, ఆయన ప్రవక్త (స) ఈ విషయమై మనకు అత్యున్నతమైన ఇస్లామీయ విశ్వాసపు ప్రమాణాల్ని కూడా అందించారు. ఈ ప్రమాణపు స్థాయిని అందుకోవడం ద్వారా ఒక అబూబక్ర్, ఉమర్, అలీ, అబూజర్, అమ్మార్, సల్మాన్ ఫార్సీ, సుహైబ్ రూమీ, బిలాల్ హబ్షీ (ర.అన్హుం) లాంటి గొప్ప వ్యక్తిత్వాలు కొన్ని వందలు లేక వేల సంఖ్యలో ఉనికిలోకి వచ్చాయి. నేటి

కాలంలో దీపం పట్టుకొని వెతికినా ఇటువంటి వ్యక్తిత్వాలు ఒక్కటి కూడా కానరావు. అయితే, ఇక్కడే కొంత తర్కంతో ఆలోచించవలసి ఉంటుంది. ఈ తర్కంతోనే కదా ఖిలాఫతే రాషిదా గురించి నిరాశా నిస్పృహలకు గురైన మేధావులు మాట్లాడారు? ఈ తర్కం పునాది మీదనే కదా, ధర్మసంస్థాపనా కృషి ఒక అనవసరమైన, అసాధ్యమైన కృషిగా ధర్మోపదేశం చేస్తున్నారు? వీరు మరింత ముందుకెళ్ళి పైన పేర్కొన్న ఉన్నత వ్యక్తిత్వాల విశ్వాసపు స్థాయిని సాధించడం అసంభవమని ఫత్వా ఇస్తున్నారు. ఈ కృషిని విసిరికొట్టాలని కూడా సలహాలు ఇస్తున్నారు. ఈ ఫత్వాల, సలహాల ప్రకారం ఒక ముస్లిం, ఒక ముస్లింగా మిగిలి ఉండటం సాధ్యం కాదు. ఎందుకంటే, ఒక ఉన్నత స్థాయి ముస్లిం తయారు కావడమే అసాధ్యమైతే, అతను ముస్లింగా ఉండటం ఎలా సాధ్యమౌతుంది? ఈ రెండు అంశాలు ఒకదానికొకటి రుజువులుగా ఉంటాయి. ఆదర్శవంత ఖలీఫాల అతి తక్కువ కాల పరిపాలనను - ప్రళయకాలం వరకు కూడా ధర్మసంస్థాపనా కృషి అసాధ్యం అనే వాదనకు సాక్ష్యంగా, రుజువుగా చూపడం ఆమోదించగలిగితే - ధర్మదీక్షతో భయభక్తుల జీవిత విధానం కొనసాగించడాన్ని కూడా సంభవం కాదని చెప్పవలసి ఉంటుంది. అయితే, విచిత్రంగా ఒక్క విశ్వాసి కూడా అబూబక్ర్, ఉమర్ (రజి)ల స్థాయిని పొందనప్పటికీ, వారి స్థాయిని పొందలేదని నిరాశా నిస్పృహలకు గురై ఇస్లాంను వదిలివేసేందుకు సిద్ధంగా లేడు. నిరంతరం ఆ స్థాయిని పొందే కృషిని వదిలివేయడానికి కూడా సిద్ధంగా లేడు. ఇంకా తన్నుతాను మరింత పై స్థాయి విశ్వాసిగా మలచుకోవడానికి ప్రయత్నం చేస్తూ ఉన్నాడు. ఇతరులలో కూడా ఈ స్థాయి ఏర్పడటానికి కృషి చేస్తున్నాడు. ఇతరులను మరింత మంచి ముస్లింలుగా తీర్చిదిద్దడానికి ప్రచారం (తబ్లీగ్) చేస్తూ సంస్థలను (అంజుమన్) ఏర్పాటు చేస్తున్నాడు. ధర్మావగాహనా కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నారు. మరి ఈ కృషి ఎందుకు చేస్తున్నట్లు? ఒక అబూబకర్ (రజి), ఒక ఉమర్ (రజి)ల విశ్వాస స్థాయి, వ్యక్తిత్వ శిఖరం అందనపుడు, ఇస్లాం పేరును ఉచ్చరించడాన్నే వదిలివేయడం ఉత్తమం కదా! అయితే ఈ ప్రశ్నకు ఈ క్రింది సమాధానం మనకు ఇవ్వడం జరుగుతుంది. "హజ్రత్ సిద్దీఖ్, ఉమర్ (రజి)ల విశ్వాసపు స్థాయి, వ్యక్తిత్వపు ఔన్నత్యం వరకు మనం చేరలేకపోవచ్చు. దాని అర్థం మనం మొత్తంగా ఇస్లాంను వదిలివేయడమని కాదు. ఈ మహోన్నత వ్యక్తిత్వాలను మనముందు ఉదాహరణలుగా, ప్రమాణాలుగా

ఉంచుకోవాలి. మన శక్తి మేరకు, ఆ ప్రమాణస్థాయికి చేరుకోవడానికి కృషి చేయాలి. ఈ కృషిలో నిమగ్నమవ్వాలి కూడాను. ఈ మహా వ్యక్తిత్వాలను చరిత్ర మనముందు ఉన్నత ప్రమాణాలుగా ఉంచింది. ఈ ప్రమాణాల వైపునకు, మనం ఉన్న స్థానం నుండి ఎన్ని అడుగులు వేయగలిగితే అన్ని అడుగులు వేసేలా నిరంతరం ప్రయత్నిస్తూ ఉండాలి." జవాబు ఇది అయినప్పుడు ఇదే ప్రయత్నం, ఇదే కృషి, ఇదే పనివిధానం ధర్మసంస్థాపనా కృషిలో కూడా ఎందుకు చేయకూడదు? అనేదే మన ప్రశ్న. ధర్మసంస్థాపన అనబడే ఈ మౌలిక విధిని కేవలం పరిమిత పరిధికే కుదించి ఎందుకు ఆలోచించాలి? ఈ సంకుచిత పరిధి నుండి విడివడి విశాలంగా ఎందుకు అన్వయించుకోకూడదు. అబూబక్ర్, ఉమర్, అలీ, ఉస్మాన్ (రజి)ల ఖిలాఫత్‌కు ఈ అన్వయింపు ఎందుకు చేయకూడదు. ఈ వ్యక్తిత్వాలు తమ వ్యక్తిగత జీవితంలో, విశ్వాసపు స్థాయిలో ఏ ఉన్నత ప్రమాణాలకు చేరుకున్నారో – అదేవిధంగా ధర్మసంస్థాపనా (ఖిలాఫత్) విధానంలో కూడా అవే ఉత్తమ ప్రమాణాల స్థాయిని అందుకున్నారు. ఈ చారిత్రక మహోన్నత స్థాయిని సృష్టికర్త అల్లాహ్, చరిత్రయొక్క హృదయ ఫలకంపై శాశ్వతంగా ముద్రించివేశాడు. ఈ ముద్రలు, సత్యధర్మ ధ్వజవాహకులకు అనునిత్యం మార్గదర్శకంగా, వెలుగు దివ్వెలుగా మార్గం చూపుతూ ఉంటాయి. ఈ సత్యధర్మ ధ్వజ వాహకుల శక్తి మేరకు, భుజబలం – మేధోబలాల మేరకు ఆ ఆదర్శాలను అమలు చేయడానికి, ధర్మసంస్థాపనా కృషిని కొనసాగించడానికి అభ్యంతరం ఏముంటుంది? ఎందుకుండాలి? పై ఉన్నత ప్రమాణాలకు చేరేంత వరకు లేదా ఏ మేరకు చేరగలరో ఆ మేరకు చేరేంత వరకు విశ్రాంతిమయ శ్వాస తీసుకోవడం సరైనదేనా? ఖలీఫాల ధర్మ నిష్ఠ, వ్యక్తిత్వపు ఉన్నత ప్రమాణాలు, ఏ విధంగా మనకు ఆదర్శవంతమైన నమూనాలో – అదేవిధంగా వారి పాలనా వ్యవస్థ లేక ధర్మసంస్థాపన కూడా మనకు అదేవిధమైన ఆదర్శంగా ఉండితీరుతుంది. ఈ నమూనాను ముందుంచుకొని ఏ మేరకు ఈ కృషిలో ముందడుగులు వేస్తామో – అదే స్థాయిలో అది ధర్మసంస్థాపనగా పిలువబడుతుంది. అల్లాహ్ భూమిపై, అల్లాహ్ ధర్మాన్ని మన శక్తిమేరకు స్థాపించటంగానే పరిగణించబడుతుంది. మనకు మనం స్వయంగా అబూబక్ర్, ఉమర్ (రజి)ల మాదిరిగా మార్పు చెందడం విధి కాదు. అయితే, వారి ఆదర్శవంత ప్రమాణాల మేరకు కృషి చేయడం మాత్రం తప్పనిసరి

విధి అవుతుంది. ఇదే విషయం వారి ఖిలాఫత్, ధర్మసంస్థాపనలకు కూడా వర్తిస్తుంది. ఒక తరం తర్వాత మరో తరం ఈ రంగులో తన్ను తాను రంగరింపజేసుకోవడానికి నిరంతరం పరిశ్రమ చేస్తూ కొనసాగుతుంది.

అందువల్ల ఆనాటి మూడు దశాబ్దాల ఖిలాఫత్ కాలాన్ని మనం, మనకు ఆదర్శంగా, ఉత్సాహంగా, మానవ చరిత్రల యొక్క అత్యుత్తమ కాలంగా స్వీకరించవలసి ఉంటుంది తప్ప - భీతిగొలిపే, భయానక కాలంగా ఉండి, దాని నుండి పారిపోయేదిగా, పలాయనం చేయించేదిగా స్వీకరించకూడదు. ఖిలాఫత్ కాలపు జ్ఞాపకాలతో, మనస్సులో నిరాశానిస్పృహలు జనిస్తూ ఉంటే - భయభీతులు, అధైర్యం జనిస్తూ ఉంటే - అందులో షైతాన్ కుట్రలు దాగివున్నాయని గుర్తించాలి. ఒక ముస్లిం, కేవలం సత్యధర్మ సంస్థాపనలోనే మానవ సాఫల్యం ముడివడి ఉందని భావిస్తూ ఉంటే, ఇతని హృదయం ఆ ఆదర్శవంత కాలం యొక్క పవిత్రతను, ప్రాముఖ్యతను గుర్తించితే, దానిని నిండు హృదయంతో, ప్రేమతో స్వాగతిస్తూ ఉంటే, సృష్టికర్త ఆజ్ఞ - చట్టబద్ధ ఆదేశపాలన ఏ విధంగా ఆకాశాలలో ప్రకృతిలో, స్వయంగా మానవ దేహంలో అమలు కాబడుతుందో - అదే విధంగా మానవ సమాజంలో కూడా కొనసాగాలని నిండు హృదయంతో కోరుకుంటూ ఉంటే, అప్పుడు అతని సహజ ఆచరణ ఎలా ఉంటుంది? ఆ వ్యక్తి తన సంపూర్ణ శక్తితో తన సహజ నైపుణ్యపు వనరులన్నింటినీ ఉపయోగించి, ఆ ధర్మసంస్థాపనా విధిని నిర్వర్తించడంలో నిమగ్నుడై పోతాడు. కాని, అంతరంగంలో ఈ చైతన్యం, కదలిక లోపించిన వ్యక్తి, అసలు విశ్వాసపు కనీస స్థాయి లేనివాడుగా ఉంటాడు. అంతేకాదు, అతను కదలిక, చైతన్యం లేని జడ పదార్థంగా, ఒక రాతి విగ్రహంగా మిగిలిపోతాడు.

## ఇస్లామీయ వ్యవస్థ పట్ల ఓ తీవ్రమైన అపోహ

ఇస్లామీయ ఖిలాఫత్ వ్యవస్థ కేవలం 30 ఏళ్ళు మాత్రమే మనగలిగింది అనే వాదన కేవలం నక్కజిత్తుల మేధావులు, లేదా అమాయకులు లేదా చారిత్రక అవగాహనలేని మేధావులు చేసినది మాత్రమే. ఇస్లాం శత్రువుల ద్వారా ప్రచారంలోకి తేబడిన ఈ తప్పుడు ప్రచారానికి పైవారు ప్రభావితులైనారని గుర్తించాలి. వాస్తవానికి ఖిలాఫత్ విషయంగా చారిత్రక అవగాహన ఈ క్రిందివిధంగా ఉండాలి. ఏ విధంగా

అబూబక్ర్, ఉమర్ (రజి) ల తర్వాత కూడా ముస్లింలు పుట్టారో - ఇంకా పుడుతూ ఉన్నారు ... ఇంకా పుడతారు - అదేవిధంగా వారి కాలం తర్వాత కూడా ఖిలాఫత్ వ్యవస్థ కొనసాగుతూ ఉండింది. అయితే తేడా ఏమిటంటే, మొదటి తరం నాయకత్వం ఏ మచ్చాలేని ఉన్నత వ్యక్తిత్వంగా ఉండింది. అదేవిధంగా వారి పాలనా స్థాయి కూడా, సంపూర్ణ, సంక్షేమంగా, శాంతి-సౌభాగ్యాలకు చిరునామాగా ఉండింది. ఆ తరువాత కొనసాగిన నాయకత్వంలో, బలహీనతలు, కొరతలు, చిరుమచ్చలు పొడసూపాయి. వారి పాలనా వ్యవస్థలో కూడా ఈ కొరత, లోపం తప్పనిసరిగా ఉండింది. అయితే, ఈ కొరతలు, లోపాలు ఉండిన నాయకత్వాన్ని 'ధర్మేతరులుగా' 'దైవతిరస్కారులు'గా ఎటువంటి పరిస్థితుల్లోనూ ముద్రవేయకూడదు. అదేవిధంగా వారి ఆధ్వర్యంలో కొనసాగిన ఖిలాఫత్‌ను కూడా ధర్మేతర, ముస్లిమేతర లేక దైవతిరస్కార వ్యవస్థగా భావించకూడదు. ఏ విధంగా ముస్లిం సమాజంలో ధర్మావగాహన - ధర్మావలంబనల్లో వైరుధ్యం పొడసూపిందో - అదే మేరకు వీరి పాలనా వ్యవస్థలో కూడా వైరుధ్యం చోటు చేసుకుంది. ఈ తేడాను స్వయంగా ఖిలాఫత్ వ్యవస్థకు నాయకులైన మొదటి నలుగురు ఖలీఫాలలో కూడా మనం గమనించవచ్చు. అబూబక్ర్, ఉమర్ (రజి)ల కాలపు పాలనా వ్యవస్థలోని నిష్ఠాగరిష్ఠతలు ఆ తరువాతి, ఉస్మాన్, అలీ (రజి)ల కాలంలో కొరవడటం మనం గమనిస్తాం. ఈ విషయానికి హదీసులు, చారిత్రక ఘట్టాలు సాక్ష్యాలుగా ఉన్నాయి. కనుక వ్యక్తులలో లోపాలు, బలహీనతలు ఉన్నప్పటికీ వారిని ధర్మం నుండి వెలివేయడం ఎలా సాధ్యం కాదో - అదేవిధంగా కొన్ని లోపాలు, కొరతలు ఉన్నప్పటికీ ఖిలాఫత్ వ్యవస్థలోని ఆ తరువాతి కాలాన్ని కూడా ధర్మధిక్కార వ్యవస్థలుగా తీర్మానించలేము. అంటే, ఖిలాఫత్ యొక్క ఉచ్ఛదశ అయిన 30 లేక 40 సంవత్సరాల కాలం తర్వాతి దశను మనం విమర్శనా దృష్టితో చూడవచ్చు. అవసరమైన చోట విమర్శించనూవచ్చు. అయితే ధర్మ వ్యతిరేక వ్యవస్థగా ప్రకటించడం సరైనది కాదు. ఆయా కాలాల్లో ఉద్భవించిన ఇస్లామీయ పండితులు, మహోపాధ్యాయులు, ఆనాటి పాలకులలోని (ఖలీఫాలలోని) లోపాలను, సాధారణ ప్రజలలోని ధర్మ రాహిత్యాన్ని ఎత్తిచూపేవారు. సరిదిద్దుకునే ఉపాయాలను కూడా సూచించేవారు. ధర్మాన్ని అర్థమయ్యేలా ప్రచారం చేసారే తప్ప - వీరిని ధర్మభ్రష్టులనిగాని, తిరస్కారులని గాని ప్రకటించనే లేదు. కనుక ఖిలాఫత్ యొక్క

మొదటి కాలం నుండి, అనేక వందల సంవత్సరాలు, హెచ్చుతగ్గుదలతో ఈ వ్యవస్థ కొనసాగుతూనే ఉండింది. న్యాయస్థానాలు ఇస్లామీయ చట్టాల ప్రకారమే తీర్పులు చెప్పేవి. శిక్షలు, ధర్మశాస్త్ర ఆచరణలు, దానధర్మాలు, సంక్షేమపథకాలు అన్నీ ఖుర్ఆన్ పునాదులపైనే అమలయ్యేవి. ఆస్తి తగాదాలు, పంపకాలు అన్ని కూడా ఇస్లామీయ షరీఅత్ ప్రకారం జరిగేవి. లోపాలు ఏవైనా ఉంటే అవి ఆనాటి పాలకుల వ్యక్తిత్వాలలో ఉండేవి. ఆ లోప భూయిష్ట వ్యక్తిత్వాల ప్రభావం ఏదో ఒక మేర పరిపాలనా వ్యవస్థపై పడేది. కాని, సాధారణ వ్యవహారాలు, లావాదేవీలు, వ్యాపార నియమాలు అన్నీ ఖుర్ఆన్, ప్రవక్త సంప్రదాయం ఆధారంగా కొనసాగేవి. జీవితపు అన్ని కోణాలల్లో ఇస్లాం యొక్క ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తూ ఉండేది. ఒక అతి చెడ్డ పాలకుడు కూడా తన స్వార్థం కోసం ఏదైనా, మార్పులు-చేర్పులు చేయదలిస్తే తప్పనిసరిగా నిస్సహాయతలను ముసుగుగా ధరించవలసి వచ్చేది. ఈ భూమికి తాను మాత్రమే ప్రభువునని తలచడం అతనికి (పాలకునికి) సాధ్యమయ్యేది కాదు. తన స్వంత ధర్మం, తన స్వంత చట్టం అనేది అతని ఊహలోకి కూడా వచ్చేది కాదు.

పై వివరణ దృష్ట్యా లోపభూయిష్ట ధర్మవ్యవస్థ నిర్మాణం కోసం అనుమతి లభించినట్లుగా భావించకూడదు. లేక హారూన్ రషీద్ లాంటి పాలకుడిని ఉనికిలోకి తేవడంగానూ పొరపాటు పడకూడదు. కేవలం కొన్ని లోపాలు ఉన్నప్పటికీ, ఆ పాలనా వ్యవస్థ ఒక సుదీర్ఘకాలం కొనసాగిందనీ - దాని తాలూకు సంక్షేమ ఫలాలు సమాజానికి, సమస్త మానవాళికీ అందాయని చెప్పడమే ఈ వాదన ఉద్దేశ్యం. ఒక సుదీర్ఘ కాలం ఈ ధర్మవ్యవస్థ ఉనికిలో ఉండింది. తన ఆత్మరీత్యా మొదటి ఆ తరువాతి దశలలో ఉత్థాన పతనాలు ఉన్నప్పటికీ, ఒక సుదీర్ఘ కాలం ఈ ఉత్తమ వ్యవస్థ, అప్పటి వరకు మానవ సమాజం చవిచూడని మానవ సంక్షేమాన్ని , పరిపాలనా వ్యవస్థను, సమ న్యాయ సామాజిక వ్యవస్థను అందించింది. కాబట్టి ఈ వ్యవస్థ కొద్ది కాలం మాత్రమే మనగలిగిందని ప్రచారం చేయటం చరిత్రను వక్రీకరించడమే. పైగా ఇది ఆత్మ వంచన కూడా. ఈ వాదనల ద్వారా ఇస్లాం పట్ల, ఇస్లామీయ ధ్వజవాహకుల పట్ల అపోహలు, సందేహాలు సృష్టించటమే వీరి లక్ష్యంగా కనిపిస్తోంది.

## ఇస్లాం : ఓ ఆచరణాత్మక వ్యవస్థ

ఇస్లామీయ ఖిలాఫత్ వ్యవస్థను విమర్శించేవారు ఇప్పటివరకు, దానికంటే

మంచిదైన, మెరుగైన వ్యవస్థను అందించలేకపోయారు. ప్రధానంగా, ఇస్లామీయ వ్యవస్థ యొక్క సూత్రబద్ధమైన విధానం నేడు ఆచరణ సాధ్యం కాదని వాదించేవారు, దీనికి ప్రత్యామ్నాయంగా, ఆచరణ సాధ్యమైన మరో విధానాన్ని ప్రతిపాదించడంలో సఫలత సాధించారా? రాచరికం, భూస్వామ్య వ్యవస్థలను ఈ విమర్శకులు ఎలాగూ ప్రత్యామ్నాయంగా ఆమోదించలేరు. ఎందుకంటే ఇవి అసలు వ్యవస్థలే కావు. ఒకవేళ అయినా వాటి విధానాలు అన్నీ ఆటవిక చట్టాలుగా ఉండేవి. ప్రపంచ మానవాళి మొత్తంగా ఈ వ్యవస్థను తిరస్కరించింది. ... చరిత్ర పేరిట కుప్పపై దీనిని విసిరివేసింది. ఇక మిగిలినది ప్రజాస్వామిక వ్యవస్థ మరియు సోషలిస్టు వ్యవస్థలు. నేటి ప్రపంచంలో ఈ రెండు వ్యవస్థల అధికారమే చెలామణీ అవుతోంది. (ప్రస్తుతం సోషలిస్టు వ్యవస్థ, ఒక పాలనాధికారం గల వ్యవస్థగా ఎక్కడా లేదు – అను). ఈ వ్యవస్థల ప్రచారక బృందాలు, తమ తమ వ్యవస్థల గొప్పతనాలను ప్రతి రోజూ బృందగానాలు వినిపిస్తూ ఉన్నాయి. అయితే నేటివరకు ఈ వ్యవస్థలు తమ ప్రమాణాల మేరకు, 30 సంవత్సరాలు కాదు గదా, ముప్పై నెలలు కాదు, 30 రోజులు కూడా కొనసాగినట్లు, ఒక్కరు కూడా ధైర్యంగా చెప్పలేరు. తద్భిన్నంగా ఈ వ్యవస్థలు, ఆచరణాత్మకంగా తమ సైద్ధాంతిక ప్రమాణాల స్థాయికి చేరుకోలేకపోయాయి. ఈ కఠోర సత్యాన్ని ఈ వ్యవస్థల ప్రతినిధులే అంగీకరించారు. విమర్శకులుగా కూడా మారారు. కేవలం, పుస్తకాలలో, భావాలలో విహరించే సిద్ధాంతాలు, నిజ ప్రపంచంలో ఆచరణకు ఎంతమాత్రమూ పనికిరావు. ప్రజా స్వామిక వ్యవస్థలోని లోపాలను ఎత్తిచూపుతూ ప్రముఖ ఆంగ్ల తత్వవేత్త, మేధావి 'బెర్నార్డ్ షా' ప్రజా స్వామిక వ్యవస్థ యొక్క లక్ష్యాన్ని నిష్ఫలం చేసివేసే దాని విధానం, దాదాపుగా పరిష్కరింప వీలులేనిది. ప్రతి ఒక్కరికి ఓటు హక్కు కల్పించడమే తన విజయంగా ఈ వ్యవస్థ సంతోషపడి పోతుంది. అయితే ప్రజాస్వామిక లక్ష్యాలు అసలు దెబ్బతినేవి ఇక్కడే. పరిపక్వ ఆలోచనాపరులు ప్రజాస్వామ్యాన్ని అమితంగా ఇష్టపడతారు. అయితే ఈ పరిపక్వులే పోలింగ్ స్టేషన్లలో అతి తక్కువ కానరావడం ద్వారా దానికి సమాధి కట్టివేస్తారు.

మరో ఇటాలియన్ మేధావి 'మైజీని' ఇలా చెప్పాడు :

"మానవుడు రాజు రూపంలో ఒక్కడిగా ఉన్నా, ప్రజాస్వామిక వ్యవస్థ రూపంలో అనేకులుగా ఉన్నా, విషయం మాత్రం ఒకటిగానే ఉంటుంది.

'డేన్ రంజ్' స్పష్టంగా ఇలా తెలిపాడు :

"ఒక సంపూర్ణ ప్రజాస్వామిక వ్యవస్థ కూడా, ఎప్పటికీ సైద్ధాంతికంగా ప్రజాస్వామ్య నిర్వచనా స్థాయికి 'ఒక ప్రజాస్వామిక వ్యవస్థగా' ఎన్నటికీ చేరజాలదు." 'లార్డ్ బ్రౌన్స్' మరియు ఇతర ప్రజాస్వామిక మేధావులు సైతం తమ నిరాశా నిస్పృహలను తెలియజేస్తూ "వాస్తవిక ప్రజాస్వామ్యం ఎప్పటికీ, ప్రపంచంలోని ఏ ప్రాంతంలోనూ ఉనికిలోకి రావడం సాధ్యం కాదు" అన్నారు. "ఇక సోషలిస్టు వ్యవస్థ ప్రజాస్వామ్యం కన్నా బలహీనమైనదని రుజువు అయింది. నేటి చర్చ ప్రకారం సోషలిస్టు వ్యవస్థ ప్రస్తావనకు కూడా అర్హమైనది కాదు. ఇది కేవలం సోషలిజాన్ని వ్యతిరేకించడం కాదు. ఇది ఒక నగ్నసత్యం. సోషలిజం యొక్క వాస్తవిక వివరణను తెలుసుకుంటే, విషయం సూర్యుని వెలుగులా సుస్పష్టం అయిపోతుంది. సోషలిస్టు సిద్ధాంతవేత్తల నాయకుడైన 'ఏంగెల్స్' ప్రకారం ఈ వ్యవస్థ ఈ క్రింది విధంగా ఉంటుంది.

"వర్గ విభేదాలు లేని ఒక వర్గ రహిత సమాజం ఉనికిలోకి వస్తుంది. వ్యక్తి, ఈ సమాజంలో చైతన్యవంతుడైన ప్రభుసత్తాకం కలిగి ఉంటాడు. తన చరిత్రను తానే స్వయంగా వ్రాసుకుంటాడు. సామూహిక వ్యవస్థ తన ఇష్టానుసారంగా ఫలితాలను అందిస్తుంది. ఒకరిపై ఆధారపడే స్థితి నుండి విముక్తి పొంది, స్వేచ్ఛా ప్రపంచంలోకి వ్యక్తి అడుగిడుతాడు. అప్పుడు ప్రభుత్వం, అధికారం అనే పదాలు కేవలం గత కాలానికి చెందిన పదాలుగా మిగిలిపోయి ఉంటాయి.

సోషలిజం ఉనికిలోకి వచ్చి దాదాపు 50 వసంతాలు గడిచిపోయింది (ఇప్పుడు 80 సం॥ – అను) పలు దేశాలలో అధికార వ్యవస్థగా కూడా కొనసాగిన చరిత్ర దానికి ఉంది. మరి నేడు ఈ సైద్ధాంతిక వ్యవస్థ ఎక్కడైనా దాని అసలు రూపంలో ఉనికిలో ఉన్నదా? ఈ వ్యవస్థకు మొదటి సాక్షిగా ఉండిన రష్యాలో వర్గాలు సమసిపోయాయా? "రాజ్యమూ లేదు – రాజదండమూ లేదు" లాంటి స్థితి ఉండిందా? వ్యక్తి తన చరిత్రను తానే రచించుకున్నాడా? లేని పక్షంలో ఇంతపెద్ద అబద్ధం ఎలా సత్యంగా ప్రచారం చేయబడింది? ... ప్రజల చేత ఎలా ఆమోదింపజేయబడింది? కమ్యూనిజంలోనికి ఇది పరివర్తన చెందే దశగా కమ్యూనిస్టులు చెప్పవచ్చుగాక! కాని, భవిష్యత్తులో ఈ వ్యవస్థ స్థాపించబడే అవకాశాలు కానవస్తున్నాయా? నిజానికి

సోషలిజం లేక కమ్యూనిజం తన పూర్తి ప్రమాణంలో ఈ భూ ప్రపంచంపై ఏ ప్రాంతంలోనూ, ఒక్క దినం కూడా ఉనికిలో లేదు. ఇది కమ్యూనిస్టు వ్యతిరేకులే కాదు, కమ్యూనిస్టు సమర్ధకులు అయిన మేధావులు కూడా అంగీకరించే సత్యం.

ఇస్లాంకు భిన్నమైన పై రెండు వ్యవస్థలను తులనాత్మకంగా పరిశీలించిన తరువాత స్పష్టమౌతున్న విషయం ఏమిటంటే; ఒక వ్యవస్థ అది ప్రతిపాదించిన ప్రమాణాల స్థాయికి చేరినది ఏదైనా ఉంది అంటే, అది కేవలం ఇస్లామీయ ఖిలాఫత్ వ్యవస్థ మాత్రమేనని రుజువు అవుతుంది. ఇస్లామీయ ఖిలాఫత్ వ్యవస్థ తప్ప ఇతర వ్యవస్థలన్నీ కూడా, కనీసం ఒక్కరోజు కూడా తన ప్రతిపాదిత ప్రమాణ స్థాయితో నిలబడనే లేదు. కనుక ఒక వ్యవస్థ దాని ప్రతిపాదిత ప్రమాణ స్థాయిలో ఉనికిలోకి రావడం, మనగలగడమే దాని సత్యతకు, శాస్త్రీయతకు రుజువు అయితే, అందుకు అర్హత కేవలం ఇస్లాంకు మాత్రమే ఉంది. ఇస్లాం యొక్క ఈ ప్రత్యేకతను, అర్హతను ఛాలెంజ్ చేసే స్థాయి మరే వ్యవస్థకూ లేదు. కనుక ఇస్లాం కేవలం అతి కొద్ది కాలం మాత్రమే ఉనికిలో ఉండింది. కనుక అది తిరిగి స్థాపించబడటం సాధ్యం కాదు, దానికై అవిరళ కృషి నిరర్థకమని చెప్పడం కేవలం అవివేకమే కాదు, హాస్యాస్పదం కూడాను.

## 4. వేచి చూచే ధోరణి

ఇప్పుడు ధర్మసంస్థాపనా ఉద్యమం పట్ల వేచిచూచే పద్ధతిని అనుసరించే వారి గురించి కూడా తెలుసుకుందాం. వీరు స్వయంగా ఆర్థిక రక్షణావలయంలో సుఖంగా, ప్రశాంతంగా ఉంటారు. ఇతరుల ఆచరణ, చైతన్యం, ప్రధానంగా ఉద్యమ అభివృద్ధి గురించి ఆరా తీస్తూ ఉంటారు. డేగకళ్ళతో గమనిస్తూ ఉంటారు. ... లెక్కలు కడుతూ ఉంటారు. మాటలతో ధర్మసంస్థాపనా విధిని అంగీకరిస్తారు. కాని, ఆచరణా మైదానంలో అడుగు పెట్టడానికి సాహసించరు. అదే సమయంలో ధర్మసంస్థాపనా ఉద్యమ మైదానంలో పని చేస్తూవున్న వారిని అనుమానపు చూపులతో గమనిస్తూ ఉంటారు.

## ద్వంద్వ స్వభావం

ఈ ఆచరణా ధోరణి గల వారిని చూచి ఆశ్చర్యపడకుండా ఉండలేము.

ఎందుకంటే, వీరు ఒక వైపున ధర్మసంస్థాపనను విధిగా, తప్పనిసరిగా అంగీకరిస్తున్నారు. మరోవైపున తాము అంగీకరించిన విషయాన్ని ఇతరులు ఆచరించి ఉద్యమాన్ని విజయ పథం వైపునకు నడిపించినంత వరకు తాము కదలమని భీష్మించుకొని ఉన్నారు. ఈ స్వభావాన్ని ఈ క్రింది ఉదాహరణలతో పోల్చవచ్చు. ఒక ఇమామ్ గారిని ప్రజలు తమ అభిప్రాయం మేరకు, అవినీతి పరుడనీ, నిష్టలేనివాడనీ, నమాజ్‌కు నాయకత్వం వహించే అర్హతలేదని భావించి, అతని నాయకత్వంలో నమాజ్ ఆచరించటానికి వ్యతిరేకించడం పోయి – ఏకంగా నమాజ్‌నే వదిలివేసే వారిలా ఉంటుంది. అంతేకాదు వీరు రేపు తీర్పుదినాన విశ్వప్రభువు ముందు నిలబడి, ఓ ప్రభూ! మేము నమాజ్‌ను తప్పనిసరి విధిగా మనసా వాచా అంగీకరించాము. నమాజ్ కోసం కనీసం 20 గంటలు ఉజూతో ఉండేవారము. అయితే ముఅజ్జిన్ ఇచ్చే అజాన్‌లో, ఇమామ్ చేయించే నమాజ్‌లో దైవం పట్ల భయభక్తులు, నిష్టాగరిష్ఠతలు లోపించిన కారణంగా మేము నమాజ్‌ను ఆచరించలేదని చెప్పేలాగా ఉన్నారు. ఇది ఎంతటి హాస్యాస్పదమో ఆలోచించండి. ఈ ద్వంద్వ స్వభావపు ధోరణి హాస్యాస్పదమే కాదు ప్రమాదకరం కూడాను. ఈ వాదనకు ఎలాంటి ధర్మబద్ధమైన, హేతుబద్ధమైన పునాది లేనేలేదు.

పై అంశాన్నే మరో ఉదాహరణ ద్వారా మరింత బాగా అర్థం చేసుకునే యత్నం చేద్దాం! జైద్ అనబడే వ్యక్తి ధర్మసంస్థాపన కోసం పిలుపునిస్తున్నాడు. దైవ సందేశం ప్రజలకు అందిస్తున్నాడు. ఈ పిలుపు ద్వారా మన ఉదాసీన అంతర్గతాలను కుదిపివేస్తూ, మరిచిపోయిన విధి నిర్వహణ వైపునకు ఆహ్వానిస్తున్నాడు. తన శక్తిమేరకు ఈ మార్గంలో అడుగులు వేస్తూ కొనసాగుతూ ఉన్నాడు. అయితే, అతని ఆచరణ పట్ల, ప్రతిభల పట్ల, నిష్ఠ పట్ల, నిజాయితీ పట్ల మాకు సంపూర్ణ సంతృప్తి కలగకూడదు. అంతేగాక, జైద్, జైద్‌తో కొనసాగుతున్న అతని అనుచరులు అందరూ మాకు అసమర్థులుగా, ఆచరణారహితులుగా, నిష్ఠలేనివారుగా కనిపిస్తూ ఉన్నారు. అయితే ఇక్కడ ప్రశ్న ఏమిటంటే, ఈ విషయం మిమ్మల్ని మీ విధి నిర్వహణ నుండి ఎలా విముక్తి కలగజేస్తుంది. మీరు, జైద్ అతని సహచరులు ఆచరణా పునాదులపై ఇస్లాంను సత్యధర్మంగా అంగీకరించారా? జైద్, అతని అనుచరులు ఈ విధిని చక్కగా నెరవేర్చే షరతుపై ధర్మస్థాపనా విధిని ఆమోదించారా? జైద్ నిర్వాకం చూచిన తర్వాతనే నేను పడక నుండి లేస్తానని, విశ్రాంతి మందిరాల నుండి అడుగు బైటపెడతానని

శపథమేదైనా చేసారా? ఇతరుల బలిదానాలను చూచిన తర్వాతనే మీరు ఖుర్ఆన్ గ్రంథ కేంద్ర బిందువు అయిన ధర్మ సందేశ పిలుపు వైపునకు హాజరు పలుకుతారా? దైవగ్రంథం సాక్షి! దీన్ని ఎంతమాత్రమూ ఆమోదించమని మనం అంగీకరిస్తాం. ఇతరుల బలహీనతలను లెక్కిస్తూ కూర్చునే సమయం మీకు ఎలా దొరుకుతుంది? నిజంగా ఎదుటి వారిలో లోపాలు ఉంటే, వాటిని అల్లాహ్ ముందు జవాబు చెప్పుకోవలసిన వారు వారే కదా? మీకెందుకు ఇంత ఉత్సాహం? వారి లోపాలను వెతికి కెలికి, త్రవ్వి త్రవ్వి తీయవలసిన దురద ఎందుకు? నిజానికి ప్రతి మనిషి తన కర్మల పత్రం గురించి ఆలోచించవలసి ఉంటుంది. ఇతరుల వైపునకు కేవలం వారి నుండి గుణపాఠం తీసుకునేందుకు మాత్రమే దృష్టి సారించాలి. హజ్రత్ లుఖ్మాన్‌తో "మీరు సంస్కారం ఎవరి నుండి నేర్చుకున్నారు?" అని ఎవరో అడిగారట. దానికి ఆయన "సంస్కారం తెలియని వారి నుండి" అని బదులిచ్చారట. అల్లాహ్ స్వయంగా విశ్వాసులలో వివేకాన్ని ఆశిస్తున్నాడు. వివేకంతో పనులను నిర్వహించవలసిందిగా ఆజ్ఞాపిస్తున్నాడు. దైవగ్రంథంలో పలుచోట్ల దైవాగ్రహానికి గురైన జనుల, మార్గభ్రష్టుల సంఘటనలు గుణపాఠంగా, వివరంగా చెప్పబడ్డాయి. తద్వారా దైవవిధేయుల (ముస్లింల) భావజాలపరంగా, ఆచరణాపరంగా తమలోని తప్పులను, పొరపాట్లను గుర్తించి, సవరించుకోవలసిందిగా చెప్పబడింది. ఈ తప్పుల నుండి, భ్రష్ట మార్గం నుండి తమ్ము తాము రక్షించుకోమని హెచ్చరించడం జరిగింది. కనుక మనం ఇతరుల బలహీనతలను, లోపాలను - మన విధి నిర్వహణా, కర్తవ్యపాలనా విముఖతకు సాక్ష్యాలుగా, రుజువులుగా చూపడం మానివేయాలి. తద్భిన్నంగా వారిలోని లోపాలను, పొరపాట్లను గుణపాఠాలుగా తీసుకుని మనం కర్తవ్య నిర్వహణ కోసం మైదానంలో దిగాలి. అల్లాహ్ అభీష్టం నెరవేర్చు సంకల్పంతో, దృఢ దీక్షతో, ధర్మసంస్థాపనా పతాకాన్ని చేబూని ముందుకు సాగాలి. అలా చేయలేని పక్షంలో, ఈ మార్గంలో లోపాలతో, బలహీనతలతోనే కొనసాగుతున్న వారి క్షేమం కోసం, సదాచరణ కోసం అల్లాహ్‌ను ప్రార్థించాలి తప్ప, వారిని విమర్శిస్తూ వారి లోపాలను ఎంచుతూ కూర్చోకూడదు. వారి పిలుపులు, సందేశ పొలికేకలు నిజదృష్టితో 'ప్రాణం లేని సందేశ కృషి' కావచ్చు. కాని మన వరకు వారే సందేశ వాహకులుగా కన్పిస్తున్నారు. కనుక మన వరకు వీరు విమర్శకు కాక, కృతజ్ఞతలకు అర్హులుగా ఉన్నారు. వీరిని మనం దురదృష్టవంతుడైన ఆ వ్యక్తితో పోల్చవచ్చు - అతను తన తలపై దీపం

పెట్టుకొని ఇతరులకు మార్గం చూపుతున్నాడు. కాని స్వయంగా కళ్ళకు గంతలు కట్టుకొని ఉన్నాడు. ఈ వ్యక్తి యొక్క అమాయకత్వాన్ని అవివేకాన్ని విమర్శించడం మాని, అతనిపై జాలిచూపాలి. అదే సమయంలో ఆ దీపపు వెలుగుతో లబ్ధి పొందే ప్రయత్నమూ చేయాలి. అలాగాక ఆ దీపంతో లాభం పొందకుండా, పయనం సాగించకుండా, అతని అవివేకాన్ని విమర్శిస్తూ ఉండిపోవడం దౌర్భాగ్యం. భాగ్యవంతుడైన వాడు ఇతరుల నుండి గుణపాఠం నేర్చుకుంటూ ఉంటాడు.

ప్రసంగీకుని వ్యక్తిత్వంపై కాక, ప్రసంగ పాఠంపై దృష్టి ఉంచడమే నిజమైన మేధావితనం అనిపించుకుంటుంది. కనుక సత్య ధర్మ సంస్థాపనా పిలుపును శ్రద్ధగా విని, గతంలోని అల్లాహ్ దాసులు ఎటువంటి ఆచరణకు నడుం బిగించారో అదేవిధంగా మనం కూడా ఆచరణా రంగంలో అడుగుపెట్టాలి. “మాటను శ్రద్ధగా విని, అందులోని మంచి మంచి విషయాలను అనుసరించే నా దాసులకు శుభవార్త అందజెయ్యి” (39:18) అని ప్రవక్తకు అల్లాహ్ ఉపదేశించివున్నాడు. ‘ధర్మసంస్థాపనా సందేశం’ గురించి ఇది అల్లాహ్ ఆదేశమేనా? అని సందేహించనవసరం లేదు. ఇది నిస్సందేహంగా అల్లాహ్ ఆదేశమే. (అల్ ఖౌల్) కనుక ఆలస్యం చేయకుండా, శంకించకుండా ఈ ఆదేశంపై ‘లబ్బైక్’ (హాజరు) పలకండి. ప్రపంచం మొత్తంగా ఈ సందేశం నుండి దృష్టి మరల్చుకుంటూ ఉన్నా – నిస్సందేహంగా మీపై ఉన్న విధి – కర్తవ్యం ఎంతమాత్రమూ తగ్గదు. అంతేకాదు, ‘ఇతరులు ఈ కార్యంలో దిగనంతవరకు, వారిలోని లోపాలు – బలహీనతలు తొలగిపోనంత వరకు నేను నడుం కట్టను’ అని చెప్పే హక్కు కూడా మనకు లేదు. సత్యం ప్రత్యక్షం అయిన తర్వాత, ప్రస్ఫుటంగా తెలిసిపోయిన తరువాత కూడా వేచి చూచే పాలసీని ఎంచుకోవడం క్షంతవ్యం కాదు. ఇలా చేయడం సత్యాన్ని అగౌరవపర్చడం అవుతుంది. అంతేకాదు, ఆ మార్గానికి అడ్డంకి కల్పించడంగా భావించవలసి ఉంటుంది.

ఈ సందర్భంగా విశ్వజనీన సంప్రదాయాలను స్థాపించిన ఆ మొదటి వరుసకు చెందిన దైవదాసుల బృందపు ఆచరణా సరళిని గుర్తుంచుకోవడం, జ్ఞాపకం చేసుకోవడం అవసరమని భావిస్తాను. ప్రవక్త (స) సహచరుల బృందం యొక్క త్యాగపూరిత, సందేశ ఉద్యమ నిర్వహణలో అల్లాహ్ సూచించిన పై విధానమే అమలు చేయబడింది. ఏ పని కోసం ఆ అత్యుత్తమ శ్రేణి దైవదాసుల బృందం అవిరళ కృషి చేసిందో అదే

పనిని మనం ఆమోదించామని గుర్తుంచుకోవాలి. అలాకాకుండా, సత్యాసత్యాల ఘర్షణలో దూరంగా నిలిచి గట్టుమీద నుండి తమాషా చూచే వారిలా ఉండకూడదు. సత్యం జయించినపుడు గట్టు నుండి పరిగెత్తుకుంటూ వచ్చి, 'సత్యం జిందాబాద్' అని కేకలు పెట్టి తాము సైతం ఈ ఘర్షణలో భాగస్వాములమేనని చెప్పుకునే ప్రయత్నం చేస్తారు. వీరి గురించి దైవగ్రంథం **"ఈ కపటులు మీ విషయంలో (గాలి ఎటు వీస్తుందో) అని నిరీక్షిస్తున్నారు. అల్లాహ్ తరఫు నుండి విజయం గనక మిమ్మల్ని వరిస్తే వీరు మీ వద్దకు వచ్చి 'మేము మీతో ఉండలేదా'?** అని అంటారు" (4 : 141) అని స్పష్టం చేసింది.

ఆలోచించవలసిన అంశం పై వాక్యంలో ఏమిటంటే, వేచి చూచే ధోరణిని ఆనాడు 'కపటులు' (మునాఫిక్‌లు) అమలుపర్చారు. ఇది కపటుల ఆచరణా విధానంగా ఉండింది. ఈ కపటులు నిజానికి సత్యం జయించాలని వేచి చూడలేదు. నేడు 'ముస్లిం'లమైన మనం కూడా 'సత్యధర్మం' విజయం సాధించేంత వరకు వేచి చూడాలని భావించడం దేనికి గుర్తుగా ఉందో గమనించాలి. నాటి కపటులకు, నేటి ముస్లింలకు మధ్య తేడా ఏమైనా ఉంటే, అది, నాడు కపటులు ముస్లింలు 'ఓడిపోకపోతే' గెలుపుకై వేచిచూచేవారు. నేడు ముస్లింలమైన మనం ధర్మసంస్థాపనా కృషిలో ధర్మబోధకుల స్థిరచిత్తాన్ని, చిత్తశుద్ధిని పరికిస్తూ వేచిచూస్తూ ఉన్నాము. ఈ రెండు ధోరణులలో కూడా విధి నుండి, సందేశ ప్రచారం నుండి, సత్య అనుసరణ నుండి పలాయనం ఒకే విధంగా వుంటుంది.

## మరో అడుగు ముందుకు ,,,,

పరిస్థితి కేవలం ఎదురుచూపులు చూచేవరకే, లేక వేచిచూచే ధోరణి వరకే పరిమితమై ఉంటే బాగుండేది. కాని కొంతమంది మానసిక స్థితి ఇంకా దిగజారిపోయి ఉన్నట్లు మనం గమనిస్తాం. దైవవిధేయత, ఖుర్ఆన్ అనుసరణ, ప్రవక్త (స) పట్ల అంతులేని ప్రేమగల ఈ ముస్లిం సమాజంలో ధర్మసంస్థాపన కోసం కృషి చేస్తున్న 'అబద్ధపు సందేశకారులు'(?) ఎప్పుడు నిష్క్రమిస్తారు? వారు ఈ మైదానం నుండి ఎప్పుడు తరిమివేయబడతారు? అని ఎదురుచూచే వారు కూడా ఉన్నారు. తద్వారా తమ గుండెలకు ప్రశాంతత అందించడానికి వీరు ఉవ్విళ్ళూరుతున్నారు. వీరు తమ

దరహాస స్వరంతో "ఈ ఆలోచనా రహితులైన ఉన్మాదులు కేవలం ధర్మసంస్థాపన ... ధర్మసంస్థాపన అని కేకలు పెడుతున్నారు. కాని కాలమే ఈ కృషిని తనకు తానుగా ప్రారంభం చేసుకుంటుంది" అని సెలవిస్తారు. అలా సెలవివ్వడం ద్వారా తాము, తమ బాధ్యతల నుండి చేతులు దులుపుకుంటారు. అయితే వారి ఈ ఆచరణ వారిని మానసిక రోగులుగా భావదరిద్రులుగా మార్చివేయక తప్పదు. హతవిధీ! ఒక ముస్లిం యొక్క ఆలోచన ఎంతగా దిగజారిపోయిందీ? స్వయంగా ఈ విధి నిర్వహణ కోసం కృషి చేయకపోగా, ఆ కృషి చేసేవారిని సైతం విమర్శించే, కాలు పట్టి లాగివేసే దుస్థితి దాపురించింది. ధర్మసంస్థాపన కోసం ఉనికిలోకి తేబడిన ఈ సమాజం చివరకు తమ స్వంత కోరికలకు బలి అయిపోయింది. వీరిలో కనీసపు విశ్వాస స్థాయి కూడా కొరవడినట్లు కనపడుతుంది. ఎవరైనా ధర్మసంస్థాపన కోసం కృషి చేస్తుంటే వారికి సహకరించకుండా ఉన్నా - కనీసం వారికి ధైర్యం అందించేవారిలా, వారి కొరకు సృష్టికర్తను ప్రార్థించే వారిలానైనా ఉండవలసింది. అల్లాహ్ ధర్మాన్ని పునరుజ్జీవింపచేసే ఈ కృషిని మనస్ఫూర్తిగా ఆహ్వానించేవారిలాగైనా అయివుండవలసింది. ఇది కూడా చేయలేని వారి మనస్సులో సత్యధర్మపు వెలుగు కనీసంగా, రవ్వంత కూడా లేదని తీర్మానించుకోవలసి ఉంటుంది. ఈ మహానుభావులు మరింత ముందుకెళ్ళి ధర్మసంస్థాపనా కృషిని ఒక 'ఫిత్నా' (ఉపద్రవం) గా సూత్రీకరించి ప్రచారం చేస్తున్నారు. ప్రజలను ఈ ధర్మసంస్థాపనా ఉద్యమం వైపునకు కన్నెత్తి కూడా చూడని పరిస్థితిని కల్పిస్తున్నారు. ఈ కృషి రోజువారీ నిత్యావసర సంపాదనకు అడ్డంకి అని సెలవిస్తున్నారు. వీరి మూర్ఖత్వం పరాకాష్ఠకు చేరిపోయింది. వీరు తమ్ము తాము ముస్లిములుగా చెప్పుకోవడానికి కూడా అర్హత లేనివారు. తాము ఇస్లాం అనుయాయులమని చెప్పుకోవడానికి వీరు సిగ్గుపడవలసి ఉంది. ప్రవక్త ముహమ్మద్ (స) కాలంలో, కొంత తేడాతో ఇటువంటివారే కొంతమంది ఇస్లామీయ ఉద్యమంలో ఉండేవారు. వారి మానసిక స్థితిని దివ్య ఖుర్ఆన్ ఈ పదాలలో చిత్రీకరించింది.

> **"దేవుని మార్గంలో ఖర్చుపెడుతున్నప్పుడు అది బలవంతంగా తమపై రుద్దబడిందని భావించే ఎడారి అరబ్బులు కొందరు ఉన్నారు. మీ (ముస్లింల) విషయంలో వారు కాలం మార్పుల కోసం నిరీక్షిస్తున్నారు." (9:98)**
>
> **"ఈయన కవి, ఈయన వినాశకాలం కోసం మేము ఎదురు చూస్తున్నాము" (52:30) అని అనేవారు.**

సృష్టికర్త అల్లాహ్ ఎవరికి బుద్ధీజ్ఞానాలను ఇచ్చాడో, వారికి కొంత దైవవిశ్వాసపు ప్రేమను కూడా అందించాడు. వారు పైన పేర్కొన్న అత్యంత ప్రమాదకరమైన భయానకమైన మానసిక, భావజాలపర తాత్విక సిద్ధాంతాల వైపునకు కనీసం కన్నెత్తి కూడా చూడరు.

## మెహ్దా మౌవూద్ కోసం నిరీక్షణ

ఇక చివరి గ్రూపునకు చెందినవారు, ఇమామ్ మెహ్దీ కోసం నిరీక్షిస్తూ ఉండేవారు. వీరి విశ్వాసం లేక ఆలోచనల ప్రకారం "ప్రవక్తశ్రీ (స) వారు - ఆదర్శవంత ఖలీఫాల పాలన 30 ఏండ్లకు ముగిసి పోతుందని చెప్పారు. అది అదేవిధంగా ముగిసిపోయింది. మరోవైపు ప్రవక్తశ్రీ (స) వారు భవిష్యవాణి తెలియజేస్తూ 'ప్రపంచం తన దినాలు పూర్తి చేసుకునే సమయం దగ్గరపడినప్పుడు ఇమామ్ మెహదీ (సత్ పురుషులు) ఈ ప్రపంచంలోకి ఏతెంచుతారు. వీరి నాయకత్వంలో మరలా ఒకసారి ఖిలాఫత్, ప్రపంచం మొత్తంపై స్థాపించబడుతుంది. ఈ కారణంగా మన జీవిత లక్ష్యం, ధర్మసంస్థాపన అయినప్పటికీ - ఈ సత్యధర్మాన్ని స్థాపించడానికి మనం ఎటువంటి కృషీ చేయవలసిన అవసరం లేదు" అని ఉంది.

## ఇదొక మోసపూరిత వాదన

ధర్మం పట్ల దాని నియమాల పట్ల అజాగ్రత్త మనల్ని ఎంతటి హీనస్థితికి దిగజార్చివేసిందంటే, పైన వివరించిన అర్థం పర్థం లేని విషయాలు కూడా సాక్ష్యాలుగా, రుజువులుగా ఆమోదింపబడుతున్నాయి. ఎంత బలమైన సాక్ష్యం అంటే, అది మన జీవిత లక్ష్యాన్నే ప్రభావితం చేయగలుగుతుంది. ఈ వాదనల నల్లమందు ఎంత మంది మెదళ్ళను మత్తుకు, విష ప్రభావానికి గురిచేసిందో కదా! ప్రజలను తమ విద్యుక్త ధర్మం నుండి విముఖులను చేసివేసిన ఈ వాదనలోని సత్యతపై తప్పనిసరిగా మనం చర్చచేయవలసి ఉంది. ఇది కేవలం కుట్రతో కూడుకున్న వాదన తప్ప నిజమైన రుజువు కాదని స్పష్టం చేయవలసి ఉంది. ఇందులో భాగంగా మొట్టమొదట ఇమామ్ మెహ్దీ యొక్క రాకడ గురించిన వార్త మనకు ఎక్కడ నుండి అందింది? ఈ వార్తకు ధర్మపరంగా వున్న స్థాయి, స్థానం ప్రాముఖ్యత ఏ పాటిది? అనేది తెలుసుకుందాం.

ఈ ప్రశ్నకు జవాబు వెతకడానికి సహజంగా మన ఆలోచన దైవగ్రంథం దివ్య ఖుర్‌ఆన్ వైపునకు మరలుతుంది? మీరు నమ్మండి, ఈ విషయానికి సంబంధించి దైవగ్రంథంలో ఎటువంటి వాక్యాలూ, పదాలూ మనకు మచ్చుకు కూడా కానరావు. మన జీవితానికి సంబంధించిన అత్యంత ప్రధానమైన విధి, కర్తవ్యం, లక్ష్యానికి సంబంధించిన విషయం - ఆదేశం - శిక్షణ, ప్రాథమిక నిర్ణయాత్మక విషయంగా - ఇమామ్ మెహ్దీ యొక్క రాకడ గురించి ఉన్నట్లయితే దాని ప్రస్తావన తప్పనిసరిగా దైవగ్రంథం చేసి ఉండేది. కాని, అలా జరగలేదు. అంటే, ఈ విషయానికి ధర్మంలో, ధర్మాచరణలో ఎలాంటి ప్రాముఖ్యత లేదని అర్థం అవుతుంది. విషయం ఇంత స్పష్టంగా ఉన్నప్పుడు అత్యంత ముఖ్యమైన ఈ విషయంపై భావ దారిద్ర్యానికి ముస్లిం సమాజం ఎలా గురి అయింది?

దివ్య ఖుర్‌ఆన్ తర్వాత సహీహ్ హదీసుల వైపు దృష్టి సారిస్తే - అందులో కూడా ఇమామ్ మెహ్దీ రాకకు సంబంధించిన దృఢమైన సాక్ష్యాలు ఏవీ కానరావు. ప్రవక్తశ్రీ (స) వారి సహచర సమూహంలోని మొదటి వరుసకు చెందిన సహాబాల ద్వారా కూడా ఈ విషయానికి సంబంధించి ఎంటువంటి రుజువులూ లభించడం లేదు. ఇమామ్ బుఖారీ (రహ్మ) కూడా ఈ వాదనను అంగీకరించడం లేదు. ఇమాం ముస్లిం, ఇమామ్ మాలిక్ లాంటి హదీసువేత్తలు అంగీకరించడం లేదు. ఆ తరువాతి హదీసువేత్తలు మాత్రమే ఈ మహ్దీ రాకడకు సంబంధించిన హదీసులను ఉటంకించడం జరిగింది. ఈ కారణంగా అనేక ఇస్లామీయ ఉద్దండ పండితులు ఈ హదీసుల సత్యతపై అనుమానాలు వ్యక్తం చేశారు. మరికొందరు పండితులు ఈ 'మెహ్దీ' హదీసులను నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. కనుక ఈ భవిష్యత్ వాణికి సంబంధించిన హదీసు ఏకాభిప్రాయంతో కూడుకున్నది కాదు అని రూఢీ అవుతుంది. మెహ్దీ రాకకు సంబంధించిన భవిష్యత్‌వాణి ఒకవేళ ధర్మంలో అత్యంత ప్రాధాన్యత కలిగిన విషయమై ఉంటే, ఆ విషయం స్పష్టమైన 'రివాయత్'లతో 'అస్మావుల్ రిజాల్' ఆధారంగా (ప్రవక్తశ్రీ (స) వారి నుండి సంకలనకర్త వరకు చేరిన గొలుసు పరంపరల పద్ధతి) స్పష్టపర్చబడి ఉండేది. అలా జరగలేదంటేనే ఈ విషయానికి స్వయంగా ప్రవక్త వారి వద్దనూ - ఆ తర్వాత ధర్మప్రచార ఉద్యమ మొదటి వరుస సహాబాల (రిజ్వా)ల వద్దనూ ఈ విషయానికి ఎలాంటి ప్రాముఖ్యత లేదని అర్థమౌతుంది.

ఒకవేళ ఈ హేతుతర్కాన్ని ప్రక్కనపెట్టి ఆలోచించినా మెహ్దీ రాకడ ఒక ముస్లిం యొక్క ధర్మసంస్థాపనా కృషిని ఎలా ప్రభావితం చేయగలుగుతుంది? ఇస్లాం అనుచరులపై ధర్మసంస్థాపనా విధి ఎలా రద్దు అయిపోతుంది? పై భవిష్యవాణి ద్వారా చెప్పబడింది ఏమిటంటే, "ఈ భూవ్యవస్థ మొత్తంగా ధ్వంసం చేయబడటానికి ముందు, ఒక ఆశీర్వదింపబడిన వ్యక్తి యొక్క పాలన వస్తుంది. అప్పుడు ఈ భూమిలోని ప్రతి మూల నుండి దౌర్జన్యం, పక్షపాతం, అశ్లీలం, క్రూరత్వం, కల్లోలం తొలగించి వేయబడుతుంది. ప్రపంచం మొత్తంగా సమన్యాయంతో తులతూగుతుంది. హజ్రత్ అబూబక్ర్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి)ల కాలంలోని ఖిలాఫత్ స్థితి, అంటే ప్రవక్తశ్రీ (స) వారి కాలానికి ప్రతిరూపమైన ఖిలాఫత్ వ్యవస్థ ప్రపంచ వ్యాపితంగా స్థాపించబడుతుంది" అని మాత్రమే.

ఈ వాదన ద్వారా మెహ్దీ రాకడకు ముందు కాలంలోని వారు ధర్మస్థాపనా కృషి చేయడం వ్యర్థమని అర్థమా? పై భవిష్యవాణిలో ఎప్పుడూ, ఎక్కడా ... ఖిలాఫత్ యొక్క 30 ఏళ్ళ తర్వాత నుండి మెహ్దీ రాకడ వరకు గల మధ్య కాలంలో ధర్మసంస్థాపనా కృషి చేయడం వ్యర్థమని చెప్పబడిందా? ఈ ప్రపంచంలోని ఏ ప్రాంతంలో కూడా 'అల్లాహ్ ధర్మం స్థాపించబడదు' అని డిక్లరేషన్ చేయబడిందా? లేదు... కాదు అని చరిత్ర సాక్ష్యం చెపుతుంది. ఖిలాఫత్ వ్యవస్థ కనుమరుగైన సరిగ్గా 70 ఏళ్ళ తర్వాత హజ్రత్ ఇబ్నె అబ్దుల్ అజీజ్ (రహ్మా) నాయకత్వంలో ఖిలాఫత్ వ్యవస్థకు ప్రతిరూపమైన అదే ఖిలాఫత్ వ్యవస్థ స్థాపించబడి మూడు పువ్వులు - ఆరుకాయలుగా విరాజిల్లింది. చరిత్రలో ప్రజా సంక్షేమం దృష్ట్యా సువర్ణాక్షరాలతో లిఖించదగిన కాలంగా విమర్శకులచే ప్రశంసలందుకుంది. ఇస్లామీయ ప్రపంచం ఈ కాలాన్ని కూడా 'ఆదర్శవంత ఖలీఫాల పాలన'గా ఆమోదించింది. ఉటంకించబడిన భవిష్యవాణిలో ఇమాం మెహ్దీ రాకడతో పాటుగా, ఆయన రాకడకు ముందు అనేకమంది ధర్మవీరులు, ధర్మస్థాపకులు వస్తారనే మాట కూడా చెప్పబడింది. ఈ ధర్మస్థాపకులైన వీరులు అరుదెంచినపుడు, వారికి పూర్తి సహకారం అందించడం ముస్లిం సమాజపు 'ధర్మవిధిగా' అందులో చెప్పబడింది. ఉదాహరణకు ఈ క్రింది ప్రవచనాన్ని గమనించండి.

"మీరు ఎప్పుడైతే ఖురాసాన్ వైపు నుండి నల్లని పతాకాలు రెపరెప లాడుతూ రావడం గమనిస్తారో, అప్పుడు మీరు వెంటనే వారివద్దకు చేరిపోండి. ఈ చేరిపోయే

దారి అత్యంత కఠినమైనదైనా – అనగా మంచుపై ప్రాకుతూ చేరవలసివచ్చినా వారివద్దకు చేరిపోండి. ఎందుకంటే; ఆ పతాక బృందంలో అల్లాహ్ వరప్రసాది అయిన ఖలీఫా ఉంటాడు."

మరో ప్రవచనం గమనించండి : "మావరా అల్ నహ్ర్ నుండి 'హారిస్ హరాస్' అనే పేరుగల ఒక వ్యక్తి బయలుదేరుతాడు. ఆయనకు ముందు వరుసలో (అనగా సైన్యాధ్యక్షుడు) మన్సూర్ పేరుగల వ్యక్తి వుంటాడు. ఇతను ప్రవక్త ముహమ్మద్ (స) వారసులకు శక్తి, అధికారాలు అందిస్తాడు. (ఏ విధంగా ఖురైష్‌వారు ప్రవక్తశ్రీ (స) వారికి శక్తి, అధికారాలు అందించారో అదేవిధంగా) కనుక ప్రతి (ముస్లిం) దైవవిధేయుడు విధిగా ఆయనకు సహాయపడవలసి ఉంది. మరోమాటలో ఆయన పిలుపునకు 'లబ్బైక్' అనవలసి ఉంటుంది." (అబూదావూద్ – రెండవ భాగం)

పై భవిష్యవాణికి సంబంధించిన ప్రవచనాలలో చెప్పబడిన వ్యక్తులందరూ ఒకే వ్యక్తికి అనగా 'మెహ్దీ'కి మారుపేర్లుగా భావించే పొరపాటు చేయకూడదు సుమా! ఎందుకంటే, హజ్రత్ మెహ్దీ మదీనా నగరం నుండి బయలుదేరుతారని ప్రవచనం చెపుతుంది. కాని ఇక్కడ బయలుదేరే ధర్మవీరులు 'ఖురాసాన్' మరియు 'అల్ నహ్ర్' ల నుండి బయలుదేరుతారని చెప్పబడింది. అంతేకాదు మెహ్దీ – ప్రవక్త ముహమ్మద్ (స) గారి పేరును కలిగి ఉంటారు. కాగా, ఈ ధర్మవీరులు 'హారిస్ హరాస్', 'మన్సూర్'లుగా చెప్పబడ్డారు. కనుక వీరు ఒకే వ్యక్తికి, ఒకే సమయానికి ప్రతి రూపాలు కారు అనేది సుస్పష్టం. అంతేకాదు, ఈ ప్రవచనాల ద్వారా ధర్మసంస్థాపనా వీరుల జాబితా ముగిసిపోయిందని కూడా పొరపాటు అర్థాలు తీయడం సబబు కాదు. ప్రళయకాలం వరకు, ధర్మసంస్థాపన కోసం ఎప్పుడైనా, ఎక్కడైనా, ఎవరైనా కృషి చేస్తూ ఉంటే, ముస్లిం సమాజం ఆ కృషిలో భాగస్వాములై పోవాలనే అర్థం ఈ ప్రవచనంలో దాగి ఉందని గ్రహించాలి.

ఏతావాతా పై ప్రవచనం ద్వారా తెలిసేది ఏమిటంటే, రానున్న కాలంలో కేవలం మెహ్దీ మౌవూద్ మాత్రమే కాదు, ఆయనకు ముందు అనేక మంది ధర్మసంస్థాపనా కృషీవలురు ఈ ప్రపంచంలో ప్రభవిస్తారు. వారు, ఆయా కాలాల్లో ధర్మసంస్థాపనా కృషిని కొనసాగిస్తారు. అప్పుడు 'ఉమ్మతె ముస్లిమ' వారి కృషిలో పూర్తిగా సహకారం అందించాలి. డేకుతూ, తలక్రిందులుగా నడుస్తూ అయినా ఈ ధర్మ సంస్థాపనా ఉద్యమంలో పాలుపంచుకొని తీరాలి. విషయం ఇంత స్పష్టంగా

ఉన్నప్పుడు మెహ్దీ రాకడ కొరకు ఎదురు చూపులు చూడటం ఎంతవరకు సమంజసం? చేతులు ముడుచుకొని, క్రియాశూన్యులై ధర్మవ్యతిరేక వ్యవస్థలో ఆనందంగా జీవించడం ఎలా సాధ్యమో విజ్ఞులు ఆలోచించాలి. మెహ్దీ రాకడగాని, హారిస్ హరాస్‌ల ప్రభావం గాని, ఒక ముస్లింను తన ధర్మసంస్థాపనా కర్తవ్య నిర్వహణ నుండి విడుదల ప్రసాదించడం లేదు. సరికదా ఈ విధి నిర్వహణ తప్పనిసరి అని మరింతగా రుజువు చేస్తుంది.

సూత్రబద్ధంగా ఆలోచిస్తే – ధర్మసంస్థాపనా విధి ప్రతి ముస్లింపై తప్పనిసరి హక్కు కలిగి ఉందని రుజువు అవుతుంది. అంతేకాదు, ఈ విధి ఒక్కటే జీవిత లక్ష్యంగా ఉండతగినది అని కూడా రూఢీ అవుతుంది. ఈ విధి కోసం అహర్నిశలు సాధన చేయడమే విశ్వాసానికి గీటురాయిగా ఉంటుంది. ఒక విశ్వాసి యొక్క సహజ లక్షణంలోనే అసత్యాన్ని అంగీకరించని తత్వం ఉంటుంది. ఈ ప్రపంచంలోని ఏ ప్రాంతంలోనైనా 'అసత్యం' ఉనికిలో ఉండటాన్ని విశ్వాసి యొక్క అంతరంగం అంగీకరించదు. అల్లాహ్ దాస్యం, దైవగ్రంథ అనుసరణల మొదటి మరియు చివరి ఆదేశం ఏమిటంటే, 'ఒక విశ్వాసి ఈ ప్రపంచంలోని ఒక్క అంగుళం ప్రాంతంలో కూడా అసత్య వ్యవస్థ ఉనికిలో ఉండటం అంగీకరించకూడదు. అసత్య వ్యవస్థను కూకటి వ్రేళ్ళతో సహా పెకిలించి వేయడానికి తన సర్వ శక్తులను ఒడ్డి శ్రమించాలి. అసత్య వ్యవస్థ కాళ్ళక్రింద ఒక్క అంగుళం భూమి కూడా అణిగి ఉండటాన్ని విశ్వాసి అంగీకరించనే కూడదు. కనుక ఒక విశ్వాసి అన్నివిధాలుగా, ఏ స్థితిలో ఉన్నా, ఏ కాలంలోనైనా, ఎటువంటి పరిస్థితులలోనైనా, ఎటువంటి వాతావరణంలోనైనా, ప్రతిప్రాంతంలోనూ ధర్మసంస్థాపనా కృషి నిరంతరంగా చేయకతప్పదు. ఇమామ్ మెహ్దీ ఎప్పుడు వస్తారో అప్పుడు ఆయన, తన విధిని తప్పక నిర్వర్తిస్తారు. ఆయన, నా విధినీ, మీ విధినీ నెరవేర్చడానికి రారు. ఆయన తన విధిని నెరవేర్చడానికి వస్తారు. ఆయన నిరంతర శ్రమ, కేవలం – అల్లాహ్ తనపై ఉంచిన బాధ్యతల బరువును నెరవేర్చడం కొరకై ఉంటుంది. ఇతరుల బరువును మోయడం ఆయన అభిమతంగా ఉండదు. అలా చేయలేడు కూడాను. ఎందుకంటే, ఆయన ఇంకొకరి నమాజ్‌ను పాటించలేరు కదా! అదే విధంగా మరొకరి రోజా విధిని కూడా ఆయన నెరవేర్చలేరు. అదేవిధంగా ఇంకొకరి వైపు నుండి ఆయన ధర్మసంస్థాపనా విధిని కూడా నిర్వర్తించలేరు. మెహ్దీ కోసం వేచిచూచేవారు, ఆయన రాకడా పరుపుపై నేటి నుండియే విశ్రాంతి తీసుకోవడం మొదలెట్టారు. ఆయన రాకడ ఇంకా ఊపిరి

పోసుకోవడమే జరగలేదు. నిశ్చయంగా ఆయన ఎప్పుడు అరుదెంచినా, ఆయన మరొకరి కర్తవ్యం నెరవేర్చటానికి రాడు. ఆయన తనపై విధి చేయబడిన కర్తవ్యాన్ని నిర్వర్తించడానికి మాత్రమే అవిరళ కృషి చేస్తారనేది మర్చిపోకూడదు. ఆయన వచ్చిన సమయంలో సైతం ప్రతి ముస్లిం, తన కర్తవ్యాన్ని తానుగా నెరవేర్చవలసి ఉంటుంది. ఇమామ్‌పై ఈ విధి ఎంతటి తప్పనిసరిగా ఉంటుందో – అదేవిధంగా ప్రతి ముస్లింపై ఈ విధి అంతే తప్పనిసరిగా ఉంటుంది. ప్రవక్త ఈసా (అలై) మాటల్లో చెప్పాలంటే "ప్రతి ఒక్కరు తన శిలువను తానే మోయవలసి ఉంటుంది. ఎవరైతే అలా చేయడో పరలోక రాజ్యంలో అతను ప్రవేశింపలేడు." ఈ వాస్తవాన్ని ముస్లింలు నిరంతరం దృష్టిలో ఉంచుకోవాలి. నిరంతరం అల్లాహ్ వద్ద ధర్మబద్ధ, చైతన్య క్రియాశీల నాయకుని నాయకత్వంలో పనిచేసే సౌభాగ్యం కోసం వేడుకుంటూ ఉండాలి. ఈ ప్రపంచంలో ధర్మసంస్థాపన ద్వారా శాంతి, సంక్షేమాల సాధన జరిగేలా దుఆ చేస్తూ ఉండాలి. ఒక్క క్షణం కూడా, నా కోసం ఎవరో వస్తారు, ఏదో చేస్తారు, నా శ్రమను ఇంకొకరు మోస్తారు అనే భ్రమల్లో ఉండకూడదు. తన ధర్మసంస్థాపనా విధి నిర్వహణ పట్ల నిర్లక్ష్యం ప్రదర్శించకూడదు. అలా జరిగితే క్రైస్తవ సోదరుల వలెనే మనం కూడా మార్గభ్రష్టత్వానికి గురి అయిపోతాము. ప్రవక్త ఈసా (అలై) తాను శిలువ ఎక్కడం ద్వారా తన అనుచరులను ధర్మ ఆచరణ నుండి విముక్తులు చేసినట్లుగా అపోహకు గురి అయిపోతారు జాగ్రత్త!

## ఆత్మ పరిశీలన ఆవశ్యకత

ధర్మసంస్థాపనా విధి నుండి తమ్ము తాము వేరుపర్చుకోవడానికి, పలాయనం చిత్తగించడానికి చేసే వాదనలలోని డొల్లతనాన్ని పై చర్చలలో మనం గమనించాం. పై విషయాలను హేతువు దృష్టితో ప్రశాంత చిత్తంతో, రాజకీయ గ్రూపు సంస్కృతి నుండి బయటపడి ఆలోచిస్తే – ఈ ఆలోచనల పునాదులపై మన భావాలను, ఆచరణలను బేరీజు వేసుకుంటే మన జీవితంలోని చీకటి తప్పక తొలగి పోతుంది.

నిర్లక్ష్యం, అశ్రద్ధ, వాటి తాలూకు తాత్విక దృక్పథాలు సంవత్సరాలుగా మన మెదళ్ళపై ప్రభావం చూపుతూ వచ్చినదాని ఫలితంగా, మనం మన లక్ష్యం–ధ్యేయాల నుండి సుదూరంగా వెళ్ళిపోయాము. అయితే మన అంతరాత్మ ఇంకా సజీవంగానే ఉందనీ, ఆత్మ పరిశీలన చేయడంలో కఠినంగా కూడా వ్యవహరిస్తుందని మరిచిపోకూడదు. విశ్వాసి యొక్క అంతర్మథనంలో ధర్మసంస్థాపనా విధి నుండి

తప్పించుకోవడానికి అతని మనస్సు తన వద్ద నున్న అన్ని అస్త్రాలను ప్రయోగిస్తుంది. ఈ అస్త్రాలలో ధనం, బలం, తర్కం, జ్ఞానం లాంటి ఈ అంశాలన్నింటిని వినియోగిస్తుంది. అవసరమైతే వీటన్నింటిని పణంగా పెడుతుంది కూడా. ఈ మనస్సు చేసే వాదనకు వ్యతిరేకంగా మరోవైపున అతనికి సత్యం యొక్క కాంతి కనపడుతూ ఉంటుంది. వివేకం ఆ కాంతి వైపునకు ఉరకలు వేయమని ఉత్సాహపరుస్తుంది. అంతరాత్మ గొంతు చించుకొని సత్యకాంతికి ఆహ్వానం పలకమని ప్రేరేపిస్తూ ఉంటుంది. ఈ మానసిక సంఘర్షణలో అసత్యం – విశ్వాసి యొక్క హృదయాన్ని సంతృప్తిపర్చడానికి, దానిని తన అధీనంలో ఉంచుకోవడానికి అనేక వాదనలు వినిపిస్తుంది. ఇప్పటి వరకు నీవు చేసిన, చేస్తూవున్న ఆచరణ మొత్తం వ్యర్థమైనదేనా? అని అంతరంగాన్ని ప్రశ్నిస్తుంది. ప్రపంచంలోని ప్రముఖులు, మేధావులు ఆచరిస్తున్న జీవితం - పయనిస్తున్న మార్గాలన్నీ 'తుర్కిస్తాన్'కే చేరుతున్నాయా? లాంటి ప్రశ్నలతో వ్యక్తిలోని సత్యకోణాల్ని బలహీనపర్చటానికి ప్రయత్నిస్తుంది. ఈ మానసిక దాడుల నుండి తప్పించుకొని మిగిలేవారు బహుకొద్దిమంది మాత్రమే ఉంటారు. సత్యాసత్యాల సంఘర్షణలో, సత్యాన్ని ఆమోదించేవారు బహుకొద్దిమంది మాత్రమే ఉంటారు. దశాబ్దాలుగా మనిషిలోని ఈ బలహీనతే ధర్మసంస్థాపనా మార్గంలో అవరోధంగా పెద్ద బండరాయిలా మారివుంది. దైవాదేశాలను అనుసరించమని వారిని కోరినప్పుడు వారిలోని అసమర్థుల నుండి లభించే సమాధానం ఇలా ఉంటుంది :

**"మా పూర్వీకులు అవలంబిస్తూ ఉండగా చూచిన పద్ధతినే మేమూ అనుసరిస్తాము." (2:170)**

కనుక సత్యాభిలాషులు అయిన వారందరూ మనసులోని పై ఘర్షణ, అందులోని బలహీనతల పట్ల నిరంతరం జాగరూకత కలిగి ఉండాలి. ధర్మాధర్మాలు, సత్యాసత్యాల ప్రమాణం కేవలం ఒక వ్యక్తి (మెహ్దీ)పై ఉండకూడదనే గొప్ప సత్యాన్ని తెలుసుకొని ఉండాలి. కేవలం చివరి దైవప్రవక్త ముహమ్మద్ (స) యొక్క వ్యక్తిత్వం తప్ప, మరే వ్యక్తీ మనకు ఆదర్శంగా ఉండకూడదు. ప్రవక్త (స) స్థాపించిన సహాబాల జమాఅత్ తప్ప మరే జమాఅత్ మనకు ఆదర్శంగా ఉండకూడదు. ఈ ఉన్నత మానసిక స్థితికి చేరకుండా ఇస్లామీయ విప్లవం సాధ్యం కాదు. ఆచరణలో నిష్ఠ, నిబద్ధతలు అలవడవు. ఈ పరిస్థితిని దొరకబుచ్చుకోనంత వరకు దైవం వైపు నుండి సహాయ సహకారాలు అందడం సాధ్యం కాదు. కనుక చర్చించబడుతున్న సమస్యకు కేవలం చివరి దైవగ్రంథం

దివ్య ఖుర్‌ఆన్, దైవప్రవక్త సంప్రదాయమైన సున్నత్ ప్రవక్త సహచరుల ఆచరణలు మాత్రమే పరిష్కారంగా మన ముందు ఉండాలి. ఈ సత్య జ్ఞానపు చెలమల నుండి లభించే జ్ఞానం మాత్రమే సత్యమైనది. మానవునికి అతని చివరి శ్వాస వరకు సత్యధర్మ స్థాపన కొరకు ఉత్సాహపరిచే, అవిరళ కృషి చేసే ప్రేరణ ఈ జ్ఞానపు ఊటయే అందించగలుగుతుంది. ఈ ఒకే ఒక్క జీవిత లక్ష్యం కోసం తమ జీవితాలను ప్రత్యేకించుకోండి. ఈ జీవిత లక్ష్యానికి భిన్నమైన, వ్యతిరేకమైన అనుసరణ అయినా, షేక్ లేక ఇమామ్‌లపై నమ్మకమైన నాయకులు, మేధావులపై విశ్వాసమైనా, ఏ సంఘాలతో, జమాత్‌లతో సంబంధమైనా ఈ లక్ష్యం నుండి, ఈ సత్య ధ్యేయం నుండి మిమ్మల్ని నిరోధిస్తూ ఉంటే వాటిని బేషరతుగా వదలివేయండి. వీటన్నింటినీ మనసును ప్రలోభానికి గురిచేసే ప్రతి షైతానీ చేష్టలుగా గుర్తించండి. ఈ బంధనాల చక్రబంధాన్ని ఛేదించి – ఈ కల్లోలం నుండి తన్ను తాను రక్షించుకొని – తన అంతరాత్మ ప్రబోధానికి అనుగుణంగా విధి నిర్వహణ కోసం, కర్తవ్య పాలనకోసం నిలబడే వ్యక్తి ఎంత అదృష్టవంతుడో కదా! అతనిపై దేవుని కారుణ్యాలు అనంతంగా వర్షించుగాక! (ఆమీన్). అల్లాహ్ పట్టునుండి ముర్షద్‌లు, ఇమామ్‌లు, నాయకులు, నమ్మకాలు, శక్తిసంబంధాలు, భవబంధాలు కాపాడలేవని గుర్తించండి. వాస్తవ జ్ఞానం, సత్యమార్గం మన హృదయాల వరకు చేరనంత వరకు బహుశా మనం అల్లాహ్ ద్వారా క్షమించబడవచ్చు. కాని, ఒకసారి సత్యం మన ముందు సాక్షాత్కరింపబడిన తరువాత మనం క్షమాభిక్షకు అర్హులం ఎంతమాత్రమూ కాము. అల్లాహ్ ధర్మానికి సంబంధించిన వాదన (హుజ్జత్) పూర్తి అయిపోయిన తరువాత మనిషికి క్షమాభిక్షకు సంబంధించిన అన్ని తలుపులూ మూసుకొని పోయాయని గుర్తించాలి.

ఈ వివరణ తర్వాత ఇప్పుడు మన ముందు కేవలం రెండు మార్గాలు మాత్రమే ఉన్నాయి. సత్యాన్ని అంగీకరించి ధర్మసంస్థాపనా కృషికి పూనుకొని అల్లాహ్ సంతృప్తికి అర్హులం కావడమా? లేక సత్యాన్ని నిరాకరించి, విధి – కర్తవ్యాల నుండి విముఖులై అల్లాహ్ ఆగ్రహానికి గురికావడమా? ఈ విషయాన్ని దివ్య గ్రంథం విస్పష్టంగా "స్పష్టమైన మా సూచనలు వారి ముందుకు వచ్చినప్పుడు, వారు 'ఇది స్పష్టమైన మాయాజాలమే' అని అన్నారు. వారు అన్యాయంగా, అహంకారంతో ఆ సూచనలను తిరస్కరించారు" (27:13–14) అని ప్రకటించింది. పైన పేర్కొన్న రెండవ మార్గపు సంప్రదాయాన్ని కొనసాగించిన వారికి ఎటువంటి గతి పట్టిందో గమనించాలి.

నిస్సందేహంగా ధర్మసంస్థాపనా మార్గం చాలా కఠినమైనది. ఈ మార్గంలో అడుగడుగునా ముళ్ళు దర్శనమిస్తాయి. అయితే అల్లాహ్ అభీష్టం నెరవేర్చునకు ఇంతకంటే వేరే మార్గమే లేదు. ఇహలోక జీవితాన్ని పతనం నుండి, పరలోక జీవితాన్ని వైఫల్యం నుండి కాపాడుకోవడానికి ఇంతకంటే మంచి దారి లేనేలేదు. ఈ మార్గంలో ఎవరి పాదాలైనా ముళ్ళబారిన పడి, తమ ప్రయాణాన్ని ఆపి అక్కడనే నిలబడిపోవచ్చు. అయితే, ఎవరైనా అతనిని సరైన మార్గం గురించి ప్రశ్నించినపుడు "ఇదే సత్యమైన మార్గమని, ఈ మార్గంలోనే సాఫల్యం ఉందని, దురదృష్టవశాత్తు నేను నడవలేక నిలబడి పోయిఉన్నానని" నిజాయితీగా చెప్పవలసి ఉంటుంది. ఎందుకంటే రేపు అల్లాహ్ న్యాయస్థానంలో 'అబద్ధీకుడు' అనే నేరం నుండి అతను రక్షింపబడగలడు. ఇంతటి ప్రకటనా ధైర్యం కూడా లేని వ్యక్తి కనీసం తన పాదాలను నిలిపివేసు కున్నట్లుగానే, తన నోటిని కూడా మెదపకుండా ఉండిపోవాలి. ఈ మార్గంలో ప్రయాణించే ప్రయత్నం చేసేవారిని, నిరాశానిస్పృహకు గురిచేసేలా మాట్లాడకుండా ఉండాలి. ధర్మసంస్థాపనా కృషిని నిరోధించే నేరాన్ని తమ భుజాలపై మోయకుండా ఉండటానికి ఇదే ఉత్తమ మార్గం. అల్లాహ్ మార్గాన్ని నిరోధించడం ఒక భయానకమైన అభిశాపంగా పేర్కొనబడింది. తస్మాత్ జాగ్రత్త!

ఈ సందర్భంగా ఏ వ్యక్తి అయినా లేదా జమాఅత్ అయినా ధర్మసంస్థాపనను నిరోధించడానికి నిలబడి ఉంటారా? అనే చర్చ అప్రస్తుతం. ఈ స్థితి నేడు లేకపోవచ్చు. కాని, రేపు రాదనడానికి గ్యారంటీ లేదు. చరిత్రలో సాగిన ఆచరణాత్మక రికార్డును పరిశీలిస్తే, ఈ స్థితి దాపురించడం విశేషమేమీ కాదు. ప్రవక్త ఈసా (అ) కాలంలో ఈ హృదయవిదారక స్థితి సంభవించినట్లు మనకు చరిత్ర చెపుతుంది. మత్తయి 23 ప్రకారం ఆనాటి ముస్లింలైన యూదు పండితుల ఆచరణను ప్రవక్త ఈసా (అ) ఇలా ఉటంకించారు : "అయ్యో! వేషధారులైన శాస్త్రులారా! పరిసయ్యులారా! మీరు మనుష్యుల ఎదుట పరలోక రాజ్యమును మూయుదురు. మీరందులో ప్రవేశింపరు. ప్రవేశించువారిని ప్రవేశింపనియ్యరు." (మత్తయి 23 : 13 - 14) ఈ దుస్థితి నేటి ముస్లిం సమాజానికి రాకుండా ఉండేందుకు అల్లాహ్‌ను కన్నీటితో తప్పక వేడుకుందాం!



**అయిదవ అధ్యాయం**

# ధర్మసంస్థాపనా విధానం

## లక్ష్యం, విధానాల మధ్య సహజ సంబంధం

ధర్మసంస్థాపనా కృషి ఒక తప్పనిసరి 'విధి' అని రుజువు అయిన తరువాత, ఎటువంటి పరిస్థితి, సంజాయిషీలకు తావులేని 'విధి' అని కూడా రూఢీ అయిన తరువాత - మనం ఈ విధి నిర్వహణ కోసం ఎటువంటి ఆచరణా విధానాన్ని ఎంచుకోవాలి? అది ప్రశాంత చిత్తంతో, అత్యంత నిజాయితీగా ఆలోచించవలసి ఉంటుంది. ఈ ధర్మసంస్థాపనా ఉద్యమ గమ్యాన్ని చేరడానికి ఏదైనా ఒక ప్రత్యేకమైన విధివిధానం ఉన్నదా? లేక ఎవరికి తోచినట్లు, అర్థమైనట్లు, ఎలాపడితే అలా ఈ గమ్యాన్ని చేరుకోవచ్చా? సామూహికత, నిర్మాణాల గురించి కనీస అవగాహన ఉన్న వారెవరైనా ఒక సత్యాన్ని తప్పనిసరిగా గుర్తిస్తారు. అది - ప్రతి నిర్మాణానికి (సంఘం-జమాఅత్) అది ఏ లక్ష్యంపై నిలబడిందో, దానికి తగిన స్వభావం కూడా కలిగి ఉంటుంది. అంతేకాక ఆ స్వభావానికి తగిన, తాత్విక భావజాల సైద్ధాంతికతలకు అనుగుణమైన రూపం కూడా కలిగి ఉంటుంది. దాని విధి విధానాలు, సూత్రబద్ధ పని విధానాలు, దాని నిర్మాణాత్మక వ్యవస్థలు అన్నీ ఈ మూసలోనే పోయబడి ఉంటాయి. ఒక్కమాటలో ఏ లక్ష్యం కోసం ఆ నిర్మాణం లేచి నిలబడిందో, ఆ లక్ష్యమే దాని పని విధానాన్ని కూడా నిర్దేశిస్తుంది. ఈ విషయాన్ని కొన్ని ఉదాహరణల ద్వారా అర్థం చేసుకొనే ప్రయత్నం చేద్దాం.

మీరు ఒక జాతీయ ప్రభుత్వం ఏర్పర్చదలిచారు. ఈ లక్ష్యాన్ని చేరడానికి మీకు అవసరమైన సాధనాలను సమకూర్చుకున్నారు. అందులో మొట్టమొదటి జాతి ప్రజల హృదయాలలో జాతీయ భావం పట్ల, జాతి ఆధిపత్యం పట్ల, జాతీయ అధికార భావనల పట్ల అంతులేని ప్రేమను నూరిపోసే ప్రయత్నం చేస్తారు. మనకు మనమే పాలకులం అనే చైతన్యాన్ని ఉద్దీపింపజేస్తారు. ఆ తర్వాత జాతీయ గౌరవం కోసం తన్ను తాను అర్పించుకునే ఆత్మ బలిదాన ఉత్సాహాన్ని - అగ్నిని వారిలో

జ్వలింపజేస్తారు. తనకు అత్యంత ప్రియమైన ఈ లక్ష్యాన్ని సాధించడానికి ఒక ప్రజావేదికను తయారుచేస్తారు. ఆ వేదిక ద్వారా తమలోని ప్రతిభలన్నీ వెచ్చించబడేలా ఈ వేదికను తీర్చిదిద్దుతారు. ఎప్పుడైతే ఈ ప్రయత్నాలు అన్ని మీరు పూర్తిచేస్తారో - మీరు విజయానికి అవసరమైన భౌతిక షరతులన్నింటినీ పూర్తిచేసిన వారౌతారు. ఇక వేదికపై మీ జెండా క్రింద సమీకృతమైన ప్రజలు ఏకేశ్వరోపాసకులా? (తౌహీద్ ఉపాసకులా?) కాదా? అనే అంశంతో మీకు అవసరమే ఉండదు. వారు సందేశ పరంపరపై (రిసాలత్), మరణానంతర తీర్పుదినంపై (ఆఖిరత్) ఏ అభిప్రాయాలను కలిగి ఉన్నారు? అనేది అనవసరం. వీరిలో ప్రళయదినపు శిక్షా బహుమానాల అవగాహన ఉందా? వీరిలో ధర్మనిష్ఠ ఎంతవరకు ఉంది? సత్యం, కారుణ్యం, పవిత్రతల, నీతినియమాల, నైతిక విలువల పట్ల వీరి ఆచరణ ఎలా ఉందీ? అనే విషయాలు అప్రస్తుతాలు అయిపోతాయి. ఎందుకంటే, మీ ముందు ఏ జీవిత లక్ష్యం - గమ్యం - ధ్యేయం ఉన్నదో, దాని కొరకు పైన పేర్కొన్న గుణ విశేషణ లక్షణాల అవసరమే లేదు. తమ లక్ష్యాన్ని ఛేదించడానికి అవసరమైన బలమైన శక్తి, తమ లక్ష్యాలకు వ్యతిరేకులైన వారిపట్ల తీవ్రమైన ద్వేషం - కసి, తమ జాతిపట్ల గ్రుడ్డి ప్రేమలతో పాటుగా ఈ ప్రేమ-ద్వేషాల కోసం ఏమైనా చేసివేసే తెగువ ఉంటే చాలు.

ఇక రెండవ ఉదాహరణను గమనించండి :

మీరు ఈ దేశంలో కార్మికవర్గ నియంతృత్వమైన కమ్యూనిస్టు వ్యవస్థను స్థాపించదలిచారు. దానికి ప్రాథమిక దశలో, ఈ దేశ ప్రజల ఆలోచనల్లో భావాల్లో కమ్యూనిస్టు సిద్ధాంతం, జీవితం, కమ్యూనిస్టు వ్యవస్థ, దాని ఆర్థిక విధానం లాంటి "అతి గొప్ప" భావనలను కలుగ చేయవలసి ఉంటుంది. పెట్టుబడిదారి వ్యవస్థనే కాదు, పెట్టుబడిదారుల పట్ల కూడా వర్గకసిని, వర్గ ద్వేషాన్ని రగిలిస్తారు. ధార్మికులు దేవుడిని, ప్రవక్తలను ఆమోదించిన రీతిలో మార్క్స్, లెనిన్‌లను ఆమోదింపచేసేలా ప్రయత్నిస్తారు. దైవం, ప్రవక్తలు, తీర్పుదినం, ధర్మం, నైతికతలు, విశ్వాసం, సత్కార్యాలు లాంటి పదాలు కేవలం పెట్టుబడిదారులు ఉపయోగించే మత్తు బాణాలని - వర్గ పోరాటానికి అడ్డంకులని ప్రచారం చేస్తారు. తద్వారా ఈ భావాల ప్రభావాన్ని, తాత్విక చింతనను వీరి మనోమస్తిష్కాల నుండి తొలగించివేసే ప్రయత్నం చేస్తారు. వారి మస్తిష్కాలలో కేవలం భౌతిక పదార్థవాదాన్ని - గతి తార్కిక భౌతిక వాదాన్ని దట్టించి మనిషిని సామాజిక పశువు (Social Animal) గా ఆమోదింపజేస్తారు.

ఎప్పుడైతే ఈ పునాదులు ఏర్పరచుకుంటారో, ఈ భావాలు కలిగిన కార్యకర్తలను పెద్ద సంఖ్యలో సమీకరించుకుంటారో, వారందరినీ ఒక వర్గంగా ఒక పార్టీగా నిర్మించుకుంటారు. వీరి ద్వారా ఒక వైపున విశాల ప్రజానీకంలో పెట్టుబడిదారీ వ్యవస్థ పట్ల అసహ్యం, కసి, ద్వేషం ఏర్పడేలా బహిరంగ ప్రచార కార్యక్రమానికి శ్రీకారం చుడతారు. మరోవైపున రహస్యంగా, పెట్టుబడిదారీ వ్యవస్థను కూల్చివేసి, దాని స్థానంలో కమ్యూనిస్టు వ్యవస్థను స్థాపించే నిరంతర కృషిని కొనసాగిస్తారు. పెట్టుబడిదారీ వ్యవస్థను, దాని అధికారాన్ని కూలదోసే విప్లవాన్ని నడిపిస్తారు. చివరగా కార్మిక వర్గ నాయకత్వంలో కమ్యూనిస్టు వ్యవస్థను, కార్మిక వర్గ నియంతృత్వ పాలనను స్థాపిస్తారు.

ఇక చివరిదైన మూడవ ఉదాహరణను చూద్దాం. ఒక వ్యక్తి, ఏక సత్తాక నిరంకుశ వ్యవస్థను స్థాపించదలిచాడు. అతను తనకు అవసరమైన శరీర దారుఢ్యం కలిగిన వారిని, భయభీతులు ఎరుగనివారిని, కఠిన హృదయులను, రక్త పాతానికి వెరువని మానసికత గలవారిని ఎన్నుకుంటాడు. ఇతనికి కారుణ్యం, మెత్తని హృదయం కలవారి అవసరమే ఉండదు. ఎన్నుకున్నవారిని ఒక గ్రూపుగా, దళంగా ఏర్పర్చి వారికి 'అత్యంత అవసరమైనది' కల్లోలం, రక్తపాతం కొనసాగించే సైనిక శిక్షణను ఇస్తాడు. వారికి దౌర్జన్యం, దోపిడీ, మారణకాండలు చేయడంలో ఉత్సాహాన్ని, ఆనందాన్ని కలిగించేస్తాడు. ఆ తరువాత తన జీవిత లక్ష్యం కోసం వీరిని ఉపయోగిస్తాడు.

కనుక ప్రపంచంలోని ప్రతి ఉద్యమం లేక వ్యవస్థ దానికి తగిన ఆచరణా విధానాన్ని, నిర్మాణ సూత్రాలను కలిగి ఉంటుంది. ఇది ఒక తప్పనిసరి అయిన సహజ చర్య. తన జీవిత లక్ష్యానికి అనుగుణమయిన ఆలోచన, ఆచరణ, పాలసీ, పని విధానాలను కలిగి ఉండటం అత్యంత సహజం. ముస్లిం సమాజం (ఉమ్మతె ముస్లిమ) అనబడే ఈ సంఘం కూడా పై సహజ సూత్రానికి భిన్నంగా వ్యవహరించడం సాధ్యం కాదు. ధర్మసంస్థాపనా లక్ష్యంతో మైదానంలోకి అడుగు పెట్టిన ఈ సంఘం తన లక్ష్య సాధనకు అవసరమైన ప్రత్యేక విధి విధానాలను, సూత్రాలను, ఆచరణా విధానాలను, నిర్మాణ వ్యవస్థను కలిగి ఉంటుంది. రండి! ఆ విధివిధానాలు, ఆచరణా పద్ధతులు ఎలా ఉంటాయో తెలుసుకుందాం!

## పని విధానానికి మూల సరోవరాలు

పని విధానానికి సంబంధించి సహజంగా మన దృష్టి దివ్య ఖుర్‌ఆన్, ప్రవక్త

(స) సంప్రదాయాలపై నిలుస్తుంది. ఎందుకంటే, ధర్మసంస్థాపన విధి చేయబడిన - జీవిత లక్ష్యం గావించబడిన వనరు ఈ రెండింటి నుండే మనకు లభిస్తుంది. కనుక ఈ విధి నిర్వహణకు, లక్ష్యసాధనకు, గమ్యం చేరుటకు అవసరమైన మార్గదర్శకాలు, విధివిధానాలు సైతం పై రెండు వనరుల ద్వారా లభించడమే సబబు. ఖుర్‌ఆన్ మరియు సున్నత్ గ్రంథాలు ఈ అవసరాన్ని సంపూర్ణంగా నెరవేర్చాయి. ఇస్లాం పట్ల కనీస జ్ఞానం గల వ్యక్తి కూడా ఈ విషయాన్ని స్పష్టంగా అర్థం చేసుకోగలడు. ఆ ఖుర్‌ఆన్‌ను ప్రపంచానికి అందించిన కారుణ్యమూర్తి (స) విశ్వాసుల జీవిత లక్ష్యాన్ని ఎంతటి స్పష్టమైన భాషలో అందించారో - అంతే స్పష్టతతో దాని విధి విధానాలను, ఆచరణా పద్ధతులను కూడా అందించారు. ఇందులో ఎటువంటి దాపరికానికి తావే లేదు. ఏ విధంగా రాత్రి చీకటిలో ఆకాశంలోని నక్షత్రాలు స్పష్టంగా మిలమిలా మెరుస్తు దర్శనమిస్తాయో - అదేవిధంగా ధర్మసంస్థాపనా విధి యొక్క విధివిధానాలు, సూత్రాలు మనకు దర్శనమిస్తాయి. కబోదులు కాని వారందరూ ఈ విషయాన్ని స్పష్టంగా చదవగలరు. ఖుర్‌ఆన్ అవతరణా విధానం, ప్రవక్త కారుణ్యమూర్తి (స) యొక్క పవిత్ర జీవితం, స్వయంగా ఖుర్‌ఆన్ గ్రంథం ధర్మసంస్థాపనా విధానాన్ని మనకు స్పష్టంగా అందిస్తున్నాయి. చెప్పడానికి పై మూడు అంశాలు వేరు వేరు అయినప్పటికీ అంతిమ పరిశీలనలో ఈ మూడు అంశాలు కూడా జీవిత లక్ష్యం, గమ్యాల విషయంగా ఒకే ఆదర్శాన్ని అందిస్తున్నాయి. పై మూడు అంశాలలో ఖుర్‌ఆన్‌కు అత్యంత ప్రధానమైన సింహభాగపు స్థానం లభిస్తుంది. మిగిలిన రెండు అంశాలు, ఆ మొదటి అంశానికి అనుబంధంగా, తాత్పర్యంగా ఉంటాయి. కనుక ధర్మసంస్థాపనకు సంబంధించిన సూత్రాలు, విధి విధానాలు, పద్ధతులను పై మూడు వనరుల నుండి మాత్రమే స్వీకరించవలసి ఉంటుంది.

## ధర్మసంస్థాపనకు ఖుర్‌ఆన్ సూత్రీకరణలు

దివ్య ఖుర్‌ఆన్‌ను జాగ్రత్తగా అధ్యయనం దృష్టితో పఠించండి. అధ్యయనం చేయండి. దాని యొక్క ఒక్కొక్క అంశం చాలా స్పష్టంగా మన చేతికి అందివస్తాయి. తద్వారా ధర్మసంస్థాపన కోసం చేయవలసిన అవిరళ కృషి ఏ సూత్రాలపై ఆధారపడి ఉన్నదో మనకు విస్పష్టమౌతుంది. దివ్య ఖుర్‌ఆన్ మొత్తంగా, ఈ సూత్రబద్ధ పని విధానంతో నిండి ఉండటాన్ని మనం గమనిస్తాం. లక్ష్యానికి, గమ్యానికి అవసరమైన,

అనుగుణమైన విధానాన్ని మనం సహజంగా పొందుతాం. ఎందుకంటే దివ్య ఖుర్‌ఆన్ యొక్క కేంద్రబిందువు, వాస్తవ గమ్యం కేవలం ధర్మసంస్థాపన మాత్రమే అయివుంది. ఈ కారణంగా సహజంగా ఈ దివ్యగ్రంథం దాని తాలూకూ అన్ని అంశాలను స్పష్టంగా మనకు అందిస్తుంది. తనను పఠించే, అధ్యయనం చేసే విద్యార్థి మెదడులో ఈ గుర్తులను బలంగా ముద్రవేస్తుంది. ధర్మసంస్థాపన దివ్యఖుర్‌ఆన్ యొక్క అత్యంత ప్రధానమైన అంశం కనుక ఈ విషయానికి సంబంధించిన విషయాలు, వివరణలు గ్రంథం నిండా విశాలంగా, విస్తృతంగా విస్తరించబడి ఉన్నాయి. ధర్మసంస్థాపనకు అవసరమైన విధి విధానాల నుండి, సూత్రబద్ధ పని విధానానికి సంబంధించిన వందలాది వాక్యాలు, విభిన్న సందర్భాలలో, అవసరమున్న ప్రతి స్థానంలోనూ మనకు దర్శనమిస్తాయి ... మార్గదర్శకాన్ని అందిస్తాయి. మరికొన్ని సందర్భాలలో, అన్ని విషయాలను అత్యంత క్లుప్తంగా ఒకే చోట జమచేసి మనకు అద్దంలో చూపించినట్లు కనిపిస్తాయి. అటువంటి క్లుప్తపర్చబడిన, సంక్షిప్తీకరించబడిన, విస్తృతార్థ వాక్యాలు ఈ క్రింద ఇవ్వబడ్డాయి. గమనించండి.

**"ఓ విశ్వాసులారా! అల్లాహ్‌కు ఏ విధంగా భయపడాలో, ఆ విధంగా భయపడండి. ముస్లింలుగా తప్ప మీరు మరణించకండి." (3:102)**

"అల్లాహ్ త్రాడును గట్టిగా పట్టుకోండి! విభేదాలలో పడకండి. అల్లాహ్ మీకు చేసిన మేలును జ్ఞాపకం తెచ్చుకోండి. మీరు ఒకరికొకరు శత్రువులుగా ఉండేవారు. ఆయన మీ హృదయాలను కలిపాడు ... మీలో మంచి వైపునకు పిలిచేవారూ, మేలు చెయ్యండి అని ఆజ్ఞాపించేవారూ, చెడు నుండి వారించేవారూ కొందరు తప్పకుండా ఉండాలి. ఈ పని చేసేవారే సాఫల్యం పొందుతారు. స్పష్టమైన ఉపదేశాలు పొందిన తరువాత కూడా ఎవరయితే విభేదాలకు గురిఅయ్యారో వారి మాదిరిగా మీరూ కావద్దు." (3 : 103 - 105)

పైన పేర్కొన్న వాక్యాలు మదీనా నగరంలో హిజ్రీ శకం 3వ సంవత్సరంలో అవతరించాయి. ముస్లిం సమాజం సామూహిక, రాజకీయ వ్యవస్థలను స్థాపించుకొనే నిర్మించుకునే కాలం అది. సరిగ్గా ఈ కాలంలో అల్లాహ్ వైపు నుండి ధర్మసంస్థాపనకు సంబంధించిన విస్తృతార్థం కలిగిన క్లుప్త వాక్యంగా ఈ వాక్యాలు అవతరించాయి. ఈ వాక్యాలలో ధర్మసంస్థాపనకు అవసరమైన ఆచరణాత్మక పద్ధతిని వివరించడంతో

పాటు, ఈ పని విధానానికి సంబంధించిన సూత్రబద్ధ భౌతిక సంబంధాలను కూడా తెలియపర్చడం జరిగింది. జీవిత లక్ష్యసాధనలో ఉద్యమం ఏ ఏ మార్గాల గుండా పయనించవలసి ఉందో - ఆయా అంశాలన్నింటిని స్పష్టపరచడం జరిగింది. ఈ ప్రభువు కార్యం (రబ్బానీ ప్రోగ్రాం) లో జాగ్రత్తగా గమనిస్తే మూడు ప్రాథమిక విభాగాలపై ఈ ప్రోగ్రాం ఆధారపడి ఉన్నట్లు తెలుస్తుంది. మొదటిది : 'తఖ్వా' రెండవది : సంఘటితమైన జమాత్ (నిర్మాణం). మూడవది : మంచిని స్థాపించడం - చెడును నిర్మూలించడం. ధర్మసంస్థాపనకు ఈ మూడు ప్రధాన అంశాలే సూత్రాలుగా మనకు దర్శనమిస్తున్నాయి. ఈ మూడు సూత్రాలను సవివరంగా తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

## 1. తఖ్వా (నిష్ఠ)మయ జీవనం

ధర్మసంస్థాపనకోసం అన్నిటికంటే మొట్టమొదటి షరతు "వత్తఖుల్లాహ హఖ్ఖ తుఖాతిహి వలా తమూతున్న ఇల్లా వ అన్‌తుమ్ ముస్లిమూన్" (అల్లాహ్‌కు ఏ విధంగా భయపడాలో ఆ విధంగా భయపడండి. ముస్లింగా తప్ప మరణించకండి) అనే అల్లాహ్ ఆదేశంలో ఇమిడి ఉంది. ఎవరైతే తన్ను తాను 'విశ్వాసి' గా భావిస్తాడో - ఆ విశ్వాసపు హక్కును నెరవేర్చాలని అనుకుంటూ ఉన్నాడో - అతనికి అల్లాహ్ పట్ల తఖ్వా (నిష్ఠ) కలిగి ఉండవలసి ఉంటుంది. తన చివరి శ్వాసవరకు ప్రతిక్షణం 'ముస్లిం'లాగా జీవించవలసి ఉంటుంది. తఖ్వా గురించి దివ్య ఖుర్‌ఆన్ ఇచ్చిన వివరణ ప్రకారం, వ్యక్తి అల్లాహ్ యొక్క ఆదేశాలను సంపూర్ణంగా, ప్రతి ఆదేశాన్ని ఖచ్చితంగా పాటించవలసి ఉంటుంది. అల్లాహ్ ఆదేశాలలో ఏ ఒక్కదానిని కూడా నిర్లక్ష్య పర్చడంపై భీతి కలగాలి. ఆయన నిషేధించిన దానిని ఆచరించడం గురించి భయపడాలి. గమనించగా ముస్లిం అనబడే వ్యక్తి యొక్క వ్యక్తిత్వాన్ని దివ్య ఖుర్‌ఆన్ వెలుగులో గమనిస్తే అతను మనస్ఫూర్తిగా దైవవిధేయతను స్వీకరించి, తదనుగుణంగా జీవితాన్ని గడిపేవాడుగా కనుగొంటాం. ఒక్కమాటలో దైవ ఆదేశాలను (తలవంచి) శిరసావహించేవాణ్ణి ముస్లిం అని అంటారని తెలుసుకుంటాం.

పై వివరణ ద్వారా ధర్మసంస్థాపన యొక్క అవిరళ కృషిలో మొట్టమొదటి ఆచరణగా, ధర్మాన్ని మొట్టమొదట తనపై స్థాపించుకోవలసి ఉంటుంది. భయం,

భక్తి, ప్రేమ, మన్నింపులు, మొక్కుబడులు అన్నీ కేవలం సృష్టికర్త అల్లాహ్‌కు మాత్రమే ప్రత్యేకించుకోవాలి. విధేయతలు, స్తోత్రాలు, త్యాగాలు, ఉద్వేగాలు, అన్నీ కేవలం అల్లాహ్ ప్రీతికోసం మాత్రమే నిర్వహించాలి. అన్ని విధేయతలను ధిక్కరించి కేవలం తన నిజ ప్రభువు అయిన అల్లాహ్ విధేయతను స్వీకరించవలసి ఉంటుంది. తన కోరికలను, సంకల్పాలను, పరిశుద్ధపరచుకొని కేవలం అల్లాహ్ కొరకు అల్లాహ్ అభీష్టి నెరవేర్పుల కొరకు సిద్ధపర్చుకోవాలి. తన్నుతాను అల్లాహ్ నిత్య సేవకునిగా, దాసునిగా భావించాలి. అల్లాహ్ ఆదేశ పాలనలో అలస్యం, నిర్లక్ష్యం, అలసత్వం, కొరతలను అనుమతించరాదు. అల్లాహ్ ఆదేశ పాలనకోసం పూర్తిస్థాయిలో సంపూర్ణంగా సిద్ధపడి ఉండాలి. ఎన్ని అడ్డంకులు, వ్యతిరేకతలు ఎదురైనా, కష్టనష్టాలు బాధలు ఎదుర్కొన్నా, పరిస్థితులు అనుకూలించకున్నా, హృదయాన్ని కదిలించివేసే దయనీయ పరిస్థితులు ఎదురైనా, చలించని మనస్సుతో, మొక్కవోని దీక్షతో పరిస్థితులను ఎదుర్కోవాలి. సత్యమార్గంలో ఈ అవరోధాలు సాధారణంగా ఎదురుపడతాయని గ్రహించాలి. అంతేకాక అల్లాహ్ నిష్ఠ ప్రదర్శనలో ఈ బాధలు, కష్టాలు, అన్నీ తప్పనిసరి పరీక్షలుగా ఉంటాయి సుమా! ఈ పరీక్షల గుండా పయనించకుండా, ఒక విశ్వాసి తన విశ్వాసానికి మెరుపులను సాధింపజేసుకోలేడు. దైవ ఆమోదాన్ని పొందే అర్హతనూ పొందలేడు. ఈ నేపథ్యంలో దైవగ్రంథం ఇలా ఉంది :

**"భయప్రమాదాలకు, ఆకలిబాధకు, ధన, ప్రాణ, ఆదాయాల నష్టానికి గురిచేసి మేము మిమ్మల్ని (విశ్వాసులను) తప్పకుండా పరీక్షిస్తాము." (2:155)**

ఇంకా, "కేవలం 'మేము విశ్వసించాము' అని అన్నంతమాత్రాన్నే వారిని వదలివేయడం జరుగుతుందని, వారిని పరీక్షించడం జరగదనీ ప్రజలు (విశ్వాసులు) భావిస్తున్నారా? వాస్తవానికి మేము వారికి పూర్వం గతించిన వారందరినీ పరీక్షించాము. అల్లాహ్‌కు సత్యవాదులెవరో, అసత్యవాదులెవరో తప్పనిసరిగా చూడవలసి ఉంది." (29: 2-3)

కనుక ఈ కష్టాలకు, బాధలకు భయపడకూడదు. నిరాశా నిస్పృహలకు లోనుకాకూడదు. తత్భిన్నంగా పూర్తి ప్రశాంత చిత్తులై అల్లాహ్‌పై పూర్తి నమ్మకంతో, సహనంతో సమస్యలతో పోరాడాలి. అప్పుడే ఒక విశ్వాసి యొక్క హృదయం విశ్వాసపు

జ్యోతితో ప్రజ్వలిస్తూ ఉంటుంది. తన జాతి, తెగ, ధన, ప్రాణ, హోదాలకు ప్రథమ ప్రాధాన్యతనిచ్చి, ఖుర్ఆన్ ఆదేశాలకు, అల్లాహ్ దాస్యానికి రెండవ స్థానం ఇచ్చేవారు పెద్ద నష్టానికి గురౌతున్నామనీ – అంతులేని మోసానికి లోనౌతున్నామనీ గుర్తించాలి. ఇటువంటి వ్యక్తులు బయటికి ఎంతటి ధార్మికులుగా కనిపించినా, పెద్ద నిష్ఠాగరిష్ఠులుగా పరిగణించబడినా, వారి అంతరాత్మ పవిత్రతకూ, పరిశుద్ధతకూ కడు దూరంగా ఉండిపోతుంది. తన దాసులను పరీక్షించడం అల్లాహ్ సంప్రదాయమనే సత్యాన్ని తెలుసుకోవాలి. ఈ సంప్రదాయ పరిపూర్తి కోసమే ఆయన ఇస్లామీయ ధర్మసంస్థాపనా మార్గంలో కష్టాలు, బాధల బండరాళ్ళను అడ్డంగా ఉంచాడు. ఈ కారణంగా ఏ వ్యక్తి అయితే "ఇత్తఖుల్లాహ్ – హఖ్ఖతుఖాతిహీ" యొక్క హక్కును నెరవేర్చాలనుకుంటాడో – ఆ వ్యక్తి ఈ బండరాళ్ళను ఎదుర్కొనక తప్పదు. ఈ ఎదుర్కోవడంలో ఎదురు దెబ్బలు తినడానికి సిద్ధపడకా తప్పదు.

## 2. దృఢమైన జమాఅత్ వ్యవస్థ

ధర్మసంస్థాపనా విధిలోని రెండవ అంశం **"వాతసిమూ బిహబ్లిల్లాహి జమీఅవ్ వలా తఫర్రఖూ"** అనే పదాలలో స్పష్టంగా వివరించబడింది. ఈ పదాలలో స్పష్టంగా ఇవ్వబడిన ఆదేశాలు రెండు విషయాలపై ఆధారపడివున్నాయి. మొదటిది : ఎవరైతే దైవాదేశాలపై, దైవం విధించిన హద్దులపై ఖచ్చితంగా ఆచరిస్తూవున్నారో వారు, ఎవరు తమ వ్యక్తిగత, సామూహిక, మానసిక ప్రక్షాళనం కొనసాగిస్తూవున్నారో వారు – అందరూ కలిసి ఒక దృఢమైన సంస్థాగత నిర్మాణాన్ని (జమాఅత్‌ను) ఏర్పర్చుకోవాలి. ఈ సంస్థాగత జమాఅత్ నిర్మాణం ఒక శరీరంగా ఉండి అందులోని వ్యక్తులు అవిభాజ్యమైన శరీర అవయవాలవలె బంధింపబడి ఉండాలి. ఈ దృఢమైన బంధనానికి, తెగ, జాతి, దేశం, ఆర్థిక, రాజకీయ లేక మరే భౌతిక ప్రయోజనం కారణమై ఉండకూడదు. తద్భిన్నంగా కేవలం 'అల్లాహ్ త్రాడు' అయివుండాలి. అంటే, ప్రతి ముస్లిం అల్లాహ్‌తో చేసిన దాస్యపు వాగ్దానం అయివుండాలి. దివ్య గ్రంథం ఖుర్ఆన్ మాత్రమే అనుసరణకు ఏకైక వనరుగా ఉండాలి. ఏ ధర్మసంస్థాపన కోసం ఉనికిలోకి వచ్చి, దాని స్థాపనే లక్ష్యంగా జీవిస్తూవున్నాడో – ఆ ధర్మం మాత్రమే తనకు జీవిత విధానం అయివుండాలి. విశ్వాసుల జమాఅత్ దృఢంగా, నిర్మాణపరంగా పటిష్ఠంగా ఉండే అవసరం కేవలం 'అల్లాహ్ త్రాడు' ద్వారా మాత్రమే

జరగాలి. సాధారణంగా 'ఒక విశ్వాసి బలమైన దృఢమైన జమాఅత్ నిర్మాణంలో భాగం కాకుండానే అల్లాహ్ వద్ద తన ఆచరణను ఆమోదింపజేసుకోగలడు' అనే అపోహ ముస్లిం సమాజంలో బలంగా ఉంది. అదేవిధంగా – 'కారణం ఏదైనా ముస్లిం సమాజం ఒక జమాఅత్‌గా కలిసి ఉండటం అవసరమే కదా' అనే అపోహ కూడా ఉంది. ఈ రెండు భావజాలాలు, వాటి ఆచరణలు కూడా తప్పుడు ఆచరణా విధానాలే. ఒక విశ్వాసి దృఢమైన సంస్థాగత నిర్మాణంలో (జమాఅత్) భాగం కావడం ఎంత అవసరమో – ఆ నిర్మాణానికి అల్లాహ్ త్రాడు పునాదిగా ఉండటం కూడా అంతే అవసరం. బందిపోటు దొంగలు కూడా తమ లక్ష్యసాధన కోసం బలమైన నిర్మాణాన్ని కలిగి ఉండటాన్ని మనం చూస్తున్నాం. కనుక, ధర్మసంస్థాపనా లక్ష్యంగా లేని ప్రతి నిర్మాణం, దైవధిక్కార నిర్మాణంగానే పరిగణించబడుతుంది. ఇస్లాం – కేవలం ధర్మసంస్థాపన కోసం, సత్యధర్మ అనుసరణ కోసం, ఏర్పడే ఐక్యతను, సామూహికతను (జమాఅత్‌ను) నిర్మాణాన్ని, సంఘాన్ని మాత్రమే అంగీకరిస్తుంది ... ఆమోదిస్తుంది.

ధర్మసంస్థాపనలోని ఈ బిందువు – అంటే సుసంఘటితమైన జమాఅత్ అనే అంశం మొదటి అంశమైన 'తఖ్వా'కు ఏమాత్రం భిన్నమైనది కాదు. ఈ రెండు అంశాలు సహజంగా ఒకే నాణేనికి రెండు వైపుల వంటివి. జ్ఞాన సముపార్జనలో నిమగ్నమైవున్న ఒక విద్యార్థి సహజంగానే తన సహవిద్యార్థి పట్ల ప్రేమ, సహకారం, స్నేహం దృఢమైన సంబంధం కలిగి ఉండాలని కోరుకుంటాడు. ఒక మేధావి, మరో మేధావి, ఆలోచనాపరుడు తాత్వికునితో, అభిప్రాయాలలో, అవగాహనలో సయోధ్య కలిగి ఉండటానికి ప్రాధాన్యత నిస్తాడు. ఒక చైతన్యవంతుడు మరో చైతన్యవంతున్ని స్నేహితునిగా పొందటానికి ఇష్టపడతాడు. అలా ఇష్ట పడకపోతే నిజానికి వారు మేధావి, చైతన్యపరుడు లేక జ్ఞాన సముపార్జనాభిలాషి అని అనిపించుకోలేరు. ఏకాభిప్రాయాలు, సహజ విశ్వాసాలు కలిగివున్నవారు, అటువంటి వారినే తమ సహచర్యానికి ఎలా కోరుకుంటారో – అలాగే అల్లాహ్ పట్ల, తఖ్వా నిష్ఠగలవారు అదే కోవకు చెందిన, తఖ్వానిష్ఠాపరులనే సహచరులుగా కోరుకుంటారు. ఇది అత్యంత సహజమైన విషయం. సత్యాన్ని అంగీకరించేవారు, నిష్ఠాతత్వాలు కలిగివున్నవారు, సద్వచనాన్ని అనుసరించేవారు ఒకరి పట్ల మరొకరు తప్పనిసరిగా ఆకర్షింపబడుతూ

ఉంటారు. అలా కాక ఒకర్ని మరొకరు ద్వేషించుకుంటూ, ఒకరికొకరు దూరంగా జరుగుతూ ఉంటే, వారిలోని తఖ్వా, నిష్ఠ, విశ్వాసాలలో ఏదో లోపం కొరత ఉన్నట్టుగా భావించాలి. ఎందుకంటే, ఒకే లక్ష్యంతో, ఒకే బాటలో నడిచే ఇరువురు బాటసారులు, ఒకరికొకరు అపరిచయస్తులుగానో, లేక పోటీదారులుగానో ఉండటం సాధ్యం కాదు. ఈ కారణంగానే దైవగ్రంథంలో ముస్లింలను **'ఇన్నమల్ ము'మినూన ఇఖ్వతున్'** (విశ్వాసులు ఒండొకరికి సోదరులు) అనీ, **'బఅజుహుమ్ ఔలియాఉ బఅజ్'** (వారందరూ ఒకరికొకరు సహచరులు, చేదోడువాదోడుగా ఉండేవారు) అని పరిచయం చేయడం జరిగింది. మరోచోట 'రుహ్మాఉ బైనహుమ్' (పరస్పరం జాలి స్వభావం కలవారు) అనీ, **'అజిల్లతిన్ అలల్ ము'మినీన్'** (విశ్వాసుల పట్ల మృదు స్వభావులు) అనీ రుజువులు చూపించడం జరిగింది.

మొత్తానికి ఇస్లాం అనుయాయులు పరస్పరం కలసిమెలసి ఉండటం, వారి విశ్వాసానికి, నిష్ఠలకు గీటురాయిగా భావించబడుతుంది. ఖుర్ఆన్ దృష్టిలో విశ్వాసుల ఈ లక్షణానికి అత్యంత ప్రాధాన్యత ఉంది. ఈ విషయాన్నే మరింత లోతుగా అర్థం చేసుకోవడానికి దివ్య ఖుర్ఆన్‌లోని ఇతర బోధనలపై కూడా దృష్టి ఉంచడం అత్యంత అవసరం. వాటిలోని ఒక బోధన

"విశ్వసించిన ప్రజలారా! మీ తండ్రులను, మీ సోదరులను కూడా మీకు సహచరులుగా చేసుకోకండి – ఒకవేళ వారు విశ్వాసం కంటే, అవిశ్వాసానికి ప్రాధాన్యం ఇస్తే. మీలో వారిని సహచరులుగా చేసుకునేవారే దుర్మార్గులు" (9:23) అని ఉంది.

అంటే, ఒక విశ్వాసి మరో విశ్వాసితో ఎలా వేరుపడి ఉండలేడో – అదేవిధంగా ఒక అవిశ్వాసితో, ద్రోహితో, కపటునితో మానసిక సంబంధం కూడా కలిగి ఉండలేడు. వారు అవిశ్వాసికి ఎంతటి దగ్గరి రక్త సంబంధీకులు అయినా సరే అది సాధ్యపడదు. ఈ విషయాన్ని దైవగ్రంథం ఎంతమాత్రమూ అంగీకరించదు. ఈ విషయమై దైవబోధన ఇలా ఉంది :

**"అల్లాహ్‌నూ, పరలోకాన్ని విశ్వసించేవారు, అల్లాహ్‌నూ ఆయన ప్రవక్తనూ వ్యతిరేకించేవారిని ప్రేమించటాన్ని నీవు ఎన్నడూ చూడలేవు. ఆ వ్యతిరేకించేవారు, వారి తల్లిదండ్రులైనా, వారి కుమారులైనా, వారి సోదరులైనా సరే లేదా వారి కుటుంబీకులైనా సరే." (58 : 22)**

ఈ మార్గదర్శక సూత్రాల ద్వారా విశ్వాసపు బంధుత్వానికి మానవ సంబంధాలలో నిర్ణయాత్మక పాత్రవుందని అర్థమౌతుంది. ఈ విశ్వాసపు బంధుత్వం ఒక వైపున విభిన్న తెగల, జాతుల వ్యక్తులను దగ్గరచేర్చి, సోదర సంబంధాన్ని ఏర్పర్చి, ఏకం చేసివేస్తుంది. మరోవైపున ఈ విశ్వాస బంధపు అత్యంత బలమైన శక్తి, విశ్వాసరహితమైన భౌతిక బంధుత్వాలను, రక్త సంబంధాలను జీవరహితమైనవిగా, ప్రభావరహితమైనవిగా చేసివేస్తుంది. విశ్వాస బంధం ఒక సూర్యునివలె ప్రజ్వలిస్తూ ఇతర బంధాల నక్షత్రాల వెలుగును ప్రభావరహితంగా చేసివేస్తుంది. ఇందుకోసం విశ్వాసపు బలీయమైన శక్తి సహాయకారిగా పనిచేస్తుంది. విశ్వాసుల బృందంలో ఏర్పడిన ఐక్యతకు మరింత శక్తిని, ప్రభావశీలతను దృఢత్వాన్ని అందిస్తుంది.

ఒక జీవిత లక్ష్యం – దాని నాయకత్వం – దాని సూత్రబద్ధ అనుచరులను ఒక సంఘంగా, క్రమశిక్షణగల కార్యకర్తలుగా, ఒక నిర్మాణంలో బంధించివేస్తుంది. అంతకంటే ఎన్నోరెట్లు అధికంగా 'అల్లాహ్ ధర్మం' దాని స్థాపకులను, దాని సభ్యులను జమాఅత్‌గా దృఢంగా, శక్తిమంతమైన నిర్మాణంగా బంధించమని మార్గదర్శనం అందిస్తుంది. భేదాలను, విభేదాలను ప్రాణాంతక నష్టదాయక విషయాలుగా తేల్చివేస్తుంది. ఈ విభేదాలు ధర్మసంస్థాపనా 'మానసికతకు' అత్యంత వ్యతిరేకమైనదిగా ప్రకటిస్తుంది. ఈ సందర్భంగా బనీ ఇస్రాయీల్ (యూదుల) గురించి ప్రవక్త మూసా (అ) ప్రవక్త హారూన్ (అ)ల ఉదంతాన్ని ఉదాహరణగా చెప్పుకుందాం. ప్రవక్త మూసా దైవధర్మ ఆదేశాలను తేవడానికి 'సీనా' పర్వతంపైకి వెళుతూ తన సోదరులు హారూన్ (అ)ను బనీ ఇస్రాయీల్ ప్రజలకు నాయకునిగా నియమించి వెళతారు. సామిరీ, షైతాన్ చేష్టల వల్ల, బనీ ఇస్రాయీల్ ప్రజలలోని మెజారిటీ ఒక్కసారిగా, మూకుమ్మడిగా విగ్రహారాధనలో మునిగిపోతారు. ఈ సమయంలో హారూన్ (అ) కేవలం వారిని మాటల ద్వారా బోధనల ద్వారా మార్చే ప్రయత్నం చేశారు. వారికి వ్యతిరేకంగా, గట్టి నిర్ణయం తీసుకొని దాని అమలుకు పూనుకోలేదు. ఎందుకంటే, బనీ ఇస్రాయీల్‌లో ఈ విషయమై భిన్నాభిప్రాయాలు, వ్యతిరేకతలు, వైషమ్యాలు తలెత్తి వారి మధ్యనున్న 'ఐక్యత' దెబ్బతింటుందని ఆయన భయపడ్డారు. ప్రవక్త మూసా (అ) (దైవాదేశాలతో) సీనా పర్వతం దిగి తన జాతి యొక్క హీనస్థితిని గమనించి హారూన్ (అ)ను గద్దించినపుడు, ప్రవక్త హారూన్ (అ) ప్రజల మధ్య

'ఐక్యత' గురించి "నేను ఇస్రాయీల్ సంతతి మధ్య చీలిక తెచ్చానని మీరు నాపై కోపపడతారేమోనని నేను భయపడ్డాను" అని చెప్పారు.

# 3. మంచిని ఆదేశించటం - చెడును నిర్మూలించటం

ధర్మసంస్థాపనా ప్రోగ్రాంలో మూడవ పునాది "వల్‌తకుమ్ మిన్‌కుమ్ ఉమ్మతయ్ యద్‌ఊన ఇలల్ ఖైరి వయ'మురూన బిల్ మారూఫి వ యన్‌హౌన అనిల్ మునకర్" (3:104) అనే ఆదేశంలో స్పష్టం చేయడం జరిగింది. దీని వివరణ, అవగాహనలు ఈ క్రింది విధంగా ఉన్నాయి. వ్యక్తిగతంగా ప్రతి వ్యక్తి, తనపై తానుగా ఈ సత్యధర్మాన్ని స్థాపించుకోవాలి. ఆ తరువాత ఇటువంటి వ్యక్తులందరూ కలిసి ఒక ఇస్లామీయ జమాఅత్ (సంఘం)గా ఏర్పడిపోవాలి. అంత జరిగితే సరిపోదు. పై రెండు విధులు పూర్తి అయిన తరువాత, ఏ విషయాన్ని తాము విశ్వసించారో ఆ విషయాల వైపునకు అనగా ఈ సంక్షేమకర 'మంచి' వైపునకు ఇతరులను కూడా ఆహ్వానించాలి (ఆహ్వానిస్తూ ఉండాలి). అదే సమయంలో 'చెడు' ను సంపూర్ణంగా నిర్మూలించడానికి నిరంతరం సంఘటితంగా శ్రమించాలి. చివరకు అల్లాహ్ యొక్క ఈ భూమిపైని ఏ భాగంలో కూడా కేవలం అల్లాహ్ ఆమోదించిన జీవిత విధానం - సంక్షేమం - క్షేమం - మంచి - మాత్రమే ఉండాలి. దీనికి భిన్నమైన లేక వ్యతిరేకమైన జీవన విధానం అనగా 'చెడు' ఇక ఎంతమాత్రమూ మిగిలి ఉండటానికి వీలే ఉండకూడదు.

ఏ విధంగా ధర్మసంస్థాపనా కృషి - దాని ఆచరణలలో మొదటి పునాది అడుగు అయిన అల్లాహ్ 'తఖ్వా'లో, రెండవ పునాది అడుగు అయిన 'దృఢమైన సామాజిక నిర్మాణం' (జమాఅత్) ఎలా అనివార్యమైన, సహజమైన భాగమో - అదేవిధంగా దాని మూడవ పునాది అడుగు అయిన 'మంచి స్థాపన - చెడు నిర్మూలన' (అమ్ర్ బిన్ మారూఫ్ - వ నహీఅనిల్ మున్కర్) కూడా అందులో అనివార్యమైన, సహజమైన భాగంగా ఉంటుంది. అల్లాహ్‌పై విశ్వాసం (ఈమాన్), అల్లాహ్ పట్ల నిష్ఠ (తఖ్వా)ల వాస్తవిక ఆత్మ ఏది? కేవలం అల్లాహ్ పట్ల మానసికంగా ప్రేమ కలిగి ఉన్నంత మాత్రాన సరిపోతుందా? కాదు. తన ప్రియతముడైన అల్లాహ్ కోరిక నెరవేరేలా ఆచరించడమే నిజమైన ప్రేమ అనిపించుకుంటుంది. అలాకాని

పక్షంలో ఆ ప్రేమలో కొరత ఉన్నట్లుగా తెలుసుకోవాలి. తన ప్రియ దైవం యొక్క అభీష్టం ఈ భూమిపై ధిక్కరించబడుతూ ఉంటే, దానిని చూచి ఆ గుండె విలవిలలాడకుండా ఎలా ఉండగలుగుతుంది?

కనుక అల్లాహ్ పట్ల ప్రేమ నిండిన ఒక హృదయం, సత్యధర్మంపై నిష్ఠ కలిగిన ఆత్మ ప్రశాంతంగా ఉండటం సాధ్యమే కాదు. ఈ భూమి హృదయంలో గుచ్చుకుంటూవున్న అసత్యం - బాధపెడుతూ ఉన్న చెడు తన దృష్టికి కనపడుతూ ఉన్నంత వరకు ఒక దైవప్రేమికుడు ప్రశాంతమైన శ్వాసను పీల్చడం సాధ్యమే కాదు. ఒక దైవ ప్రేమికునిలోని ఇస్లామ్ (విధేయత), అతని ఈమాన్ (విశ్వాసం) - అతనికి నిర్లక్ష్యం, ప్రశాంతతలకు అవకాశం, అనుమతి ఇవ్వనే ఇవ్వదు. అల్లాహ్ ధర్మం, అల్లాహ్ భూమిపై స్థాపింపచేయడానికి విశ్వాసి అయిన వ్యక్తి లేక విశ్వాసుల జమాఅత్ నిరంతరంగా పరిశ్రమిస్తూనే ఉంటుంది. ఈ భూమిపై తాగూత్ (దైవవ్యతిరేక వ్యవస్థ), కుఫ్ర్ (దైవతిరస్కార వ్యవస్థ)ల విలయతాండవాన్ని చూచి ప్రశాంతంగా నెమ్మదిగా, ఓపికగా దానిని భరించటం విశ్వాసులకు ఎన్నడూ సాధ్యం కాదు. మంచిని స్థాపించనంత వరకు, చెడును నిర్మూలించనంత వరకు "ఇత్తఖుల్లాహ హఖ్ఖ తుఖాతిహి వలాతమూతున్న ఇల్లా వ అన్తుమ్ ముస్లిమూన్" అనే ఆదేశపు వాక్కు నెరవేరబడదు. ధర్మసంస్థాపనా కృషిని కేవలం తన వరకే పరిమితం చేసుకోక, దానిని సమాజంలో స్థాపించటానికి కృషి తప్పనిసరిగా చేయాలి. మిగతా ప్రపంచం ఎలా పోతే నాకేమిటి? అనే ధోరణి ఎంతమాత్రమూ ఆమోదించబడదు.

విశ్వాసి యొక్క 'మంచిని ఆజ్ఞాపించడం' అనే సహజ లక్షణం ఏమిటంటే, అతను అల్లాహ్ దాసుల పట్ల బాధ్యత, ప్రేమ కలిగి ఉండాలి. ఇస్లాంను అర్థం చేసుకున్న ప్రతి వ్యక్తీ అల్లాహ్ సృష్టితాల పట్ల ప్రేమ కలిగి ఉండనంతవరకు, ఆ వ్యక్తికి అల్లాహ్ పట్ల భక్తి కలిగి ఉండటం సాధ్యం కాదని తెలుసుకుంటాడు. ఈ కారణంగానే ప్రియ ప్రవక్త (స) సృష్టిని అల్లాహ్ యొక్క 'అయాల్' (కుటుంబం)గా - అభివర్ణించారు. (అల్ ఖల్ఖు అయాలుల్లాహ్) తోటి మనిషి క్షేమాన్ని కోరడం విశ్వాసపు గుర్తుగా ప్రియప్రవక్త నుడివారు. "మీరు మీ కొరకు ఏమి కోరుకుంటారో - మీ సోదరుని కొరకు కూడా అదే కోరుకోనంత వరకు మీరు పరిపూర్ణ విశ్వాసులు కాలేరు" (ముస్లిం గ్రంథం). మానవ సమాజాన్ని ప్రేమించటంలో అత్యంత

ప్రధానమైనది ఏమంటే, అతనిని చెడుమార్గం నుండి తప్పించడం – మార్గభ్రష్టత్వం నుండి కాపాడి అతను శాశ్వతంగా ఇహపరలోకాలలో నష్టపోకుండా చూడటం. ఫలితంగా ప్రాపంచిక జీవితాన్ని నరకప్రాయం కాకుండా రక్షించడం. కనుక ఒక విశ్వాసి తన తోటి వ్యక్తిని చెడు నుండి కాపాడటానికి ప్రయత్నిస్తూ ఉండటం మంచి వైపునకు ఆహ్వానిస్తూ ఉండటం భౌతిక ప్రయోజనాన్ని ఆశించి చేయడు. తద్భిన్నంగా తనలోని విశ్వాసపు సహజ లక్షణానికి గుర్తుగా చేస్తాడు. ఇదేవిధంగా ఒక విశ్వాసి యొక్క విశ్వాసం, ఆకలిగొన్న వానికి అన్నం తినిపించమని ప్రేరేపిస్తుంది. నగ్న శరీరానికి బట్టలు అందించమని ప్రోత్సహిస్తుంది. బలహీనులను, నిరుపేదలను ఆదుకోమని ఉద్బోధిస్తుంది. ఈ విశ్వాసపు సహజ లక్షణమే, తన తోటి సోదరునికి అల్లాహ్ కారుణ్యపు ఖజానా తాళపు చెవిని అందించే కృషిని మరింత తీవ్రతరం చేస్తుంది. ఈ తాళపు చెవి అందిన తరువాత ఇక అతను ఎప్పుడూ ఆకలితో ఉండడు. తన భవిష్యత్ గురించి ఎంతమాత్రమూ బెంగపెట్టుకోడు. భూత, వర్తమాన కాలాలు అతనిని ఎంతమాత్రమూ భయపెట్టజాలవు. (లాఖౌఫున్ అలైహిమ్ వలాహుమ్ యహ్జనూన్) ఒక విశ్వాసి విశ్వాసం, తన తోటి సోదరునికి పైన పేర్కొన్న అంశాలన్నీ అందించాలని ఉద్బోధిస్తుంది. ఈ అంశాలు అందించకుండా తన తోటి సోదరుని పట్ల ప్రేమ ప్రకటన వట్టి బూటకమని స్పష్టంగా చెప్పివేస్తుంది. ఈ బాధ్యతాయుతమైన హక్కు నెరవేర్చబడనంతవరకు, తన తోటి సోదరుని పట్ల గల హక్కు అసంపూర్తిగా ఉంటుందని తేటతెల్లం చేస్తుంది.

ఇస్లాం, విశ్వాసం, నిష్ఠలతో – మంచిని ఆజ్ఞాపించడం యొక్క సంబంధం భౌతికంగా పైన సూచించినట్లు ఉంటుంది. కాని, దాని యొక్క మరో పారమార్థిక బంధం కూడా ఉంది. దానిని 'ఇస్లామీయ సందేశపు రాజకీయ లబ్ధి' అని చెప్పవచ్చు. మంచిని చేయమని ఆజ్ఞాపించడం – చెడును నిర్మూలించటం అనేది రాజకీయపరమైన అంశంగా కూడా ఉంటుంది. ఇస్లామీయ సందేశ ధ్వజవాహకుడు 'మంచిని ఆజ్ఞాపించడం' అనే విధిని నెరవేర్చడం ద్వారానే తన విశ్వాసపు వజ్రాన్ని సానపెట్టుకొని ధగధగా మెరిపించుకోగలడు. అదేవిధంగా తన జీవితలక్ష్యాన్ని విజయవంతంగా అందుకోనూ గలడు. ఈ లక్ష్యసాధనకు గల అనేక అంశాలలో కొన్ని ఈ క్రింద సూచించబడ్డాయి.

1. ధర్మసంస్థాపనా కృషి తప్పనిసరిగా సత్యం-అసత్యాల మధ్య సుదీర్ఘమైన కఠినమైన యుద్ధంగా ఉంటుంది. ఈ యుద్ధంలో సహజంగా ఎవరైతే ఆచరణాత్మక దృఢత్వం చూపిస్తారో, వారే గెలుస్తారు. గెలుపు, విజయాలు మనం ప్రదర్శించే ఆచరణపై ఆధారపడి ఉంటాయి. ఎంతటి శక్తిమంతమైన సైన్యం కూడా యుద్ధ సమయంలో అదను చూసి, శత్రు సైన్యంపై విరుచుకుపడకపోతే, అపజయాన్ని మూటకట్టుకోక తప్పదు. అదేవిధంగా ఏ ఉద్యమమైనా బలహీనతలకు, జడత్వానికి, స్తబ్ధతకు గురికాక తప్పని పరిస్థితులు ఎదురు అవుతాయి. అంతేకాక, ఏ ఉద్యమమైనా కేవలం తన అంతర్గత శక్తులను దృఢతరం చేసుకునే తన అంతర్గత నిర్మాణాన్ని పటిష్ఠపరచుకునే పనిలోనే నిమగ్నమయి, తనకు బయట జరుగుతున్న పరిస్థితులను, మార్పులను, పరిణామాలను గమనించకపోతే, సమయానుకూలంగా స్పందించకపోతే ఆ ఉద్యమం కూడా అపజయాన్ని మూటకట్టుకోక తప్పదు. కనుక, అల్లాహ్ ధర్మాన్ని స్థాపించడానికి పూనుకున్న జమాఅత్ కూడా నిరంతరం దైవేతర తాగూత్ పటాలంపై నిరంతరంగా విరుచుకు పడనంతవరకు విజయం దుర్లభమౌతుంది. ఈ దాడుల ఉద్దేశ్యం కేవలం మంచిని ఆజ్ఞాపించేందుకు - చెడును నిర్మూలించేందుకు ప్రత్యేకించబడి ఉండాలి.

2. ఏ విధంగా ఒక జీవమున్న దేహం తన జీవన ప్రక్రియా క్రమంలో శక్తిని కోల్పోతూ ఉండి, ఆ కోల్పోయిన శక్తిని పొందటానికి వేరు వేరు పదార్థాలను ఆహారంగా తీసుకుంటూ ఉంటుందో - అదేవిధంగా ధర్మసంస్థాపనా ఉద్యమ ఆచరణలో జమాఅత్ కూడా తనలోని శక్తిని కోల్పోతూ ఉంటుంది. ఆ కోల్పోయిన శక్తిని తిరిగి పుంజుకునేందుకు అవసరమైన 'ఆహారం' పొందేందుకు తరం తరం నిరంతరం కృషి చేయవలసి ఉంటుంది. తన్ను తాను నిత్యనూతనంగా, శక్తిమంతంగా, ప్రగతి పథంలో పయనించేదిగా ఉద్యమాన్ని ఉంచుకునేందుకు దాని రక్త నాళాలలో నూతన రక్తం నిరంతరంగా ప్రవహిస్తూ ఉండాలి. అలాకాని పక్షంలో ఉద్యమశక్తి క్రమంగా క్షీణిస్తూ చివరికి బలహీనపడిపోతుంది. ఫలితంగా ఉద్యమం లేక జమాఅత్, ధర్మసంస్థాపనా విధిని తనపైవున్న ఒక అనవసరమైన బరువుగా భావిస్తుంది. కనుక ఉద్యమం నిత్యనూతనంగా, శక్తిమంతంగా ఉండేందుకు అవసరమైన 'పోషకాహారం' గా విశ్వాసపు స్థాయిని నిరంతరంగా పెంచుకుంటూ పోయే సాధనంగా 'మంచిని ఆజ్ఞాపించే - చెడును నిరోధించే' ఆచరణ ఉపయోగపడుతుంది.

3. ఈ సృష్టిలోని ప్రతి ఒక్కటీ చలిస్తుంది. జగత్తు మొత్తంగా చలన శీలత కలిగి ఉందని మనకు తెలుసు. ఆగిపోవడం, స్తబ్ధతకు గురికావడం, సృష్టియొక్క సహజత్వానికి విరుద్ధమైన లక్షణాలు. ఎటువంటి పరిస్థితిలో కూడా చలనం ఆగిపోవడం జరగదు. ఏదో ఒక వైపున అది చలిస్తూ ఉంటుంది. ముందుకు చలించే పరిస్థితులు లేనపుడు, అది తప్పనిసరిగా వెనుకకు చలిస్తూ ఉంటుంది. ఈ 'చలన సూత్రమే' ధర్మసంస్థాపనకు కూడా అన్వయించబడుతుంది. నిరంతరం జీవంతో తొణికిసలాడే, ముందుకు అడుగువేసే ఉద్యమంగా, ధర్మసంస్థాపనా కృషి కొనసాగాలి. అలాకాకుండా ఎక్కడైతే ఉద్యమం స్తబ్ధతకు గురి అవుతుందో – చలనం ఆగిపోతుందో అక్కడ తప్పనిసరిగా, సహజంగా అది వెనుకకు జరగడం మొదలుపెడుతుంది. ఈ వెనకడుగు పడకుండా ఉద్యమాన్ని కాపాడే ఆచరణాత్మక కృషి 'మంచిని ఆజ్ఞాపించడం – చెడును నిరోధించడం' మాత్రమే. ఒక వ్యక్తి యొక్క విశ్వాసం, ఇస్లాం, నిష్ఠలు సహజంగా మంచిని ఆజ్ఞాపించడం .... అనే ఆచరణను తప్పనిసరిగా అభిలషిస్తాయి.

## ప్రవక్తశ్రీ (స) ఆచరణా విధానం

ధర్మసంస్థాపన యొక్క ఈ పని విధానం, పద్ధతులు, సూత్రాలు మనకు దివ్య ఖుర్‌ఆన్ నుండి లభ్యమౌతున్నాయి. ఖుర్‌ఆన్ యొక్క ప్రత్యక్ష ఆచరణా స్వరూపులు అయిన ప్రవక్త ముహమ్మద్ (స) వారి జీవితాన్ని గమనిస్తే – ఖుర్‌ఆన్ ఏ పదబంధాల రూపంలో ధర్మసంస్థాపనా విధానాన్ని అందించిందో – దానికి ఆచరణా రూపంగా మనకు ప్రవక్తశ్రీ (స) వారి పవిత్ర జీవితం దర్శనమిస్తుంది. పదాలకు దుస్తులు తొడిగిన ఈ ఆచరణా విధానపు వరుసలో నిలబడి, సరిగ్గా ఈ గీతపై ఒక సంఘాన్ని (ఉమ్మత్) ఏర్పర్చి, దానిద్వారా అల్లాహ్ ధర్మాన్ని ఈ భూమిపై స్థాపించి చూపించిన మహోపాధ్యాయులు ప్రవక్తశ్రీ (స) గారు.

అరబ్బు ప్రాంతంలోని ప్రతి అణువుపై దైవధిక్కార తాగూత్ వ్యవస్థ స్థాపించబడి ఉండేది. ఈ తాగూత్‌ను తొలగించే మహత్తర కృషిని ప్రవక్తశ్రీ (స) వారు ఒక సద్వచనంతో ప్రారంభించారు. ఈ సద్వచనం (లా ఇలాహ ఇల్లల్లాహ్ – ముహమ్మదుర్రసూలుల్లాహ్) విశ్లేషణ, వాస్తవికతల ప్రకారం మానవుడు, తన మొత్తం ఆలోచనలను, భావాలను, ఆదేశాలను, సంబంధ బాంధవ్యాల మొత్తం జీవితాన్ని,

దాని సమస్యలన్నింటినీ, వాటి పరిష్కారాలన్నింటినీ, అల్లాహ్ ఆదేశాలకు అనుగుణంగా మలచుకోవలసి ఉంటుంది. అంటే ఈ ప్రపంచంలో ఎవరినైనా, ఆదేశించే - ఆదేశాల అమలుకు బలవంతపెట్టే - అధికారం చెలాయించే - దాని ముందు తలవంచమని బలవంతపెట్టే అధికారం మానవునికి లేదు. ఉండకూడదు కూడా. ఈ మహత్తర విప్లవాత్మక పిలుపును నాటి చెవిటివాళ్ళు కూడా విన్నారు. ఆధిపత్యవాదులైన నాటి అరబ్బు జాత్యాహంకారులు ఈ విప్లవాత్మక గొంతును నొక్కివేసే ప్రయత్నం చేశారు. ప్రారంభంలోనే ఈ నిప్పును ఆర్పివేయడానికి నాటి పాలకవర్గాలు చేసిన దారుణాలు, దౌర్జన్యాలు, అకృత్యాలు, హింసలు చరిత్ర చదివిన ప్రతి ఒక్క వ్యక్తికీ తెలుసు. నాటి రాజకీయ వ్యవస్థ కన్నెర్ర చేసింది. ప్రాంతీయ ప్రయోజనాలు అడ్డంగా నిలిచాయి. సమయం, సామాజిక పరిస్థితులు సహాయ నిరాకరణకు పాల్పడ్డాయి. కష్టాల కడలి ఉద్యమ ప్రగతిని నిరోధించే ప్రయత్నం చేసింది. హత్యలు, హింసల తుఫాను విరుచుకుపడింది. అయినా ఈ అల్లాహ్ దాసుడు (స) తన గొంతు స్థాయిని ఏమాత్రం తగ్గించనేలేదు. ప్రతికూల పరిస్థితులన్నింటినీ ఏమాత్రం ఖాతరు చేయలేదు. పరిస్థితుల నుండి తన్ను తాను ప్రత్యేకపర్చుకొని, తనపై అవతరించిన సత్యాన్ని ఇతరులకు అందించేందుకు - అర్థం చేయించేందుకు నిరంతరం కృషి చేశాడు. అంతేకాదు, ఆ సమయంలో తన సిద్ధాంతం ఏక దైవారాధన (తౌహీద్)పై, దాని జీవిత విధానంపై ఒంటరిగా నిలబడి ఉన్నాడు. ఆయన (స) ఒక్క క్షణం కూడా తన సైద్ధాంతికతను, ఆలోచనలను ఇతరుల నుండి దాచిపెట్టే ప్రయత్నం చేయనే లేదు. ఒక్క నిమిషం కూడా గొంతుకు విశ్రాంతిని ఇవ్వనేలేదు. నాటి పరిసర మానవ సమాజం మొత్తం ఆయన నోటిని మూసివేసే, ఆయన గొంతును నులిమివేసేందుకు నడుం బిగించింది. అయినప్పటికీ ఈ సందేశం, మెల్లమెల్లగా ప్రజల హృదయాలను మెత్తబర్చడం, జయించడం మొదలెట్టింది. ఎవరి హృదయంలో నిజాయితీ, సత్యాన్ని అంగీకరించే స్వభావం ఉండిందో - వారు ఒక్కొక్కరుగా, ఇద్దరేసి కలిసి ప్రవక్తశ్రీ (స) వారి చుట్టూచేరసాగారు. ఆయన ఆదేశ పాలనా బృందంలో భాగస్వాములయ్యారు. తన చుట్టూ చేరిన ఈ సదాచార వ్యక్తిత్వాల హృదయాల్లో ప్రవక్తశ్రీ (స) వారు - మొట్టమొదట ఏకైక సృష్టికర్త అల్లాహ్ యొక్క ఏకత్వం - ఆయన దాస్యం - విధేయతల లోతైన, బలమైన ముద్రలను వేశారు. దాని ఫలితంగా సహజంగా కేవలం దైవాభీష్టం

కోరి మాత్రమే, ఆచరించే - జీవించే విధానాన్ని వారికి నేర్పారు. ఈ జీవితం, జీవిత వనరులు అన్నీ అల్లాహ్ ప్రసాదితాలుగా స్పష్టపర్చారు. ఈ కారణంగా, అత్యంత సహజంగా, ఆజ్ఞాపించే - చట్టాన్ని నిర్దేశించే అధికారం కూడా కేవలం అల్లాహ్‌కు మాత్రమే ఉందనీ - అందులో మరెవ్వరికీ అధికారంగాని, భాగస్వామ్యం గాని చెల్లదని స్పష్టపర్చారు. సృష్టి సమస్తం, అందులోని జీవ నిర్జీవ పదార్థం మానవులతో సహా అంతా అల్లాహ్ దాసులేననే సత్యాన్ని విస్పష్టంగా వారి ముందు ఆవిష్కరింపచేశారు. ఈ నిరంతర శిక్షణ క్రమశిక్షణల పునాదులపై ఒక అద్భుతమైన, దృఢమైన సంఘటితమైన ఏకదైవ ఉపాసకుల జమాఅత్‌ను ప్రవక్తశ్రీ (స) వారు ఏర్పర్చారు. ఈ సంక్షేమకర దైవ వ్యవస్థకు శత్రువులైన వారు తమ క్రూరత్వం, హింస, దుర్మార్గం, దౌర్జన్యాల బాణాలను జడివానలా కురిపించారు. వారి అమ్ముల పొదులు ఖాళీఅయి పోయాయే తప్ప, ఒక్క దైవదాసుని హృదయం కూడా తౌహీద్ నుండి మరలలేకపోయింది.

ఈ శిక్షణ, ఆత్మ ప్రక్షాళనల ద్వారా - తన చుట్టూ సమీకరించబడిన, ఇస్లాం ఛత్రఛాయలో ప్రవేశించిన కార్యకర్తలందరినీ ప్రవక్త (స) వారు ఒక కుటుంబంలా, ఒక బలమైన కట్టడంలా జతపరుస్తూ, తీర్చిదిద్దుతూ ముందుకు సాగారు. ఈ నిర్మాణం విలువల రీత్యా, సొంత సోదర సంబంధం కన్నా ఎంతో దృఢమైనదిగా ఉండింది. సామూహిక నిర్మాణంగా, రాజకీయ వ్యవస్థగా ఈ బృందం అత్యంత పటిష్ఠంగా ఉండింది. నేటివరకు ఈ నిర్మాణాన్ని, పటిష్ఠతను, దృఢత్వాన్ని ఛాలెంజ్‌చేసే వ్యవస్థ ఏదీ లేకుండాపోయింది. ఈ సందర్భంగా ప్రవక్తశ్రీ (స)వారు విశ్వాసుల వర్గానికి అందించిన బోధనలు, మహితోక్తులు, ఆచరణా పద్ధతులు వర్ణనాతీతమైనవిగా చరిత్ర రుజువు చేసింది. అంతేకాదు ఈ విశ్వాసుల 'ఇస్లామీయ జమాఅత్' ఈ హితవులు, బోధనలు, పద్ధతులపై ఆచరించి చూపిన వైనం సైతం నభూతో నభవిష్యత్‌గా ఉండింది. జీవితంలోని సమస్యలు, వ్యవహారాల విషయమై దృఢమైన సామూహిక నిర్మాణం ఎప్పుడు అవసరమొచ్చినా, ఆ అవసరానికి అనుగుణమైన విధానాన్ని అమలుపర్చే చాకచక్యాన్ని ప్రవక్తశ్రీ (స) వారు నేర్పారు. సామూహికతకు, సంఘ జీవనానికి, నిర్మాణానికి, నాయకత్వ అనుసరణకు అత్యంత ప్రాముఖ్యత నిచ్చారు. ప్రయాణంలో కనీసం ముగ్గురు ఉన్నా వారిలో ఒకరిని నాయకునిగా ఎంచుకొని ప్రయాణం

సాగించమని ఆదేశించారు (మిష్కాత్ గ్రంథం). ముస్లిం సమాజపు ఆలోచనల్లో సామూహిక నిర్మాణానికి అత్యంత ప్రాధాన్యత నివ్వడమేకాక, ఈ ఐక్యత, నిర్మాణ దృఢత్వం కేవలం సాధారణ రాజకీయ అవసరంగా కాక, ధర్మబద్ధ దైవ ఆదేశిత అవసర ఐక్యతగా తీర్చిదిద్దారు. ఒకే శరీరంలోని విభిన్న అవయవాలుగా, ఈ నిర్మాణంలోని సభ్యులు పనిచేసేలా తర్ఫీదు నిచ్చారు. ఈ ఐక్యతా పరిరక్షణకు అవసరమైన జాగ్రత్తలన్నింటినీ అందించారు. ఈ సుదృఢమైన నిర్మాణం, ఐక్యత లేకుండా ఒక ప్రవక్తగా తన అస్థిత్వానికి, ఒక ఉమ్మత్‌గా మన ఉనికికి కారణమైన లక్ష్యం నెరవేర్చబడదని సుస్పష్టం చేశారు. మీరు దృఢంగా ఒక సురక్షితమైన పార్టీగా ఉన్నప్పుడే అల్లాహ్ సహాయం (నుస్రత్) మీ శిరస్సులపై ఆవరించి ఉంటుందని ప్రకటించారు. (యదుల్లాహి అలల్ జమాఅతి) పొరపాటుగా ఎవరైనా ఈ జమాఅత్ నిర్మాణం నుండి ఒక జానెడు దూరం జరిగినా అతను ఇస్లాం యొక్క గుర్తింపు పట్టాను తన మెడలో నుంచి తీసి వేసినట్లుగా భావించాలి. ఈ దూరంలోనే ఒకవేళ అతను దురదృష్టవశాత్తు మరణిస్తే, ఆ మరణం కేవలం అజ్ఞానకాలపు మరణంగా భావించవలసి ఉంటుందని హెచ్చరించారు. (ముస్లిం గ్రంథం) ఈ దృఢమైన సామూహిక ఐక్యత (మిల్లత్) ను నష్టపర్చేలా ఎవరైనా కత్తెర ఉపయోగిస్తే ఆ దుర్మార్గుని శిరస్సును శరీరం నుండి వేరుపర్చమని కఠినంగా శాసించారు.

పై ఆచరణతో పాటుగా ప్రవక్త (స) వారి అనుచర సమాజమైన విశ్వాసుల బృందం అల్లాహ్ ధర్మాన్ని, ఆయన ఇతర దాసుల వరకు చేరవేసే పనిలో నిరంతరం నిమగ్నులై ఉండేవారు. ఎవరైనా అజ్ఞానపు మురికిలో ఉండగా చూస్తే, వారిని జ్ఞానంతో శుభ్రపరిచేవారు. వారిని సృష్టి పూజనుండి రక్షించి, ఒకే ఒక్కడైన సృష్టికర్త ఉపాసకునిగా మలిచేవారు. ఒకే సృష్టికర్త ఆరాధకునిగా, ఒకే ప్రభువు దాసునిగా, ఒకే చట్ట నిర్దేశకుని పాలితునిగా మలిచే కృషి చేసేవారు. చెడును ఎక్కడైనా చూస్తే దానిని వెంటనే నిర్మూలించే కృషిలో లీనమయ్యేవారు. తిరస్కారం, అశాంతి, కల్లోలాలలో ఎవరైనా మునిగి ఉండటాన్ని వారు భరించలేకపోయేవారు. ఈ సందేశ ప్రచార నిరంతర కృషి మక్కాపురిలో పదమూడు సంవత్సరాలు సాగింది. సత్య వ్యతిరేకులు, ధర్మ తిరస్కారులు – సత్యసందేశ ప్రచార ఉద్యమం విజయం సాధిస్తూ ఉండటాన్ని సహించలేకపోయారు. చివరికి వారు సందేశహరుడినే (స)

హతమార్చడానికి పూనుకున్నారు. తద్వారా సత్యసందేశాన్ని, దాని కాంతిని నాశనం చేయాలని భావించారు. ఈ పరిస్థితుల్లో ప్రవక్తశ్రీ (స) వారు, ఆయన ప్రియ సహచరులు తమకు అత్యంత ప్రియమైన మక్కా నగరాన్ని వదిలివేసి, మదీనా పురికి పయనమయ్యారు. మదీనా నగరాన్ని ఇస్లామీయ ఉద్యమానికి కేంద్రంగా చేసుకున్నారు. సత్య తిరస్కారులైన జాత్యాహంకారులు ఇక్కడ కూడా విశ్వాసులను ప్రశాంతంగా ఉండనిచ్చేవారు కారు. అయితే ఇదే సమయంలో మదీనా కేంద్రంగా విశ్వాసుల ఒక బలమైన, దృఢమైన వ్యవస్థ స్థాపించబడి ఉండింది. ఈ సమయంలో చెడు యొక్క వ్రేళ్ళను తుదకంటూ పెకిలించివేయడానికి, మంచిని సమాజంలో వికసింపచేయడానికి చివరి పద్ధతిని అవలంబించడం జరిగింది. అంటే ఇప్పుడు మంచి స్థాపనకు, చెడు నిర్మూలనకు మనసా వాచా కృషి చేయడంతో పాటు 'చేతి'ని కూడా ఉపయోగించడం ప్రారంభించవలసి వచ్చింది. ఒక సుదీర్ఘ కాలం వరకు తాగూత్ శక్తులు మాటిమాటికీ మదీనాపై దండయాత్రలు చేస్తూ ఉండేవారు. ప్రవక్త (స) వారి సహచరులు ఈ దాడులను త్రిప్పికొట్టే ఆత్మ రక్షణా యుద్ధానికి మాత్రమే పరిమితమయ్యారు. ఈ ఆత్మరక్షణకోసం నాటి ఇస్లామీయ జమాఅత్ తమ సర్వస్వాన్ని ఒడ్డి నిలిచింది. ధన, ప్రాణ బలిదానాలను చేసి సత్యధర్మానికి సాక్షులుగా నిలిచారు. ఈ ఆత్మ రక్షణా పాలసీ ద్వారా సత్యతిరస్కారుల శక్తిని తుత్తునియలు చేశారు. చివరికి అరబ్బు భూభాగం మొత్తం తాగూత్ (సత్యతిరస్కార వ్యవస్థ) కబంధ హస్తాల నుండి విముక్తి చేయబడింది. ఈ అద్భుత దృశ్యాన్ని తిలకించిన దైవదాసుల హృదయాలు అల్లాహ్ సహాయం పట్ల కృతజ్ఞతతో నిండిపోయాయి. శిరస్సులు ఆయన సమక్షంలో వినమ్రమయ్యాయి. అయినప్పటికీ వారు తమ బాధ్యతల నుండి విముక్తం కాలేదు. వారి వాహనాలపై జీనులు, రికాబులు ఎప్పుడూ సిద్ధంగా ఉండేవి. ఎందుకంటే అరేబియాలోని చెడు తన ఓటమిని అంగీకరించింది. కాని, అరబ్బు చుట్టూ ఉన్న భూభాగంలోని తాగూత్ చెడు వ్యవస్థ తన పూర్తి శక్తితో నిలబడి కయ్యానికి కాలుదువ్వుతూ ఉండింది. దైవ విధేయుల ఈ బృందం (ఇస్లామీయ జమాఅత్) ప్రపంచంలో చెడు ఎక్కడ ఉన్నా దానిని నిర్మూలించే విధిని ఎలా మరిచిపోగలదు? చెడును తుడిచిపెట్టనంత వరకు విశ్రాంతిమయ శ్వాసను ఎలా తీసుకోగలదు?

## ఒక అపోహ

దివ్య ఖుర్‌ఆన్, ప్రవక్త సంప్రదాయాల ప్రకారం ధర్మసంస్థాపనకు తఖ్వా, బలమైన జమాఅత్, మంచి స్థాపన - చెడు నిర్మూలనలు అనే మూడు ప్రాథమిక అంశాలే పునాదులుగా, చోదక శక్తులుగా ఉంటాయని పై సుదీర్ఘ చర్చ ద్వారా రూఢీ అయింది. పై మూడు ప్రాథమిక విషయాలపై నిష్ఠాగరిష్ఠమైన ఆచరణ అమలు కానంత వరకు ధర్మసంస్థాపనా విధి నెరవేరదు. ఈ సందర్భంగా పాఠకులు ఒక అపోహకు గురిఅయ్యే ప్రమాదముంది. అది - మొదటి అంశం పూర్తి అయిన తరువాత రెండో అంశం, ఆ తర్వాత మూడో అంశంలో అడుగు పెట్టారేమో అని భావించడం జరగవచ్చు. ఈ ఆలోచన సరైనది కాదు. తఖ్వా, జమాఅత్, చెడు నిర్మూలన - మంచి స్థాపన అనబడే పై మూడు ప్రాథమిక విషయాలు ఒకేసారి అమలులోకి తేవడం జరగాలి. ఉద్యమ ప్రారంభానికి ముందు ఏకోన్ముఖవైఖరితో - నిండు హృదయంతో 'లా యిలాహ ఇల్లల్లాహ్ ముహమ్మదుర్ రసూలుల్లాహ్' పట్ల విశ్వాస పూరిత సాక్ష్యం అవసరమౌతుంది. ఈ దృఢ విశ్వాస ప్రకటన తర్వాత ఒక వ్యక్తి 'యా అయ్యుహల్లజీన ఆమనూ!' (ఓ విశ్వాసులారా!) అని సంబోధించే బృందంలో ప్రవేశం పొందుతాడు. ప్రవేశం పొందిన వెంటనే దైవగ్రంథం దివ్య ఖుర్‌ఆన్ ఒకేసారి పై మూడు అంశాలను ఆ వ్యక్తి ముందు ఉంచుతుంది. ఇక తన శక్తి సామర్థ్యాల మేరకు, పరిస్థితుల మేరకు పై మూడు అంశాలను ఆచరించటం ఆ వ్యక్తికి విధి అయిపోతుంది.

పై మూడు ప్రాథమిక అంశాలపై ఆచరణ నిజానికి ఒక దానితో ఒకటి విడదీయరానివి. మొదటి అంశం నుండి రెండవది - రెండవ అంశం నుండి మూడవది విడదీయవీలుకాని అంశాలు. చివరి రెండు అంశాలపై ఆచరణ, నిజానికి మొదట విషయాల్ని పరిపూర్తి చేయడానికే జరుగుతుంది. చివరి రెండు అంశాలు అమలులోకి రానంతవరకు, మొదటి అంశం సంపూర్ణం కాదు. మొదటి అంశమైన తఖ్వా యొక్క హక్కు నెరవేర్చబడదు. కనుక చివరి రెండు అంశాల ఆచరణ మొదటి అంశపు పరిపూర్ణత కొరకేనని గుర్తించాలి.

'తఖ్వా' యొక్క వాస్తవికతను అర్థం చేసుకుంటే, చివరి రెండు అంశాలు

ఎంతటి ప్రాధాన్యత కలవో మనకు ఇట్టే అర్థమవుతుంది. మొదటి అంశమైన తఖ్వా నుండి (నిష్ఠను) రెండవ, మూడవ అంశాలైన దృఢమైన జమాఅత్, చెడు నిర్మూలన – మంచి స్థాపనలు విడదీయడానికి వీలులేని శరీర భాగాలుగా ఉంటాయి. అల్లాహ్ ద్వారా ఆదేశించబడిన ప్రతి ఆదేశాన్ని తు.చ. తప్పకుండా పాటించడం, ఆయన విధించిన హద్దులను ఉల్లంఘించకుండా ఉండటాన్నే 'తఖ్వా' అంటారు. ఈ నిర్వచనాన్ని దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే; ధర్మసంస్థాపనా విధిలోని చివరి రెండు అంశాలు, మొదటి అంశం యొక్క విడదీయ వీలుకాని విభాగాలని స్పష్టం అవుతుంది. ఉమ్మతె ముస్లిమ తన జీవిత లక్ష్యం, గమ్యాలకు చేరడానికి ఉమ్మత్‌లోని వ్యక్తుల మధ్య దృఢమైన బంధం, నిర్మాణం కలిగి ఉండాలి. ఆ నిర్మాణ శక్తి ద్వారా మంచిని పెంపొందించటం – చెడును నిర్మూలించటం అత్యవసరం అయివుంటుంది. ప్రవక్త సంప్రదాయపు వెలుగులో ఈ విధానమే సరైనదని రుజువు అవుతుంది. ఈ ఆచరణల సమాహారాన్నే 'తఖ్వా'గా సంబోధించటం జరిగింది. ఈ అంశాన్ని మరింతగా స్పష్టంగా అర్థం చేసుకోవడానికి దైవగ్రంథం దివ్య ఖుర్ఆన్‌లోని ఈ క్రింది వాక్యాల రుజువును గమనిద్దాం రండి!

**"విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌కు భయపడండి. సత్యవంతులకు తోడ్పడండి." (9:119)**

**"విశ్వాసులు పరస్పరం అన్నదమ్ములు. కనుక మీ సోదరుల మధ్య సంబంధాలను సంస్కరించండి. అల్లాహ్‌కు భయపడండి, మీపై దయచూపటం జరగవచ్చు." (49:10)**

**"ఆయన (అల్లాహ్)కు భయపడండి. నమాజును స్థాపించండి. తమ ధర్మాన్ని వేరు వేరుగా రూపొందించుకున్న మరియు వర్గాలుగా చీలిపోయిన ముష్రిక్కులతో కలసిపోకండి. ప్రతి వర్గమూ తన వద్ద ఉన్న దానితోనే ఆనందపడుతూ ఉన్నది." (30 : 31-32)**

పై మూడు వాక్యాలలోని మొదటి వాక్యంలో 'విశ్వాసులతో కలిసివుంటూ ఒకరినొకరు తోడ్పడుతూ ఉండమని' ఆదేశించడం జరిగింది. ఇక రెండవ వాక్యంలో 'విడిగా ఉన్న విశ్వాసుల మధ్య సంబంధాన్ని సంస్కరించమని, అనగా దృఢంగా కలసిపొమ్మని' ఆదేశిస్తూ ఈ అంశాన్నే 'తఖ్వా'గా పేర్కొనడం జరిగింది. ఇక చివరిదైన

మూడవ వాక్యంలో విశ్వాసుల బృందం (ఉమ్మతె ముస్లిమ) వేర్వేరుగా, వర్గాలుగా చీలిపోవటాన్ని 'షిర్క్'గా పేర్కొనడం జరిగింది. విశ్వాసుల సమాజం (మిల్లత్) ఐక్యతగా ఉండటం, ఏక దైవారాధనకు గుర్తుగా చెప్పడం జరిగింది. అదే సమయంలో తఖ్వా, నమాజ్ స్థాపనలను కూడా ప్రస్తావించడం జరిగింది. 'తఖ్వా' తౌహీద్ యొక్క అంతరంగమైతే - 'నమాజ్' దాని బాహ్య స్వరూపంగా, ఆచరణా విధానంగా ఉంటుంది. ఉమ్మతె ముస్లిమ యొక్క చైతన్యం, తఖ్వా, నమాజ్ స్థాపనలన్నీ ఒకే అంశం యొక్క విడదీయవీలులేని భాగాలేనని స్పష్టమవుతుంది. ఇక ఇస్లామీయ జమాఅత్, దాని సామూహిక దృఢ నిర్మాణం, ధర్మసంస్థాపనకు తప్పనిసరి అంశాలై ఉన్నాయి. పైన పేర్కొన్న అంశాలు లేకుండా, ఉండటాన్ని - నిజమైన 'తఖ్వా' లేదని చెప్పడానికి ఆనవాలుగా ఉంటుంది. అదేవిధంగా మంచిని ఆజ్ఞాపించడం కూడా తఖ్వాలో భాగమేనని రుజువులుగా సాక్ష్యాలుగా చూపే వాక్యాలను గమనిద్దాం :

**"మీరు మంచిని చేయండి అని ఆజ్ఞాపిస్తారు. చెడుల నుండి ఆపుతారు. సత్కార్యాలలో సతతం చురుకుగా ఉంటారు. వారు సజ్జనులు. వారు చేసే ఏ మంచిపనికైనా విలువను ఇవ్వకపోవడం అనేది జరగదు. ఈ తఖ్వా కలవారిని అల్లాహ్ బాగా ఎరుగును." (3:114-115)**

**"విశ్వసించిన ప్రజలారా! మీ చెంతనున్న సత్యతిరస్కారులతో పోరాడండి. వారు, మీలో కాఠిన్యాన్ని చూడాలి. నిష్ఠగల (తఖ్వాగల) వారితో అల్లాహ్ ఉంటాడని తెలుసుకోండి." (9:123)**

పై వాక్యాలలోని మొదటి వాక్యంలో మంచిని స్థాపించడం, చెడును నిర్మూలించటం తఖ్వా గలవారి సహజ లక్షణంగా చెప్పబడింది. ఈ ఆచరణ 'తఖ్వా'లో భాగంగా చూపబడింది. ఇక రెండవ వాక్యంలో చెడును నిర్మూలించే పనిలోని 'ఒక పని' అయిన 'సత్య తిరస్కారులతో పోరాడటాన్ని' తఖ్వాగా అభివర్ణించడం జరిగింది. ఈ సందర్భంగా ఈ క్రింది వాక్యాన్ని కూడా గమనించండి. "విశ్వాసులైన పురుషులూ, విశ్వాసులైన స్త్రీలూ వారందరూ ఒకరికొకరు సహచరులు. వారు మేలు చేయండి అని ఆజ్ఞాపిస్తారు. చెడు చేయవద్దు అని నిరోధిస్తారు" (9:71) అని ప్రబోధించబడిన వాక్యం మిల్లత్ యొక్క ఐక్యతకు, మంచిని స్థాపించే - చెడును నిర్మూలించే ఆచరణలను విశ్వాసపు జమిలి ఆచరణలుగా ఉందనడానికి ప్రబల సాక్ష్యంగా ఉంది.

పై వాక్యాల వెలుగులో పరిశీలిస్తే, అపోహల చీకట్లు ఇట్టే తొలగిపోతాయి. ధర్మసంస్థాపనా కృషిలో మొట్టమొదట దాని మొదటి అంశమైన 'తఖ్వా' - హృదయమంతా నిండి, దాని వెలుగుతో అంతరంగం ఉజ్వలమైతే తప్ప రెండవ మూడవ అంశాలను తాకరాదనే అపోహ పటాపంచలైపోతుంది. అయితే దురదృష్టవశాత్తు ఈ అపోహయే ముస్లిం సమాజంలో సత్యంగా భావించబడుతూ ఉంది. ఈ కారణంగా ఆచరణా మైదానం నిస్తేజమై పోయింది. అల్లాహ్ ధర్మానికి తోడ్పాటు అందించవలసిన ఈ మూడు చక్రాలపై ఆధారపడిన బండి – ఏ బండి అయితే మూడు చక్రాలు లేకుండా నడవలేదో – నేడు ఒకే చక్రంతో నడిచే విచిత్ర విఫల ప్రయత్నం చేస్తుంది. ఫలితంగా ఈ బండి ఒక్క అంగుళం కూడా ముందుకు సాగడం లేదు. సరికదా, రోజు రోజుకు మరింతగా భూమిలో కూరుకుపోతూ ఉంది. నిజానికి ఈ తప్పుడు భావజాలం ఒక కళ్ళగంతగా ప్రత్యేకంగా మన ధార్మిక సోదరుల కళ్ళను కప్పివేసి ఉంది. ఈ ధార్మిక సోదరుల ఆచరణ బాహ్యంగా పరిశీలిస్తే – అత్యంత ధార్మికమైనదిగా, నిష్ఠాగరిష్ఠమైన జీవితంగా కనిపిస్తుంది. కాని, దాని ఆంతర్యం మాత్రం ఇస్లామీయ నిజ భావజాలంతో ఎలాంటి సంబంధం లేనిదిగా ఉంటుంది. ఒక వ్యక్తి ఇస్లామీయ జమాఅత్‌తో మమేకం కానంతవరకు, తన శక్తిమేరకు మంచిని స్థాపించే కృషి చేయనంతవరకు, నిష్ఠాగరిష్టునిగా (ముత్తఖీగా) పరివర్తన చెందడం సాధ్యమే కాదు. కనుక, ఒక వ్యక్తి ముందుగా ప్రమాణబద్ధమైన ధర్మపరాయణుడు కావాలి, ఆ తర్వాత మాత్రమే రెండవ, మూడవ అంశాలపై దృష్టి సారించాలి అని వాదించడం అవివేకం తప్ప మరొకటి కాదు. ఈ మూడు అంశాలు ఒక వృక్షాన్ని పోలి ఉంటాయి. ఒక వృక్షంలోని వ్రేళ్ళు, కాండం, ఆకుల మాదిరిగానే అవి విడదీయరాని భాగంగా ఉంటాయి. ఎప్పుడైతే ఒక విత్తనం మొలకెత్తడం ప్రారంభమౌతుందో అందులో ఒకేసారి చిరు వేరుతో పాటు, సుతిమెత్తని కాండం, పలుచని చిగురుటాకు కూడా ఉనికిలోకి వస్తుంది. ఒకేసారి ఒక దానితో మరొకటి సహాయం పొంది ఎదుగుతాయి, శక్తిమంతం అవుతాయి. మొదటి వేరు మాత్రమే బలంగా ఎదిగి – ఆ తరువాత కాండం బయటికి వచ్చి – ఆ తరువాత తమ సంపూర్ణ రూపంతో ఉనికిలోకి రావడం ప్రకృతి సూత్రానికి విరుద్ధమైనదని మనకు తెలుసు. ఇదేవిధంగా మనిషి హృదయంలో ఎప్పుడైతే విశ్వాసపు విత్తనం విత్తబడి

జీవం పోసుకుంటుందో అప్పుడు కేవలం 'తఖ్వా' వేర్లు మాత్రమే ఎదగవు. ఒక సుదీర్ఘ కాలం తఖ్వా హృదయంలో ఉండి, బలం పొంది వృద్ధిచెందుతూ ఉండదు. అలా వృద్ధి చెందిన తరువాత జాతిని ఐక్యపరచి ఒక జమాఅత్‌ను రూపొందించి తద్వారా మంచిని స్థాపించే – చెడును నిర్మూలించే అవకాశాన్ని వెతుకుతూ ఉండటం సంభవించనే సంభవించదు. తద్భిన్నంగా అత్యంత సహజంగా, శాస్త్రీయంగా ఈ మార్పు జరుగుతుంది. ఎప్పుడైతే విశ్వాసపు విత్తనం హృదయంలో నాటుకుంటుందో – అందునుండి నిష్ఠా గరిష్ఠమైన ఆచరణ (తఖ్వా) అనే చిరువేర్లు మొలకెత్తడంతో పాటు, సాముహిక శక్తి అనబడే ఇస్లామీయ జమాఅత్ కాండం మంచిని ఆజ్ఞాపించే – చెడును నిర్మూలించే ఆకులు సైతం ఉనికిలోకి ఒకేసారి వస్తాయి. ఈ తఖ్వా వేరు హృదయంలో లోతుల్లోకి ... మరింత లోతుల్లోకి ప్రవేశించేకొద్దీ – జమాఅత్ కాండం మరింత శక్తిమంతమై దృఢంగా చేవపట్టి దృఢంగా ఎదుగుతూ ఉండీ – మంచిని స్థాపించే చెడును నిర్మూలించే ఆకులు పచ్చ పచ్చగా, పెరిగి దట్టంగా అల్లుకొని విశాలంగా విస్తరిస్తూ అలుముకుంటాయి. చివరికి "అస్‌లుహా సాబితున్ వ ఫర్‌ఉహా ఫిస్సమాయి" (వేర్లు దృఢంగా, బలంగా ఉండి దాని కాండం, కొమ్మలు రెమ్మలు, ఆకులు ఆకాశాల వరకు చేరుకుంటాయి) అనే అద్భుత దృశ్యం మన కళ్ళముందు సాక్షాత్కరిస్తుంది.

–ః సమాప్తం ః–